# విషయ సూచిక

# ఆంధ్రప్రదేశ్ హోమియోపతి బోర్డు సభ్యుల
# అభిప్రాయములు



ప్రియ మిత్రులు శ్రీ పేరాజు గారికి,

మీరు వ్రాసిన కార్డు, పంపిన పుస్తకము అందినవి. ఇందుకు చాల కృతజ్ఞుడను.

నేను ఆ పుస్తకము (విద్యార్థుల సారూప్యౌషధలక్షణ దీపిక) ఆమూలాగ్రముగా చదివితిని. మందులయొక్క ప్రధాన లక్షణము లన్నియు అతి సమర్థతతోను, క్లుప్తముగాను, మనస్సుకు హత్తునట్లు వ్రాయుటచే ప్రతి ఔషధముయొక్క సూచకలక్షణములు సులువుగా గ్రహింపనగును. ప్రశ్నోత్తరముల రచన విద్యార్థుల కెంతైన ఉపకరించును. వైద్యమును చేయుచు వైద్యానుభవము మెండుగా గలవారు రచించిన యీ పుస్తకప్రచురణకు నా సుస్వాగతము. గ్రంథాభివృద్ధికి నా ఆశీస్సులు.

39, కచేరీ రోడ్
మైలపూర్, మద్రాస్
30—3—1959

డా. టి. వెంకటసుబ్బారావు
H. L. M. S. (Cal)
సభ్యుడు
ఆంధ్రప్రదేశ్ హోమియోపతి బోర్డు.

ప్రియమిత్రులు డా. పేర్రాజు గార్కి,

సకాలములో మీ పుస్తకము (విద్యార్థుల సారూప్యౌషధలక్షణ దీపిక) నందుకొంటిని. పనితొందరలో వెంటనే జవాబు వ్రాయలేక పోయినందుకు చింతిల్లుచున్నాను. ప్రశ్నోత్తర రూపములోనున్న మీ "విద్యార్థుల హోమియోపతి మెటీరియా మెడికా" ఆమూలాగ్రముగా చదివాను.

అది మిక్కిలి ఉత్తమ గ్రంథమని తెలుపుటకు సంతసించుచున్నాను. సారూప్యవైద్యుల రిజిస్ట్రేషను కొరకు జరుగనున్న పరీక్షల పాఠ్య ప్రణాళికకు పూర్తిగా సరిపడి సమగ్రముగా నున్నది. పరీక్షలకు హాజరగువారికి, సారూప్యవైద్యము చేయువారికి యిది వరప్రసాదము. ఈ విధముగా యీ పుస్తకమును రూపొందించి మీరు హోమియోపతి వైద్యవిధానానికి గొప్ప సేవ చేసినవారయ్యారు.

విజయవాడ – 2<br>1—4—1959

యస్. చంద్రమౌళి M.B., B.S.,<br>ఆంధ్రప్రదేశ్ హోమియోపతిబోర్డు సభ్యులు.

ప్రియమైన డా. పేర్రాజు,

నేను "విద్యార్థుల సారూప్యౌషధలక్షణ దీపిక"ను ఆమూలాగ్రముగ చదివితిని. అందు మంచి భోగట్టాయు, ఉపయోగపడు పెక్కు హాంశములు ఉన్నవని తెలుపుటకు సంతసించుచున్నాను,

స్వతంత్రముగా హోమియోపతి వైద్యవిధానము చదువువారికి చాల ఉపకరించునని నేను చెప్పగలను.

యమ్. గుర్రాజు<br>ఆంధ్రహోమియో మెడికల్ కాలేజి ప్రిన్సిపాల్,<br>ఆంధ్ర ప్రదేశ్ హోమియోపతి బోర్డు సభ్యులు.

# పత్రికా సమీక్ష

'విద్యార్థుల సారూప్యౌషధ లక్షణ దీపిక' రచయిత శ్రీ తోలేటి పేర్రాజు "స్టూడెంట్సు హోమియో పబ్లిషింగు హౌసు" భీమవరం (ప॥ గో॥ జిల్లా) వారిచే ప్రచురింపబడినది. మూల్యము రు. 4/- సభ్యులకు రు. ౩-50. శ్రీ పేర్రాజుగారు ప్రాచీన భారతీయ సాంప్రదాయ ప్రకారము గురు శిష్య సంవాదరూపంలో వ్యావహారిక భాషలో పాఠకులకు సూటిగా అర్థమయ్యేటట్లు ఈ గ్రంథమును వ్రాశారు.

మెడికల్ బోర్డువారు తమ పాఠ్య ప్రణాళికలో నిర్ణయించిన 'కెంటు' 'నేష్' గార్ల మెటీరియా మెడికాల నాధారము చేసుకొని తమ ముప్పది వత్సరాల వైద్యానుభవమును జోడించి హోమియో వైద్యుల పరీక్షలను దృష్టియందుంచుకొని సంగ్రహ రూపంలో రచయిత యీ గ్రంథమును వ్రాశారు. ఆంధ్ర హోమియో వైద్యులు, అభిమానులు సంపూర్ణ సహకారం డాక్టరుగారి కృషికి తప్పక లభింపగలదనుటలో ఎట్టి సందేహమును లేదు.

విజయవాడ
3—5—1959

"శర్మ"
విశాలాంధ్ర.

# మనవి

ఈ గ్రంథములు చదివిన వారలు, మిత్రులు, సారూప్య అభిమానులు, పలు తావులందుగల యితరులు పెక్కుమందినుంచి యీ గ్రంథమును శ్లాఘించుచు ఎల్లరకు అవగాహన అగునట్లు శ్రమతో యీ గ్రంథమును రచించిన రచయితలను అభినందించుచు ప్రచురణార్థము మాకు లేఖలను పంపుచున్నారు. స్థలవిస్తర భీతిచే ప్రస్తుతం అన్నిటిని ప్రచురింపజాలనందుకు క్షమింప ప్రార్థన.

ఇట్లు,
పబ్లిషర్సు.

# అం కి త ము

మిత్రులు, అస్మదీయ శ్రేయోభిలాషులు, సాహిత్య శాస్త్రాభిమానులు,
ఈ గ్రంథములువ్రాసి ప్రచురించుటకు నన్ను అన్నివిధములా
ప్రోత్సహించి సాయపడిన నర్సాపురం వాస్తవ్యులు
**శ్రీ గెద్దాడ అప్పారావు** *B. A., B. L.,* గార్కి
ఈ గ్రంథమును వాత్సల్యపూర్వకముగా
స మ ర్పిం చు కొ ను చు న్నా ను.

## 114. రనన్క్యులస్ బల్బోసస్

## (Rananculus Bulbosus)

1. మానవశరీరంపై "రనాన్క్యులస్‌బల్బోసస్"యొక్క సాధారణ ప్రయోజనమేమి ?

కండరములత్వచలపైనను, హృదయకుహరకండరములపైనను చర్మముపైనను దీని ప్రభావము మెండు.

ఒళ్ళునొప్పులు, తీపు, కదిలితే హెచ్చుతాయి. హృదయకండరములందు నొప్పి విడచి విడచి వస్తుంది. ఆల్కహాల్ సేవించడంచే కలిగే దుర్గుణాలకు పనిచేస్తుంది. ఎక్కిళ్ళు. జలోదరం, శరీరం అదుర్లు.

2. "రనాన్క్యులస్"యొక్క మానసికలక్షణములేమి ?

హెచ్చరిక నసిస్తుంది. నిరాశ, నిస్పృహ, నిరుత్సాహం, మరణించాలనే కోరిక. దెయ్యాలపేరుచెపితే హడలు; చాలకోపదారి. కయ్యానికి కాలుదువ్వుతాడు. మనస్సు కంగారు. నుదురులోను కపాలభాగంలోను నొప్పి.

3. "రనాన్క్యులస్"కు కంటిసంబంధమగు బాధలేవి ?

కండ్లుమంటలు; కళ్ళుబిగబడుతాయి. సాయంకాలం వ్రిధానంగా కుడికంట్లో పోట్లు. కుడికంటి క్రిందరెప్ప మంట, ఒరుపు. కంటిపైన కమిలిన ఊదారంగుగల మొలకలు. గర్భవతులకు వస్తువులో సగముమాత్రమే కనుపించు (Hemiopia) లక్షణమును నివారిస్తుంది. పగటిపూట అంధత్వం. కంటిముందుమబ్బుగా ఉంటుంది. చూపుసరిగా ఆనదు.

4. చర్మముపై 'రనన్క్యులస్' ప్రభావమేమి ?

చేతులపాదములపై చిన్న మొటిమలు; గజ్జికురుపులు. బుగ్గలులా లేచే చిడుము దీనితో తగ్గుతాయి. బఠాణీగింజలలా రసితో కూడిన బుగ్గచిడుము, మంట, సున్నితమగు చుక్కలతో నల్లగానో లేక కమిలిన ఊదారంగుగానో ఉంటాయి. చేతులయందు నీటిబుగ్గలవంటి మొలకలు.

ఆనికాయలు : తాకితేబాధ; భగ్గుమని మండిపోతాయి. అరచేతులు, వేళ్ళచివరిభాగాలు పగులుతాయి. అరికాళ్ళల్లో మొలకలు, ఆనికాయలు (ఏంటి-కూరైడ్). ఇందలి కురుపులు నీటిబుగ్గల్లా లేస్తాయి.

5. 'రనన్క్యులస్'లో ఛాతికి సంబంధించిన లక్షణములేమి ?

ఛాతీయొక్క నిలువుఎముక (Sternum)లో పోటు, తీపు; కమక గొట్టినట్లు ఆటు పోటు. ఛాతీయొక్క పంజరపుటెముకలందు (రిబ్సు) వాటిమధ్యన, రెండువొక్కలలోను పోట్లు, పచ్చి, సలుపు.

రెండుభుజములమధ్యనా పోట్లు, ఛాతీయొక్క అన్నిభాగములందుపోట్లు; తీపు. కదలినా గాలిపీల్చినా బాధలు హెచ్చుతాయి. ఊపిరినొప్పికి దివ్యమగుమందు (బ్రై). ఛాతీయందు వాతనొప్పులు. పొట్టకొక్కతే పచ్చిగానుంటుంది. అమితంగా వేడిచేసి చల్లగాలికి అను బయట ఉండడంవలన వచ్చే ఊపిరినొప్పి. ఊపిరితిత్తులపై పొరవాయడం (Pleurasy) విపరీతశీతం (Pneumonia) వచ్చినప్పుడు వాడవలసినమందు.

6. పావుపుటలో 'రనన్క్యులస్'యొక్క ప్రధాన నైసర్గికలక్షణములను వ్రాయుము.

శరీరమంతా అదురు. శరీరం కదలకపోయినట్లు నొప్పులు, కోపంచే కంపం, వణకు, మంట, పోట్లు. అరచేతులలో కాలినబొబ్బల్లా పొటకరింపులు. మంట, పోటు, దురదతో బుగ్గలవంటి కురుపులు (కేంథారిస్, రూస్‌టాక్సు).

ఛాతీతీపు. నొప్పి; గూళ్ళఎముకల మధ్య నొప్పులు. కదిలినా మెదిలినా భరించరాని చురుకులు, పోట్లు. ఊపిరినొప్పి. తేమగాలిలోను, కదిలినా, వంగినా ఛాతీలోను పోట్లు

తేమగాలిలోను, నీరు గాలికి ఊపిరికిత్తులవాపు. ఛాతీయందలి ఎముకల్లో సున్నితమగు సూదిపోట్లలా నొప్పులు విడచి, విడచి వస్తాయి. కదిలినా, ఊపిరిపీల్చినా, వంగినా భరించరాని బాధ. ఎక్కిళ్ళు ముఖ్యంగా త్రాగినతర్వాత వస్తాయి.

కుడికంటిపోట్లు. సిరస్సు పెరిగిపోతున్నట్లు భావన.

నుదుటిలోను, నడినెత్తిని పోటు, నొప్పి. పగలు చూపుఆనదు.

కంటిముందు మబ్బుగాఉన్నట్లు మసక.

అరికాళ్ళలో ఆవిరికాయలు, మొటిమలు.

గురక.

## 115. రటేనియా (Ratanhia)

1. "రటేనియా" సాధారణముగా కలుగజేయు లక్షణములేమి ?

దీనికి ఆసనసంబంధమగు లక్షణములు ప్రాధాన్యమైనవి. ఈ విషయములో యీమందు నిరూపింపబడి ప్రసిద్ధికెక్కినది.

పళ్ళసలుపు, పోటు, తీపు. అపరిమితముగా ఎక్కిళ్ళు. చను మొనలు పగుళ్ళు (గ్రాఫైటిస్) నుసిపురుగు.

2. 'రటేనియా' కుదర్చగల ఆసనసంబంధమగు వ్యాధులేవి ?

మలబద్ధం. ఎంతో కష్టంపై గట్టిమలం వెడుతుంది. మూల వ్యాధి (పైల్సు) ముందుకు తోసుకొనివచ్చి చాలసేపు అనగా గంటల తరబడి ఆసనంమంట, పోటు (సల్ఫర్). పేగులు మాంద్యంగా ఉంటాయి. విరోచనానంతరం ఆసనంలో గాజుముక్కలతో కోస్తున్నట్లు, గుచ్చుకుంటున్నట్లుబాధ, పోటు. విరోచనానంతరం కోయుచున్నట్లు ఆటుపోటు. పలచని విరోచనమైనా మంటే.

ఆసనం పగుళ్ళు; ఆసనకండరంలో బాధ. బాలింతల చను కొనలుపగిలి బీటలుతీస్తాయి. నులిపురుగు, నుసిపురుగు. ఆసనందురద; ఆసనంనుండి ఊటకారుతుంది.

3. 'రటేనియా' కుదర్చగల దంతవ్యాధులేవి ?

గర్భవతులకు తొలిమాసములలో భరించలేని దంతశూలం; పడుకుంటే ఉద్రేకము, అందుచే లేచి పచార్లుచెయ్యాలి ఉపశాంతికొరకు.

4. "రటేనియా"కుగల ప్రధానమైన సర్గికలక్షణములను 15 పంక్తులు మించకుండా వ్రాయుము.

అసనం అతిసున్నితం. ఆసనకండరం అతిసున్నితమే (లెకాసిస్). ఆసనంచుట్టునాబీటలు, పగుళ్ళు. విరోచనానంతరం భరించరానిపోటు. (ఇగ్నీషియా, తూజా, ఏసిడ్-నిట్రు).

మలబద్ధం : విరోచనం అతికష్టంపై గట్టిగాఅవుతుంది. మూల వ్యాధి మొలకలు ఆసనంనుండి బయటకువచ్చి గంటలతరబడి ఆటు,

పోటు; ఆసనంలోమంటలు. విరోచనమయ్యాక ఆసనంలో కోస్తున్నట్లు బాధ, పోటు. బాలింతల చను మొనలు పగుళ్ళు, బీటలు. చూలింత లకు తొలినెలల్లో విపరీతమగు పంటిపోట్లు. పడుకోనివ్వదు. ఉపశాంతినిమిత్తం లేచి పచార్లు చేయవలసిన దే. విరోచనసమయంలో బిగబడితే తలసగిలేటట్లు తలనొప్పి. విపరీతమగు ఎక్కిళ్లు. తిండితిన్నాక ఎక్కిళ్ళు.

నుసిపురుగులు, క్రిములు. ఆసనంనుంచి ఊటకారుతుంది. దుర్గం ధంవేయు విరోచనాలు–మంట. మెదడు నుదురుద్వారా ముందుకు పడిపోతున్నట్లు భావన.

గర్భవతులు పడుకున్నా, రాత్రిసమయాన్ని, వేడివలనా, అన్నం తిన్నాకను, విరోచనమయ్యాకను బాధలు హెచ్చుతాయి. పచార్లు చేయడంవల్ల, సీతలంచేత, స్నానంవల్ల, వేడినీటితో కడుగుటవలనా ఉపశాంతి.

## 116. రూఅం (Rheum)

1. "రూఅం" యొక్క సాధారణ నైసర్గికమేమి ?

ఇది పిల్లలమందు. పిల్లలకు పులుపువాసనవేయు విరోచినాలు. పళ్ళురావడం కష్టమవుతుంది. పిల్లలశరీరమంతా పుల్లనివాసన. పిల్ల లకు పళ్ళు మొలిచేకాలంలోను, పాలుకుడిచేటప్పుడు ఉపయోగపడు తుంది.

2. ఏఏ పిల్లలవ్యాధులకు 'రూఅం' మందు ? నిరూపించుము.

పిల్లలకు పళ్ళువచ్చేసమయాన్న, పాలుతాగేటప్పుడు ఉప యోగపడే ప్రధానమగుమందు. శిశువు పుల్లనివాసనకొడుతాడు.

శరీరమంతా అదేవాసన; స్నానంచేయించినా, తలఅంటినాకూడా ఆవాసనపోదు. (హిపార్-మెగ్నీషియా-కార్బ). విరోచనం బూడిద వర్ణంగా ఆమంతో నిండిఉంటుంది. విరోచనం పలుచగాను, జిగురుగాను అవుతుంది. విరోచినానికిముందు కడుపులో నులినొప్పి. విరోచనమయాక ఆసనంతీపు. విరోచినానికిముందు మూత్రానుమానం; పోస్తే పూర్తిగాఅవదు. పులుసువిరోచినాలు, కడుపునొప్పి; దానితో గిలగిల్లాడిపోతారు.

రాత్రిళ్లు నిద్దురపోరు, ఒకటేఏడుపు, పోరు, ఆరాటం. ఇది, అది కావాలని మారాముం. పోరుపెట్టడం (సొరినం). కాని తానుమక్కువతో ఆడుకునే ఆటవస్తువులన్నా అయిష్టమే (సినా, స్టెఫిసగ్రియా).

తలంతా ఒకటేచమట్లు. ఈచమట్లు, పడుకున్నా, మేలుకున్నా పోస్తాయి. కదిలినా కదలకపోయినా తలవెంట చమట్లు కారుతాయి, దీనితో వెంట్రుకలన్నియూ తడిసిపోతాయి. ముఖంపై ముఖ్యంగా ముక్కుచుట్టునా, నోరుచుట్టునా చల్లనిచమట్లు పోస్తాయి. శిశువు సర్వదా చమటలతో తడిసిఉంటుంది. ఆచమట్లు పులుపువాసనవేస్తే వెయ్యవచ్చు లేదా లేకపోవచ్చు. (కాల్కేరియా-కార్బ). పళ్లుచాల కష్టంపై మొలుస్తాయి. శిశువుకు స్థిమితంఉండదు. చికాకు, కోపం, మంకుతనం, ముఖం పాలిపోయి ఉంటుంది. శరీరం పులుపువాసన (క్రియోసోట్-కెమోమిల్లా)తినడానికి యివీ-అవీ కావాలంటుంది. ఏదిచ్చినా తినదు. కోపం.

శూల : ఏమాత్రం బట్టతోలిగినా, చెయ్యి - కాలుపై గుడ్డ చెదరినా కడుపులో నులినొప్పి, పులుపువిరోచినాలు. విరోచనమైనా నులినొప్పితగ్గదు. నొప్పులు శిశువును నిలబెడితే హెచ్చుతాయి. బొడ్డు

చుట్టునానొప్పి, విరోచినాలు. పశుపురంగు విరోచినాలు; విరోచనం నిలువడం చే ఆకరంగుగా మారుతుంది (అర్జెంటంనిట్టు) విరోచనసమయంలో చలి వణకు. శరీరంయొక్క పైభాగమున చమట్లు. పిల్లలకు పళ్ళు మొలిచేకాలంలో అయే పులుపువిరోచనాలకు, బాలవిసూచి (Cholera infantam)కి అద్భుతమగుమందు.

3. "రూఅం" యొక్క ప్రధాన నైసర్గికలక్షణములను వ్రాయుము ?

కదిలితే కీళ్ళుఅన్నీ నొప్పులు.

కీళ్ళయందు, కండరాల్లోను బుడగలు లేస్తున్నట్లు ఉంటుంది.

పడుకున్న వెంపు మొద్దుబారి స్పర్శజ్ఞానం పోతుంది.

గాఢనిద్ర భంగమైనట్లు శరీరమంతయూ బరువు. వాళ్ళువిరుపులు, బద్ధకం, బలహీనత.

శిశువులు పాలుకుడిచేసమయాన్ని, పళ్ళు మొలిచేకాలంలోను వచ్చే బుగ్మతలకు నిరుపమానమగుమందు.

నోరుచుట్టునా, ముక్కుకొననూ, అరచేతుల్లోను గొడ్డంమీద. చల్లని చిరుచమట్లు.

తెల్లవార్లు నిద్దురపోరు, ఏడ్పు. అటు, యిటు కొట్టుకుంటారు. పులుపువిరోచినాలు; విరోచినానికిముందు మెలినొప్పి; అయాకఆసన తీపు. కడుపులోపోట్లు; పోరు; మెలికెలుతిరిగిపోతారు; చేతుల్లోఉండరు. గుడ్లతొలిగిస్తే భరించరానిపోట్లు. విరోచనం అయేటప్పుడు కుదుపు, చలి. నిద్దరలో శ్వాస గుట్టుతోఉంటుంది.

కాలి బొటనవేలి కణుపులో ఆమవాతం (Gout).

## 117 రొడోడెంౢడన్ (Rhododendron)

1. "రొడోడెంౘడన్"కుగల ప్రధాన నైసర్గికసూచకలక్షణమేమి?

దీని ప్రధానసూచకలక్షణములు దీని ఉద్రేక ఉపశమనములే. తేమ తుఫానుగాలిలో ఉద్రేకించుట దీని నైసర్గికము. ముఖ్యంగా ఉరుములు, మెరుపులతో కూడిన తుఫానుగాలి. యీగాలివలన ముందుగా యిందలి వ్యాధిలక్షణములన్నియు ప్రకోపిస్తాయి. తుఫానన్నా ముఖ్యంగా ఉరుములన్నా నరముల దౌర్బల్యంవలన భీతిగలవారికి పని చేస్తుంది. తుఫాను లేక గాలివానపట్టాక కొంచెంవుపశమిస్తుందివ్యాధి. స్థిమితంగావుంటే వుద్రేకించడం కాస్త యిటు అటు పచార్లుచేస్తే వుపశమించడం దీనికి మరొక సూచకలక్షణం (రూస్టాక్సు). దీని నొప్పులు వేళ్ళుపారి శల్యగతమైవుంటాయి. ఎముకలపైభాగం, దంతాలు, ముంజేతి ఎముకలు, కాలి ఎముకలు, నాళ్ళు, కండరాలు స్వాధీనంతప్పి బాధగావుంటాయి.

2. తేమగాలిచే ఉద్రేకంకలిగే లక్షణంగల అరడజను మందులను పేర్కొనుము.

(1) డల్కమరా. (2) నేట్రంసల్ఫ. (3) రొడోడెండ్రన్. (4) రూస్టాక్సు. (5) నక్సుమోశ్చాటా. (6) కాల్కేరియాఫాస్. (మంచుపడేరోజుల్లో అని చెప్పుకోవాలి).

3. 'రొడొడెంౘడన్' యొక్క కీళ్లనొప్పుల స్వభావమేమి?

సాధారణంగా నొప్పులు ఒకకీలునుండి మరొకకీలుకు మారుతుంటాయి. ఈనొప్పులు స్థిమితంగాఉన్నప్పుడు, గాలివానకుముందు, తేమగాలివలనా వుద్రేకించి,కదలడంవలనా, వెచ్చకలిగేటట్లు కట్టిఉంచడంచేత ఉపశమిస్తాయి. అవయవాలయందు, సిరస్సులోను నొప్పులు.

కీళ్ళవాపు, పోటు, తీపు, కీళ్ళుబిగుసుకొనిపుంటాయి. మెడ, నడుం బిగుసుగుపోయి కమశక్కొట్టినట్లుబాధ. కదలికవలన కాస్త ఉపశాంతిస్తుంది. భారమితివలె తుఫానుగాలికి నొప్పులుహెచ్చడం అనంతరం తగ్గడం. కుడితట్టుబాధలు హెచ్చు. కాళ్లు ఒకదానిపై మరొకటి అడ్డంగావేస్తేనేగాని నిద్రపట్టదు. ఇదొక దీని ప్రత్యేకలక్షణం.

5. బీర్జములపై "రొడోడెంద్రన్"కు ప్రత్యేకతకలదు; దానిని విశదీకరింపుము.

బీర్జములువాచి నలగకొట్టినట్లు, బిగలాగుచున్నట్లుబాధ. ఈ నొప్పిబాధ పొట్టలోకి తొడల్లోకి పోడుస్తుంది; ముట్టుకోనివ్వడు. సాధారణంగా యీనొప్పులు వాతంవలన వస్తాయి. చల్లగాఉన్న తడిరాళ్ళపైకూర్చుండుటచేత, తేమప్రదేశాల్లో తిరగడంచేత. అండాలువాచి ఆటు, పోటు పెడుతాయి. సాధారణంగా కుడిబీర్జంవాస్తుంది. పిల్లల వరిబీజానికి బాగాపనిచేస్తుంది. వృషణాలపై చర్మందురద, వులారం.

6. 'రొడొడెంద్రన్'వలె బీర్జాలువాపుకలిగించే కొన్నిమందులనువ్రాస్తూ-హేతువులను పేర్కొనుము.

ఆరంమెటాలికం; క్లిమేటిస్; పల్సటిల్లా; ఆర్జంటంమెట్; స్పాంజియా.

సిఫిలిస్ చే కలిగే అండాలవాపుకు "ఆరంమెటాలికం"

గనేరియా జీర్ణించడంవల్ల కలిగేఅండాలవాపుకు 'క్లిమేటస్'.

ఈ కారణానికి 'పల్సు'కూడా పనిచేస్తుంది.

తేమలోతిరగడంచే వాతంచేసి బీర్జాలువాసే "రొడొడెం(డన్"

7. ఉరుములు, మెరుపులు-గాలిలోని విద్యుత్ప్రకోపంవలన కలిగేవ్యాధి లక్షణాలకు వాడనగుమందులను వ్రాయుము.

ఫాస్ఫరస్; నేట్రంకార్బ; సైలీషియా; రొడొడెండ్రన్; సోరినం

8. "రొడొడెండ్రిన్" యొక్క స్వాభావిక లక్షణములేవి ?

ఉరుములు, మెరుపులుఅంటేభయం; మెరుపులతో కూడిన తుఫానువచ్చేముందు వ్యాధిప్రకోపిస్తుంది. తుఫానువచ్చాకా కొద్దిగా బాధలు ఉపశమిస్తాయి.

కీళ్ళవాతం, కీళ్ళనొప్పులు, కీళ్ళవాపు, నొప్పులు వగైరాలు తరచు ఒకకీలునుండి మరొకకీలుకు మారుతాయి. రాత్రిళ్లు కదలక కూర్చుంటేను; తుఫానుగాలిలోను, తేమవలనా నొప్పులు, వ్యాధిలక్షణాలు ప్రకోపిస్తాయి. కాళ్ళు ఒకదానిపై మరొకటి అడ్డంగావేస్తేనే గాని నిద్రపట్టదు, నిద్రపోడు.

కుడికాలు బొటనవ్రేలికణుపు-వాపు-ఆమవాతం. పిచ్చిలువాచి ముఖ్యంగా కుడివృషణంవాచి రాయివలెఅయి ఆటు, పోటు. అవయవాలపై చిరుచమట్లు. విశ్రాంతిసమయంలో నీర్సం నిస్సత్తువచే పడుకున్న వెంపు మొద్దుబారుతుంది.

పన్నుయిగుళ్లను హరింపచేస్తుంది. పళ్ళపోటు, సలుపు.

చల్లనినీరుత్రాగితే పొట్టలోపొట్లు. సీతలంచేత, పళ్లుభుజించుట చేత అతిసారవిరోచినాలు.

పిల్లల వరిబీజం తగ్గుతుంది.

నెలసరిలో జ్వరం (బెల్లు, గ్రెఫైటిస్, ఫాస్ఫరస్, సెపియా.)

## *118.* రస్టాక్సికొడెండ్రన్ (Rhus Toxicodendron)

1. రస్టాక్సుయొక్క యొక్క సాధారణనైసర్గికములేమి ?

వానలో తడవడంవలనా, తేమలోతిరగడంచేత, బాగాచమట్లు పట్టినప్పుడు చమటలు ఆరకుండా తడిస్తేవచ్చే రుగ్మతలకు, బాధలకు లేక వున్న బాధలు ప్రకోపించే స్వభావంవున్నప్పుడు, కుదుర్పుట దీని నైసర్గికం. తేమగాలిచే వుద్రేకించడం, వుష్ణంచే వుపశమించడం దీని ప్రత్యేకత. సాధారణంగా ఒళ్ళునొప్పులు, శరీరమంతయు కుళ్ళపొడిచి నట్లు ఆటు, పోటు, తీపు. కండరాలలో పీకుడు; ఆరాటం; దొర్లడం; స్తిమితంలేకపోవడం ఇవన్నియు కదలుటచేత తగ్గుతాయి.

"రస్" యొక్క ప్రధానకేంద్రం కీళ్లతడపలు. మితిమీరిన బరువులెత్తడంవలననూ, వానలో తడవడంచేతను, తేమలోతిరగడం వలననూ, చలిగాలి సోకడంచేతను కీళ్ళతడపలు బిగుసుకుపోయినొయ్యి బారుతాయి. కదిలేటప్పుడు నొప్పిగావున్నా కదిలినకొద్దీ కీళ్ళుసాగి నొప్పులు తగ్గుతాయి. నడకచే నొప్పులు తగ్గినా విస్తారం నడిస్తే"రస్" రోగి అలసిపోతాడు. మానసికంగాగాని శారీరకంగాగాని ఏమాత్రం మితిమీరి కృషిచేసినా అలసిపోయే స్వభావం యీ మందుది.

కీళ్ళవాతం, నొప్పులు – కండరాలు, కీళ్ళతడపలు బిగుసుకు పోవడం; శల్యగతపోట్లు, ఒళ్ళు ముద్దలాఅయి ఆటు, పోటు, తీపు. ఇవన్నియు చలిసోకి చమట్లు అణగారుటచే ప్రకోపిస్తాయి యీ మందులో, నాలుక పొడారి నాలుక అగ్రంలో అంటే చివరకొనయందు త్రికోణాకారంలో ఎఱ్ఱగా వుంటుంది. ఇది "రస్టాక్సు" ను సూచించే ప్రముఖ లక్షణం. ఈ లక్షణసూచనతో పెక్కు రుగ్మతలను 'రస్టాక్స్' తో నివారించవచ్చు.

ఇందలి ప్రధాన నైసర్గిక లక్షణాలు. దీని ఉద్రేక ఉపశమనాలు తరచు కదలుచుండుటచే ఈ రోగి ఉపశమనం పొందుతాడు. తేమచేత, స్థిమితంగా వుండడంచేత యిందలి వ్యాధి లక్షణములన్నియు ప్రకోపిస్తాయి.

2. 'రస్టాక్సు'కుగల మానసిక లక్షణాలేమి ?

అస్పష్టమగు మాటలు. అసందర్భమగు వాగుడు, ప్రశ్నకు నిదానించకుండా తొందరగా జవాబిస్తాడు. మానసిక ఆందోళన. రాత్రిళ్ళు అమిత భయం. సాధారణంగా దీని వ్యాధులన్నియు రాత్రి కాలంలో వస్తాయి. సంధిపేలాపన రాత్రిళ్ళు హెచ్చు. జీవితమంటే రోత. ఆత్మహత్యను గూర్చి యోచన. ఎందులోనైనా మునిగి చచ్చిపోవాలని చూస్తాడు. కాని చావంటే విపరీతమైన భయం. చావాలని నిశ్చయించుకుంటాడు. కాని చచ్చేటందుకు ధైర్యం చాలదు. ఆరాటం, ఆందోళన, ముక్కుమీదుంటుంది కోపం. విశ్రాంతి ఉండదు. కంగారు, నరాల దుర్బలత్వం.

3. ఆందోళన స్వభావముగా గల మూడు మందులను వ్రాసి వాటిని పోల్చి వ్రాయుము.

(1) ఆర్సినిక్ ఆల్బ (2) ఎకనైట్ (3) రస్టాక్సు

'ఎకనైట్'కు తీవ్రమగు వాపు జ్వరాల ప్రథమావస్థలో ఆందోళన ఉంటుంది. 'ఆర్సినికం'కు సన్నిపాతం జ్వరంలాటి లోజ్వరాల్లో రెండవ వారంలో వుంటుంది ఆందోళన, ఆరాటం. 'ఆర్సినికం'కు వున్నంత నిస్త్రాణగాని 'ఎకనైట్'లో వున్నంత వుద్రేకంగాని 'రస్టాక్సు'కు ఉండదు. "రస్టక్సు"లో ఆందోళన, దౌర్లడం, ఆరాటం, శరీరమందలి నొప్పుల మూలంగా వుంటుంది. 'ఆర్సు, రస్' టయిఫాయిడ్

జ్వరాలలో ఆరాట ఆందోళనకు పనిచేస్తాయి. 'ఎకనైట్' ఎన్నడూ సారూప్యంకాదు సన్నిపాతంలో.

కాని యీ మూడింటికి ఆందోళన, ఆరాటం ప్రముఖలక్షణాలు.

4. 'రస్టాక్సు' ఎట్టి జ్వరాలను సూచిస్తుంది ? నివారిస్తుంది ?

చలిజ్వరాలను కుదురుస్తుంది; విడుపు జ్వరాలను నివారిస్తుంది. విషపడిశం, కీళ్ళజ్వరాలను సమూలంగా పోజేస్తుంది. లోజ్వరాలలోను, విడువకుండా చాలరోజులుండే యితరజ్వరాల్లోను ముఖ్యంగా సన్నిపాతజ్వరాల్లోను దీనిసూచించే గుణాలుంటే జ్వరాన్ని అణిచేస్తుంది.

5. చలిజ్వరాల్లో వాడనగు దీని ప్రధాన సూచకలక్షణములేమి ?

చలిలో విపరీతంగా దగ్గువుండడం దీనిని సూచించేప్రముఖ లక్షణం. చలిజ్వరాల్లో (చైనా, సల్ఫర్, బ్రై, సబడిల్లా) చలి ఏదో ఒకకాలిలోనో తొడలోనో ప్రారంభిస్తుంది. దాహంవుండదు. ముఖానికి చమట్లుపోస్తాయి.

6. సన్నిపాతజ్వరం (Typhoid) లో "రస్టాక్సు" సూచించే లక్షణాలను తెల్పుము.

రోగిస్వభావికంగా నెమ్మదిగాఉంటాడు; సంధికూడ చాలసాత్వికంగాఉంటుంది. కొన్నిసమయాల్లో పారిపోవాలని, పక్కమీదనుండి దుమకాలనేభావం. మానసికంగాను భౌతికంగాను ఆందోళన, ఆరాటం. పక్కపై యిటుఅటు ఒక్కతీరునే దొర్లుతాడు. దోరాటం. ఒకసారి ఒకవెంపుతిరిగి పడుకుంటాడు. అంతలోనే రెండోవెంపుతిరుగుతాడు. మరుక్షణంలో లేచికూర్చుంటాడు. మరల పక్కపై ఒరుగుతాడు. ఈలా అంతులేని ఆందోళనతో స్థిమితంలేకుండా తిరుగుతాడు.

ఈలాపక్కపై తిరుగుటవలన ఉపశాంతి. ప్రతివిషయంలోను నిర్లక్ష్యమే. తనకు ఒరులువిషంపెడుతారనే మనోభావం. ఈహేతువుచే ఒకరిచ్చే మందుగాని; ఆహారపానీయాలుగాని తీసుకొన నిరాకరిస్తాడు. నీరసంచే నింపాదిగామాట్లాడుతాడు. నుదురుకు ఒకబల్లకట్టినట్లు సిరోభారం. సిరస్సుకు రక్తధాటి. ముక్కువెంట రక్తంపడి తలనొప్పితగ్గుతుంది. సరిగా నిద్రపట్టదు. పొలంలోతిరుగుతున్నట్లు, నదిలోయీదుతున్నట్లు, పర్వతం ఎక్కుచున్నట్లు తరచు కలలువస్తాయి.

సన్నిపాతజ్వరాల్లో ఊపిరితిత్తులుచెడి విషపడిశం (Pneumonia) వస్తుంది. దగ్గు, ఆయాసంతో తుప్పులాటికళ్ళిపడుతుంది. నాలుకచివర త్రికోణాకారంలో ఎఱ్ఱగాఉంటుంది. ఒకప్పుడు బూడిదరంగు లేక ఆకు పచ్చఛాయలో భరించలేని వాసనతోకూడిన విరోచనాలు. తెలియ కుండా అవుతాయినిద్రలో.

ఒళ్ళు విపరీతంగానొప్పులు. నడుం పగలగొట్టుచున్నట్లుపోటు. శరీరం ఎఱ్ఱగాఉండి సలసలకాగుతూఉంటుంది; అక్కడక్కడ ఎఱ్ఱని మచ్చలు పడ్డంకూడకలదు. అమితంగా పులుపువాసనకొట్టే చమట్లు. ఎడమవైపున ప్లీహం సమీపంలో కడుపుఉబ్బరం. ఎడమరొట్టుఛాతీ చిరుఎముకల్లోను, ఛాతీఅంతటనూ శ్లేష్మంచేరడంచేఅయ్యే శబ్దాలు వినుపిస్తాయి. పొడిదగ్గుప్రారంభించి క్రమంగా దగ్గుహెచ్చి కళ్లితో రక్తంపడుతుంది.

7. ఒళ్లునొప్పులు, దానిచే దొరాటం, స్థిమితంలేకపోవడం - లక్షణాలు గల అరడజనుమందులువ్రాసి, వాటినిగురించి విశదీకరింపుము.

(1) ఆర్నికా (2) బేప్టీషియా (3) ఫైటొలక్కా (4) రూస్టాక్సు (5) రూటా (6) స్టఫిసాగ్రియా (7) చైనా.

ఆర్నికా : దేనిపై పడుకున్నా గట్టిగారాయిలాఉంటుంది. ఒళ్ళు నొచ్చేటట్లు పనిచేయడంచేతనూ, ఎత్తునుండి పడిపోవుటచేతనూశక్తికి మించిన భారమగు బరువులు మోయుటచేతనూ ఒళ్ళుపచ్చిపుండులా వుండి తశ్శాంతికోసం యిటు, అటు దొర్లుతాడు.

బేప్టీషియా : బల్లపైపడుకున్నట్లు తలుస్తాడు; ఒళ్ళునొప్పులు తీరేటందుకు యిటు-అటు దొరలుచూ స్థలంమారుస్థాడు. ఇది సన్నిపాతంలో ఉపయోగపడేమందు.

ఫైటోలకా : కండరాలన్నీ పచ్చిపుండులాఉంటాయి; తీపు నొప్పి, మూలగకుండా తిరుగలేడు. పళ్ళుకొరుకుతాడు. గొంతుగ పచ్చి, నొప్పి.

రూస్టాక్సు : ఒళ్ళునొప్పులు కష్టంచేస్తేతగ్గుతాయి. కదలినా నడచినా నొప్పి ఉపశమిస్తుంది. ప్రథమంలో లేచి నడిచేటప్పుడు కీళ్ళు బిగిసివుండుటచేనొప్పి. నడచినకొలదీ కీళ్ళబిగువుసళ్ళి నొప్పులుతగ్గుతాయి. సాధారణంగా తేమలోతిరుగుటచేత, చమటలుపోసినప్పుడు చల్లగాలి తగులుటచేత, తగనిబరువులెత్తుటచేత ఒళ్ళుభారంచేస్తుంది.

రూటా : పడుకున్నభాగంయావత్తూ ఆటు—పోటు.

స్టఫిసాగ్రియా : బలంలేనట్లు, శరీరంయావత్తు కవకగొట్టినట్లు పచ్చిగాఉంటుంది.

చైనా : శరీరమంతా పచ్చిపుండు, కీళ్ళలోను, ఎముకల్లోను బెణికినట్లు పోట్లు. వెన్ను, తుంట్లు, మోకాళ్ళు, పట్లుతప్పినట్లుబాధ. వెన్ను, తుంట్లు, మోకాళ్ళు పట్లుతప్పినట్లుబాధ. ఈబాధలన్నియు సాధారణంగా ధాతునష్టంచే కలుగుతాయి.

8. నడుంనొప్పిలో 'రస్టాక్సు' సూచించే లక్షణములేమి ?

కూర్చునిలేచేటప్పుడు నడుంపట్టు; కొయ్యలా బిగుసుకుపో తుంది. బాధ, సలుపు ముఖ్యంగా ఉదయం లేచేటప్పుడుంటుంది. నడు స్తున్నకొద్దీ నడుంపట్లు క్రమంగాతగ్గి నొప్పిఉపశమిస్తుంది.

9. చర్మవ్యాధులలో 'రస్టాక్సు' వాడవలసిన లక్షణములేవి ?

"రస్‌టాక్సు"యొక్క చర్మవ్యాధులు గుల్లల్లాఉబ్బిఉంటాయి. కారకపుపుండ్లకు(Herpes Zoster) చాల ఎన్నదగినమందు. నీటిబుగ్గల్లా లేచేగజ్జి; అమితదురద. ఎంతగోకినా ఉపశాంతివుండదు. కాలియందు మండేపుండ్లు; శరీరంయొక్క క్రిందిభాగములందు అమితంగా గజ్జికురు పులు. శరీరమంతా దురద, వులారం. ఒకప్పుడు యీదురద రోగిభరిం చగలిగినంత వేడినీటిని దురదగలచోటపోస్తే శవనగావుండి దురద తాత్కాలికంగా తగ్గుతుంది. రసితో కూడిన కురుపులు; సీతగాలిచే వచ్చే చలిపొక్కులు.

10. విషసర్పి (Erysepelas)లో "రస్టాక్సు" స్థానమేమి ?

పెద్ద నీటిబుగ్గల్లా ముఖంపై విషసర్పిప్రారంభించి వాపు,జ్వరం. నొక్కితేగుంటలుపడుతుంది. కంది కమిలివుంటుంది. ముఖాన్ని అడ్డంగా ఎడమవైపు ప్రారంభించి కుడివెంపుకు పాకుతుంది. దురద, మంట, జిల,జ్వరంతీవ్రంగావచ్చి సంధిపేలాపన (ఏపిస్‌లో కుడినుండి ఎడమకు పాకుతుంది),

11. "రస్టాక్సు"కుగల సిరోలక్షణములేమి ?

మెదడు వదులుగావున్నట్టుభాషన. సిరస్సు ముఖ్యంగా నుదురు బిగబట్టి బరువుగా వుంటుంది. (ఎకనైట్, బెల్లు, బ్రియోనియా, మెర్కురీ) సిరస్సునందలి కండరములుపచ్చి, తీపు. నుదురుకు బల్ల

కట్టినట్లు భారంగానున్నట్లుభావం. వృద్ధులకు తలతిర్గిప్పు, తల బరువు. సిరస్సుకు వెనుకభాగం ముచికలగుంటలో పోటు, నొప్పి; తలను వెనుకకువంచితే ఉపశమిస్తుంది (బెల్లు) సిరస్సుకు రక్తపోటు.

తలమీద చుండ్రు. బిగిసిపోవుచున్నట్లు తలలోనొప్పి. పుఱ్ఱె మీద; తలమీద; రసి, పక్కులుకట్టి బాధగాఉంటుంది. వెండ్రుకలు తినెయ్యబడతాయి. తల రసి, వాసన, దురద. రాత్రిళ్లు దురదచే నిద్రపోరు (కాల్కేరియా, గ్రాఫైటిస్, లైకో, స్టఫిసాగ్రియా).

12. 'రసాక్సు'లోని కంటిలక్షణములను వ్రాయుము.

తేమగాలిలో నుండుటచే కళ్లువాస్తాయి. వెలుతురు చూడలేరు. కంటివెంట రసికారుతుంది. రెప్పలువాచి కళ్ళు మూతపడి ఉంటాయి. రెప్పలు బలవంతంపై తెరిస్తే పచ్చనిద్రవం స్రవిస్తుంది. అమితమగు కళ్ళకారకం, కండ్లకలక, కళ్ళు ఎఱ్ఱగా నిప్పులాఉంటాయి. రెప్పలు నీటిబుగ్గల్లావాస్తాయి. పై రెప్పలు లేవవు. పై రెప్పలకు పాక్షిక వాతం. వుదయం కండ్లుఅంటుకొని విడిపోవు. అపరమితంగా రసి పుసులు. క్రిందిరెప్పలందు మొటిమలు (Styes). కండ్లపోట్లు, మంటలు.

13. చెవి-ముక్కు 'రస్టాక్సు'లో వీటికి సంబంధించిన లక్షణాలేమి?

చెవిపోటు, చెవి పై భాగం వాపు, పొక్కులు. చెవిక్రిందిగ్రంధి వాస్తుంది. రొంపపట్టినప్పుడల్లా ముక్కు దిబ్బడేస్తుంది. ముక్కుపుటాల్లో బరువు, మంట, ముక్కువాస్తుంది. ముక్కుకొన ఎర్రబడుతుంది, నిగారింపు, నొప్పి. ముక్కులో కురుపులు, వాపు. ముక్కునుండి రక్తం పడితే తలనొప్పి తగ్గుతుంది.

14. 'రస్టాక్సు' కుదర్చగల గుండెజబ్బు లక్షణాలేమి?

శక్తికిమించినపని చేయడంచే ఆయాసం, గుండెదడ. గుండె వ్యాధుల్లో 'రస్టాక్సు' వాడడానికి ఎడమభుజంనుండి చేతిపొడుగునా తిమ్మెరగా ఉండాలి; ఇది ప్రముఖలక్షణం. స్థిమితంగా కూర్చుంటే గుండెల్లో నీరసంగాఉంటుంది. నాడి నిండుగా పుష్టిగాఉండదు. ఒడుదుడుగ్గాఉంటుంది. నాడి సున్నితంగా కొట్టుకుంటుంది. కొన్ని వేళల్లో వక్రంగాను, విడిచి విడిచి కొట్టుకుంటుంది. ఈలా వివిధరీతులుగా నాడి ఉండి ఎడమచెయ్యి తిమ్మెర పోటు.

15. గుండెజబ్బులలో ఎడమచెయ్యి తిమ్మెరగావుండే మందులేవి ?

"ఎకొనైట్" గుండెజబ్బులో వేళ్ళయందు జల.

"కాల్మియా" ఎడమచెయ్యి తిమ్మెర,గుండెనొప్పి,కీళ్ళనొప్పులు పైపూతలతోను, మర్దనాలతోను అణచిపెట్టుటచే గుండెచెడును.

కాక్టస్-గ్రాండి : గుండె తాడుతో బిగగట్టినట్లుండి ఎడమ చెయ్యి తిమ్మిరిగా వుంటుంది.

పల్సటిల్లా – మోచేతిలో తిమ్మెర.

పక్సియా – రెసిమోసా : అన్ని మందులకు వ్యతిరేకంగా ఉండడమే యిందలిచిత్రం; అన్నిమందుల్లోను ఎడమచెయ్యి తిమ్మెరగా వుంటే యిందు గుండెజబ్బులలో కుడిచెయ్యి, కుడిభాగం యావత్తు తిమ్మెరగా వుంటుంది.

16. బెణుకులలో 'రస్టాక్సు' వాడవలసిన లక్షణాలేమి ?

కీళ్ళలోని తంతులు వాచి కీళ్ళుస్వాధీనం తప్పినప్పుడు 'రస్టాక్సు' లోనికియిస్తూ; వేడికాపడంపెట్టాలి.

కష్టమగు బరువులు మోయడంచేత, నడిచేటప్పుడు సీలమండ తిరుగబడి వాపు, పోటు, ఆటుకు వాడాలి. బరువుపనులు శక్తికిమించిన

పనులు చేయడంచే కలిగే అన్ని నొప్పులకు దివ్యంగా పనిచేస్తుంది. 'రస్టాక్స్' అమితకష్టమగు పనులుచేయుటచే పక్షవాతంవచ్చినప్పుడు కూడ దివ్యమగుమందు.

బెణుకునొప్పులలో 'రస్టాక్స్' తాత్కాలికపు ఉపశాంతిని మాత్రమేచేకూర్చి పూర్తినివారణ చేయలేనప్పుడు 'కాల్కేరియాకార్బ్' యివ్వాలి.

17. దవుడ లక్షణాలకు వేనికి "రస్టాక్స్" పనిచేస్తుంది ?

నవిలినపుడల్లా దవుడలో "కర–కర" మనేశబ్దమౌతుంది. తరచు దవుడఎముక యొక్క మూలబంధము జారుతుంది.

18 శ్వాసకోశాలందలి ఏలక్షణాలకు "రస్టాక్స్" వాడాలి ?

"ఇన్‌ఫ్లూయంజా"కు ఎన్నదగుమందు. శరీరమంతా శల్యగత నొప్పులు, రొంప, తుమ్ములు, పొడిదగ్గు. వృద్ధులను విడిచిపెట్టనిశ్వాస కోశాలనుండి దగ్గు. సన్నిపాతంలోవచ్చే న్యుమోనియా.

19. రాచకురుపుల్లో "రస్టాక్స్" వాడనగు లక్షణాలేమి ?

పుండు ఎఱ్ఱగా కందగడ్డలా వాచివుంటుంది. చీముపడుతూ వుండేస్థితి. అమితమగుబాధ, పోటు, మంట. నిస్సత్తువ, నిస్త్రాణ, విషలక్షణాలలో వాడే మందులో ఇదొకటి.

20. 'రస్టాక్స్'యొక్క ఉద్రేక ఉపశమనాలను వ్రాయుము.

ఉద్రేకం : స్థిమితంగావున్నప్పుడు. కూర్చుని లేచేటప్పుడు తడ వడంవలననూ, ముఖ్యంగా చమటపట్టినప్పుడు తడవడంచేత, సీతా కాలం, రాత్రివేళ. అర్ధరాత్రి దాటాకా, తుఫానుగాలి, వానవల నను, తేమగాలివలననూ అన్ని బాధలు హెచ్చుతాయి.

ఉపశమనం : నడవడంచేత, కదలుటచేత, గట్టిస్థలంపై పడుండుటచేత (నడుంనొప్పి) వేడిచేత, పొడిగాలిలోను, వేడిపదార్థాలవలనా, బాధగలభాగం ఆడించడంచేత బాధలన్నియు వుపశమిస్తాయి.

21. అర పుటకు మించకుండా "రస్టాక్సు కొడెండ్రన్" యొక్క సహజ లక్షణములను వ్రాయుము.

వాతనొప్పులచే బాధపడే తత్వానికి వాడాలి. తడవడంచే ముఖ్యంగా పనిచేయుటచే శరీరం వేడెక్కివున్నప్పుడు తడవడంచేవచ్చే అన్నివ్యాధులకు వాడొచ్చు.

కూర్చుండుటచే వుద్రేకించి నడవడంచే వుపశమించే స్థితిగల వ్యాధులన్నిటికీ పనిచేస్తుంది.

బరువులు, భారాలు ఎత్తడంచేత పట్లుపట్టినప్పుడు, శక్తికిమించి అలసి పనిచేయడంచే కలిగే శరీరభాధలకు, తేమలోతిరగడంచేత, తేమ ప్రదేశంలో పడుకొనుటచేత శరీరంముద్దయి నొప్పులు బాధలువచ్చినప్పుడు; నదిలోను, సరస్సులోను మండువేసవిలో చాలసేపుస్నానం చేయడం, ఈదడంచే కలగే వ్యాధులకు, బెణుకు నొప్పులలావుండే నొప్పులకు, శల్యగతపోట్లకు, తేమగాలిలో తిరగడంవల్ల ఒళ్లునొప్పులు, కీళ్ళనొప్పులు, అర్ధరాత్రివేళవచ్చే బాధలు, వుదయం లేవలేకపోవడం. లేచేటప్పుడు కీళ్ళుబిగుసుకుపోయి బాధలు; నడిస్తే తగ్గడం స్వభావం.|

ఆరాటం, గాబరా, స్థిమితంగా పడుండలేడు. వుపశాంతికొరకు పక్కపై యిటు-అటు ఒకటేదొర్లడం.

భుజాలమధ్య గుటకవేసేటప్పుడు బాధ. నడుం బిగుసుకుపోయి బాధ. కదిలినా, గట్టిగావున్నచోట పడుకున్నాబాధ కాస్తతగ్గుతుంది.

చలిగాలికి దగ్గు. కప్పుకున్నప్పుడు ఏమాత్రం దుప్పటితొలగినా దగ్గు.

కండరాల నొప్పి, తీపు; ఎడమవైపు సయేటికా; గుండెజబ్బులలో ఎడమచెయ్యి నొప్పి తిమ్మెర.

విషంపెట్టి చంపుతారని భావించి భయపడుతాడు.

తలనొప్పి, మెదడు కదలుచున్నట్లు, ఆడుచున్నట్లు భావం.

నుదురునొప్పి. తలలో మెలిపెట్టినట్లు బాధ, పోటు.

రాత్రి సరిగా నిద్రపట్టదు. కష్టపడి కృషిచేస్తున్నట్లు, పర్వతం ఎక్కినట్లు, ఈదుతున్నట్లు కలలు.

నాలుకఎండి ఎఱ్ఱగా కందివుంటుంది. నాలుకచివరిభాగంఎఱ్ఱగా త్రిభుజాకారంగా వుంటుంది.

చలిజ్వరం : చలికిముందుగా పొడిదగ్గు. సన్నిపాతజ్వరంలో న్యుమోనియా; అతిసారం.

పక్షవాతం — వాతంచే పడిపోయిన భాగాలలో తిమ్మెరలు.

విసర్పి : ముఖంపై ఎడమవైపు ప్రారంభించి అడ్డంగా కుడికి పాకుతుంది.

'రస్టాక్సులో' కూర్చున్నా, విశ్రాంతిగావున్నా; బాధలన్నియు వుద్రేకించి,కదిలినకొద్దీ వుపశమించడం దీని ప్రముఖ నైసర్గికలక్షణం.

ఉద్రేకం : తేమవలనా, వర్షంవలనా, అర్ధరాత్రితరువాత, చెమటలుపట్టినప్పుడు తడవడంచేత,స్థిమితంగా వున్నప్పుడు, బాధలన్నియు వుద్రేకిస్తాయి.

ఉపశమనం : వెచ్చని పొడిగాలిలోను, వేడిపదార్థాలచేత, బాధగల భాగాలను తరచు కదుపుటచేత, కదలికవలనా లక్షణము లన్నియు ఉపశమిస్తాయి.

ఈరోగికి చల్లనిపాలు, తీపిపదార్థాలు కావాలంటాడు. మాంసం అహితవు.

## 119. రూమెక్సు (Rumex)

1. ముఖ్యంగా ఏ మూడు అవయవాలమీద ఎట్లు "రూమెక్సు" పని చేస్తుంది ?

శ్వాసకోశాలమీద, ప్రేగులమీద, చర్మంపైనను ప్రధానంగా పనిచేస్తుంది.

శ్వాసకోశములు : విరామంలేని విపరీతమగు పొడిదగ్గు, ఏమాత్రం చలిగాలిపీల్చినా దగ్గు హెచ్చుతుంది. అందుచే చలిగాలి లోనికి పోకుండా రోగినోరు కప్పుకుంటాడు ఉపశమనం నిమిత్తం.

ప్రేగులు : ఉదయంవేళ అంటే తెల్లవారడానికిపూర్వం 5 గంటలనుండి తెల్లవారి 9 గంటలవరకు బూడిదరంగు అతిసారవిరోచనాలు.

చర్మం : ఏమాత్రం బట్టతొలిగినా, ఉడుపులుతీసినా, శరీరమంతటా విపరీతమగు దురద.

2. 'రూమెక్సు' ఊపిరితిత్తులను ఎట్లు చెరచును ?

ఏమాత్రం చలిగాలిని పీల్చినా విపరీతంగా పొడిదగ్గు; ఎడతెరిపి ఉండదు (హిసార్; రస్టాక్సు). రోగినోరు కప్పుకుంటాడు చలిగాలిసోక

కుండా. చలిగాలి పీల్చినప్పుడల్లా గొంతులో దుమ్ము లేక ఈకఉన్నట్లు నుస. దానితో విరామంలేని పొడిదగ్గు. ఒకప్పుడు గొంతుగ పచ్చిగాను, తీపుగాను వుంటుంది.

ఎడమఛాతీ దిగువభాగంలో అంటే ఎడమ చంటికి దిగువగా ఛాతీలోనికి సూదిపోట్లు పొడుస్తాయి. దీనితో దగ్గు.

3. చలిగాలి పీల్చడంచే దగ్గువచ్చే లక్షణంగల మూడు మందులేవి ?

రుమేక్సు; పోస్ఫరస్; స్పాంజియా.

4. "రుమేక్సు"కుకల ప్రధానలక్షణాలేవి ?

ఏమాత్రం చలిగాలిపడదు. సాయంసమయంలో గొంతు బొంగురు. స్వరం బేధిస్తుంది; యిది చలిగాలిసోకితే వస్తుంది. జ్వరం ఉండదుగాని సాయంకాలం విపరీతమగురొంప, తుమ్ములు, ముక్కువెంట నీరు ఓడుతూఉంటుంది. గొంతుగలోనుస; విరామంలేని విసిగించే పొడిదగ్గు. గాలిమార్పుచేత, గదినుండి కదలడంవలన, విపరీతమగు పొడిదగ్గు. రాత్రిపరుండి, ముఖ్యంగా ఎడమప్రైపున పరుండి ఏమాత్రం చలిగాలిపీల్చినా విరామంలేని దగ్గు. తలంతా దుప్పటికప్పుకుంటే దుప్పటిలోపలిగాలి వేడెక్కి దగ్గుఉపశమిస్తుంది. తల్లిపడదు. రాత్రి 11 గంటలు దీనిదగ్గుసమయం సాధారణంగా. ఎడమ ఊపిరితిత్తికిందిభాగంలో సూదిపోట్లు, దగ్గు. గొంతులో వుండవున్నట్లు భావన. గుటకవేస్తే క్రిందకుదిగజారి తిరిగి పైకివస్తున్నట్లుంటుంది. దగ్గడంచే స్వరపేటి, గొంతుగనొప్పి, పచ్చి, క్షయవ్యాధిఅంత్యస్థితిలో ఉపశాంతికి దివ్యమగుమందు. దగ్గుతుంటే తెలియకుండా మూత్రం పోతుంది. (కాస్టికం). తెల్లవారగట్ల 5 నుండి 9 వరకు అతిగా విరోచనాలు (ఎలోయి, నేట్రింసల్ఫు, పొడోఫిల్లం, సల్ఫర్). బాధ అణు

మాత్రంకూడ ఉండదు. పెద్దపెద్ద వికారచిన్నాలు దుర్వాసనతో నీళ్ళలా వుదయంవేళ అవుతాయి.

చర్మం : శరీరం పలుతావుల్లో చలిగాలి సోకడంచే విపరీతమగు దురదలు; వేడిచే ప్రశమిస్తాయి. 'దుస్తులుతీసేసినా, వంటిపై బట్టలేక పోయినా; చలిగాలిసోకినా ఒకటేదురదలు. వేడిగావుంటే దురదలు తగ్గుతాయి.

5. క్షయయొక్క అంత్యావస్థలో ఉపశాంతికి ఉపకరించే మందులేవి?

'ర్హూమెక్స్' 'పల్సెటిల్లా' 'సెపిగా' 'ఆర్స్' 'నక్సవామికా' కట్టకడపటిగా 'టెరంట్యులాక్యూబేన్సిస్' దీనితో బాధ అంతగా లేకుండా రోగి ప్రాణాలు విడుస్తాడు.

## 120. రూటా (Ruta)

1. "రూటా"యొక్క సాధారణ సూచికలక్షణములను వ్రాయుము.

ఎముకలకు; ఎముకలపైనుండు పెరియాస్టియం అనే పొరకు. దెబ్బలు; ఘాతకాలు సంభవించినప్పుడు వాడే దివ్యౌషధం. బెణుకులకు, ఎముకలు విరుగుటకు, కీళ్ళుతప్పుకొనుటకు లేక కీలు జారుటకు ఇది పెట్టిందిపేరు.

శరీరమంతా చితుకకొట్టినట్లుబాధ. పడ్డంవల్ల, దెబ్బలుతినడంవల్ల, గుద్దులువల్ల. చేతులు, కాళ్ళు, కీళ్ళు సర్వత్రా శరీరమంతటా నొప్పులువున్నప్పుడు వాడవలసినమందు. గుణం కనుపించేవరకూ తరచుగా వాడాలి. స్థిమితంఉండదు. బెణుకుటచే కుంటుతాడు. ఛాతీకి దెబ్బ తగులుటచే క్షయవ్యాధివస్తే "రూటా" నివారిస్తుంది.

ఎక్కువగా రాత్రిళ్ళు దీపందగ్గర చదువుటచేత, అమితంగా కుట్టుపని చేయుటచేత కళ్ళుమసగలు, కొంతదూరంలో ఉన్న వస్తువు ఆనకపోవడం. కండ్లనుండి నీరుకారి కంటినరాలు, కండరాలు పీకు తాయి; తలనొప్పికూడా రావచ్చును. ఈలాటిస్థితిలో "రూటా" దివ్యంగా పనిచేస్తుంది.

చైతన్యశక్తి లోపంవలన మలబద్ధకం. బాలింతలు మలవిసర్జనకు ఏమాత్రం ప్రయత్నించినా ఆసనకండరం బలహీనంగా ఉండడంచే ఆసనం బుడగలా క్రిందకు తోసుకొనివస్తుంది. మూత్రకోశం నిండుగా ఉన్నట్లు మూత్రానుమానం; మూత్రవిసర్జనచేసినా అనుమానంపోదు. మూత్రం ఆపుకోలేరు.

అరచేతులో సమతలమైన (బల్లపరుపు) పులిపిరికాయలు (నేట్రంకార్బ, నేట్రం-మూర్, చెయ్యి వెనుకతట్టు డల్కా-మేరా).

నడ్డినొప్పి : వీపుపై పడుకుంటే తగ్గుతుంది.

మణికట్టు బెణికినట్లు బాధగాఉండి బిగుసుకుపోతుంది. తేమగాలి తగిలితే బాధ ప్రకోపిస్తుంది.

గునపం, పార, సుత్తి, సమ్మెట — యీ మొదలగు పనిముట్లు ఉపయోగించే శ్రామికుల అరచేతుల్లో కాయలులేచినప్పుడు దివ్యమగుమందు.

రూటాయొక్క ప్రత్యేక కేంద్రాలు కళ్లు, మణికట్టు (Wrist)

ఏడోమాసంలో సంభవించే గర్భస్రావానికి మంచిమందు.

2. కంటితో తదేకంగా పనిచేయుటచే కలిగే కంటివ్యాధులను నివారించే నాలుగుమందులేవి ?

ఆర్జెంటంనిట్రు, నేట్రంమూర్, అనాస్మోడియం, రూటా.

3. "షియాటికా" వ్యాధిలో "రూటా"ను వాడనగు లక్షణాలేమి ?

నడ్డిలో నొప్పి ప్రారంభించి తొడలగుండా పిక్కలకు ప్రాకు తుంది. చీల్చేస్తోన్నట్లుంటాయి నొప్పులు. పగలు అంతగా బాధఉండదు. కాని రాత్రి పడుకోడం తడవుగా బాధలు హెచ్చుతాయి. తెల్లవార్లు ఒక్క మోస్తరుగా ఉంటుంది బాధ.

4. "రూటా"కుగల కంటిలక్షణములేమి ?

కంటితో మితిమీరి పనిచేయుటచే కంటి కండరములు పీకుతాయి. కంటితో తదేకదీక్షతో పనిచేయుటచే తలపోటు, తలనొప్పి. చూడాలంటే కండ్లపోట్లు. చిన్నలిపి చదవాలన్నా సున్నితంగా కుట్టాలన్నా కంటిపోటు.

కంటికి అమితమగు శ్రమయిచ్చి పనిచేయుటచే కళ్ళుఎరుపు, పోటు కారకం. నిదానించి చూడలేడు. కంటితో పనిచేయడంవల్ల కళ్ళు నిప్పుల్లా మండుతాయి. కంటికి మితిమీరిన శ్రమ యివ్వడంచే కంటి కండరాలు, నరములుచెడి అనేకమగు కంటివ్యాధులు వస్తాయి. వాటి అన్నిటిని నివారించుటకు 'రూటా'యే శరణ్యం.

6. బెణుకులకు "రూటా" మంచిది; ఎట్లో నిరూపించుము.

నడ్డినొప్పి; తుంటియందలి వెన్నుపూస కవికినట్లుపోటు. కీళ్ళయందలి తడపనాళ్ళు కుదించుకొని బలహీనంగా ఉంటాయి. మెడలు, మిద్దెలు, ఎక్కినా దిగినా మోకాళ్ళు పట్టుపడుతాయి. మణికట్టు,సీలమండ బెణకడంచే పట్లుతప్పిపోయి ఉంటాయి. సీలమండ బెణకడంచేత లేక ఆకీలు స్థానంతప్పడంచేత — ఆటు, పోటు, వాపు. కాలు క్రింద మోపలేకుండా ఉన్నప్పుడు 'రూటా' వాడాలి. బెణికినతక్షణం కలిగే వాపు, ధనారింపుకు 'ఆర్నికా' వాడాలి. తరువాత రస్టాక్సుయిస్తే చాల

వరకు పోవచ్చును. కాని నరాలందు బెణకడంచే కుదపలు ఏర్పడి నప్పుడు 'రూటా' వాడాలి.

'రూటా' బెణుకులకు దివ్యమగుమందు. బరువులు మోసి అలసి నప్పుడు ఆర్నికా, రష్టాక్సు, కాల్కేరియా అగత్యం.

## 121. సెబీనా (Sabina).

1. ప్రత్యేకంగా ఏకోశాలపై 'సెబీనా' పనిచేస్తుంది ? దీనిని సూచించే సాధారణ నైసర్గికలక్షణాలేమి ?

ఇది ప్రత్యేకంగా మూత్రపిండాలమీద, గర్భాశయంపైన, ఆసనకండరం, ఆసనంమీద, కీళ్ళవాపులందు, ముఖ్యంగా మణికట్టు వాపులపైననూ పనిచేస్తుంది.

కీళ్ళవాపులు రక్తస్రావం వేడివలన ఉద్భవిస్తేనే పనిచేస్తుంది.

వెన్నునుండి మర్మావయవంలోనికి, క్రిందనుంచి పైకిపోటు.

పొడవడం దీనిప్రత్యేకసూచకలక్షణం. వ్యాధి ఏలాంటిదైననూ యీ లక్షణముంటే "సెబీనా" వాడాలి. ఇందులో ఈపోట్లతో రక్తం స్రవించడం మరో ప్రత్యేకలక్షణం.

2. మూడవమాసంలో గర్భస్రావం కలుగజేసే ప్రధానమగు రెండు మందులను వ్రాయుము ? వాటిని పోల్చుము.

(1) బెల్లడోనా (2) సబీనా.

మూడోమాసంలో గర్భస్రావంకలిగే సూచనలు పొడగట్టి నప్పుడు "సెబీనా" స్ఫురణకురావాలి. తొంటినుండి స్త్రీ మర్మావయవంలోనికి, యోనిలోనుండి గర్భాశయంలోనికి అంటే క్రిందినుండి పైకి

పోట్లుపొడిచే లక్షణం. గమనించి "సెబీనా" వాడితే గర్భస్రావం కాకుండా నిలిచిపోయి, గర్భాశయానికి బలంచేకూరి నవమాసముల అనంతరం సుఖంగా ప్రసవిస్తుంది.

'బెల్లడోనా' నొప్పులు క్రిందికిదిగదీసేవిగాఉండి ప్రథమంగా ఒకకుదుపువచ్చి తరువాత క్రమంగా ఎఱ్ఱని నిగారింపుగల రక్తంమిక్కుటంగా పోతుంది. తాకినా, కుదిపినా, కదిపినా రోగి అతిసున్నితంగా ఉండడంచే భరించలేదు. 'బెల్లులో' నొప్పులు అధోముఖంగానేకాక అన్ని వెంపులకు పోట్లలా పొడుస్తాయి. ఈపోట్లు మెరుపుల్లా క్షణంలో వచ్చి క్షణంలో పోతాయి.

4. 'సెబీనా' నివారణచేయు స్త్రీలకువచ్చు వ్యాధిలక్షణములేమి ?

నెలసరి సకాలానికి ముందుగావచ్చి చాలకాలంవరకు విపరీతంగాపోతుంది. ఈస్రావం హటాత్తుగావచ్చి కదిలినా మెదిలినా హెచ్చుతుంది (సికేల్). స్రావం నల్లగాను (సైక్లైమన్) మరొకప్పుడు కుదపలుగాను (క్రోకస్) అవుతుంది. ఋతుసమయంలో ప్రసవవేదనలాటి శూలు. నొప్పులు వెన్నునుండి మర్మావయవంలోకి పొడుస్తాయి. ఈలాటి లక్షణాలున్నప్పుడు, నెలసరిలోను, గర్భస్రావానికి, ప్రసవసమయంలోను "సెబీనా" వాడాలి.

గర్భకుహరంలో కంతులుండి రక్తస్రావమవుతుంటే 'సెబీనా' పనిచేస్తుంది. ముట్లుఎండిపోయేకాలంలో విపరీతంగా ఎఱ్ఱని రక్తము కుదపలతోకూడి స్రవిస్తుంటే 'సెబీనా' వాడితే ఏబాధయులేకుండా క్రమంగా ముట్లు ఉడుగుతాయి. గర్భాశయం నిస్సత్తువగాఉండడం దీని నైసర్గికం. నెలసరి అయినతరువాత రక్తపూరితమగు కుసుమ వాసనతోకూడి స్రవిస్తుంది.

స్త్రీల శగవ్యాధి నివారణకు ఈమందుతోడ్పడుతుంది. యోని లోను, ఆసనములోను మొలిచే పులిపిరికాయలను నివారిస్తుంది.

మూడో మాసంలో గర్భం స్రవించేసూచనలున్నప్పుడు 'సెబీనా'యిస్తే గర్భవిచ్ఛిత్తును అరికడుతుంది (సిపియా), ఋతుకాలాలకు మధ్య నైలఅగుచూ అమితంగా సంభోగవాంఛ ఉన్నప్పుడు "సెబీనా' మంచి ఉపకారి.

మావిపడక ప్రసవానంతరం వచ్చేవిపరీతనొప్పులకు పనిచేస్తుంది.

4. 'సెబీనా' వలెనే గర్భాశయంనుండి రక్తస్రావం కలుగజేసే నాలుగు మందులను పేర్కొని వాటి తారతమ్యములను తెల్పుము.

(1) ఇపికాక్ (2) మిలిఫోలియం (3) సికేల్ (4) ఫోస్ఫరస్.

ఇపికాక్ : సెబీనావలెనే ఎఱ్ఱటిరక్తం విస్తారంగా చిమ్మిట గొట్టంతో కొట్టినట్లు అవుతుంది. ఇందులో దీని ప్రత్యేకలక్షణంఅగు వికారం, నిస్త్రాణా వుంటాయి. పోయినరక్తానికి మించినశోష, నిస్త్రాణ కలుగజేస్తుంది.

మిలిఫోలియం : ఎఱ్ఱని రక్తం విస్తారం స్రవిస్తుంది. రోజురోజు రక్తం విడువకుండా బొట్లుబొట్లుగా ధారాపాతంగా అవుతుంది.

సికేల్ : "సెబీనా"ను పోలివుంటుంది. ఒకవేళ యిది యివ్వవల సిన లక్షణాలుంటే ఎక్కువగా వాడరాదు. గర్భవేదనలా ఇందు దిగ దీస్తే నొప్పులతో పెద్దపెద్ద కుదపలు లోపలనుండి తోసుకురావడం వుంటుంది. విస్తారంగా నీటిలాటి రక్తం స్రవిస్తుంది. దీని నైసర్గిక లక్షణాలగు ఒళ్ళుమంటలు, శరీరం తాకుటకు చల్లగావున్నా గుడ్డకప్పు కోకపోవడం గమనించాలి. నెలసరికి మధ్యలో బట్టఅవుచు సంభోగ వాంఛగాఉంటుంది. గర్భస్రావానంతరం గర్భాశయం, అండాశయాలు

వాస్తాయి. అమిత దురదతో కూడిన పులిపిరికాయలు. వీటిపై పని చేస్తుంది సెబీనా.

మణికట్టు, కాలివేళ్ళకీళ్ళు వాచి అమితపోటుకు, సలుపుకు పనిచేస్తుంది.

కదలుటచేత, వేడిగాలిచేత, వేడిగదిలోను ప్రకోపించి చల్లని ఆరుబయట గాలిసోకితే ఉపశమిస్తాయి దీనిలక్షణాలన్నీ.

## 122. శాంబకస్ నిగ్రా (Sambucus Nigra)

1. "శాంబకస్ నిగ్రా" అనగానేమి ?

'యూరోపియన్ యెల్డర్' అంటారు దీన్ని మామూలుగా. దీనిపువ్వులు తాజాఆకులు సమపాళ్లు కలిపి ద్రావకంతయారుచేస్తారు.

2. "శాంబకస్" యొక్క ప్రధానసూచకలక్షణమేమి ?

ముక్కుపుటాల్లో ఒకవిధమగు మొలకలులేస్తాయి. వీటిని "స్నఫుల్స్" (Snuffles) అంటారు. సాధారణంగా యివి నాసికా రంధ్రాలకు అడ్డుతగిలి శ్వాసకు అవరోధం కలిగిస్తాయి. అందుచే శ్వాస నోటితో పీల్చవలసివస్తుంది. ఈలా శ్వాసకు అవరోధం కలిగించు 'స్నఫుల్సు' వ్యాధిని నివారించుటలో యిది నిరుపమానమైనది.

నిద్రాసమయంలో శరీరం పొడారి వెచ్చగాఉంటుంది. నిద్ర లేస్తే విపరీతమగు చమటలు పోయడం 'శాంబకస్' యొక్క ప్రముఖ నైసర్గికలక్షణం. అనేక రుగ్మతల్లో యీలక్షణం 'శాంబకస్'ను నిరూపిస్తుంది.

3. శ్వాసకోశాలపై "శాంబకస్" ప్రభావమేమి ?

పిల్లలకు పొడిపడిశం; శిశువులకు 'స్నఫుల్సు' వ్యాధి. స్వరపేటి యందలి యీడ్పులకు ముక్కుదిబ్బడపడి శ్వాసఆడకుండుటకు దివ్యమగుమందు 'శాంబకస్'. శిశువు పాలుతాగేటప్పుడు నోటితో గాలి పీలుస్తాడు. ఒకప్పుడు పాలుపీల్చుకోలేక ఉక్కిరిబిక్కిరవుతారు.

ఆయాసం : పిల్లలు ఉక్కిరిబిక్కిరై ఉలిక్కిపడి లేస్తారునిద్ర నుండి. హటాత్తుగా దగ్గువచ్చి ఊపిరందక శరీరమంతా నలుపెక్కి బిగునుగుపోయి బిడ్డ మృత్యుముఖాన్నవున్నట్లు కొనూపిరితో వుంటాడు. గాలి పీల్చుకొనుటకు బాధపడుతాడు. ఈలా బాధ పడిపడి కొంచెం తగ్గుతోందనగా నిద్రపోతాడు. తిరిగి కొంతసేపటికి యీలాగే దగ్గుతో లేస్తాడు ఊపిరాడక. దగ్గుతెర యీలా తెరలుతెరలుగా వస్తుంది. పిల్లవాడు శ్వాసతీసుకుంటాడుగాని గాలి వదల్లేడు. నిద్రతో వ్యాధి ప్రకోపిస్తుంది.

కింకవాయువు (Croup). చివరిఅవస్థలో ఊపిరాడక ఉక్కిరి బిక్కిరి అయేసమయంలో వాడాలి.

అర్ధరాత్రివేళ పిల్లలుఏడ్పు, ఊపిరాడనిదగ్గు. ఆదగ్గు కొక్కెస దగ్గులాఉంటుంది. శ్వాస వదిలేటప్పుడు పిల్లలు బాధపడుతారు. ఈలా ఉంటూ జ్వరంరావడంకద్దు. ఈచెప్పిన లక్షణాలనన్నిటిని 'శాంబకస్' నివారిస్తుంది.

4. వింతగా చమటపట్టే లక్షణంగల కొన్నిమందులను సూచింపుము.

శాంబకస్; నిద్రలో శరీరం వెచ్చగా పొడిగా ఉండడం. మెలకువ రావడంతడవుగా విపరీతమగు చమటపట్టడం దీనికి ప్రధానమగు అసాధారణలక్షణం.

కోనియం : నిద్రపోడానికి కన్నుమూయడం తడవుగా చమట్లు పడుతాయి.

తూజా : ఇందులోని చిత్రమేమిటంటే ఎప్పుడైనా కప్పుకుంటే చమటలు పోస్తాయి. ఇందులో గుడ్డకప్పుకోనిభాగాలలో చమటలు పోస్తాయి.

బెల్లడోనా : కప్పుకున్న భాగాల్లోమాత్రం చమటలుపోస్తాయి.

పల్సటిల్లా : పాక్షికచమటలు (ఒకవైపునమాత్రమేచమట.)

5. "శాంబకస్" కుగల ప్రధానలక్షణములేమి ?

ఆరాటం, విచారం, దిగులు, బెంగ వీటిచేకలిగే మానసికవుద్రిక్తాలకు. అట్టి వుద్రిక్తాలచే సంభవించే దుష్ఫలితాలకు "శాంబకస్" పనిచేస్తుంది.

ముక్కులో శ్లేష్మకండలకు, ముక్కుదిబ్బడపడి శ్వాసఆడకుండుటకు, శ్వాస బాగా ఆడకపోవడంచే బిడ్డ సరిగా తల్లిదగ్గరపాలు కుడుచుకోలేకపోవుటకు, శ్వాస లోనికిపీల్చుకున్నంత తేలికగా శ్వాస విడిచిపెట్టలేకపోవుటకు పనిచేస్తుంది. కింకవాయువులో ఊపిరిఆడనప్పుడు 'శాంబకస్' స్వస్థత చేకూరుస్తుంది.

దగ్గు : అర్థరాత్రివేళ పిల్లలవద్పు, ఊపిరాడకుండా దగ్గు, శరీరమంతా నలుపెక్కి, కళ్ళు అరమోడ్పుచేంది చాల ఆదుర్దా కలుగజేస్తుంది. ఈలాటి పిల్లల ఉబ్బసంలో "శాంబకస్" పెట్టిందిపేరు.

కళ్ళు మూస్తే యేవో కనుపిస్తాయి. భయం, కాళ్ళు చేతులు చల్లగావుంటాయి. అల్పాచమానం కొద్దిగా అవుతుంది. నిద్రలో శరీరం వెచ్చగావుండి కళ్లు తెరవడం తడవుగా చమట్లు పడుతాయి.

'శంబుకస్' రోగి బొద్దుగా లావుగా కండకలిగి ఉంటాడుగాని తగినకారణంలేకుండా అకస్మాత్తుగా చిక్కిపోతాడు. కాళ్ళు, పాదాలు, మోకాళ్లు వాస్తాయి.

అర్ధరాత్రివేళ, శరీరంపై బట్టలేనప్పుడు, పడుకున్నసమయాన్న చల్లని పానీయాలచేతనూ యిందలి వ్యాధిలక్షణాలు ప్రకోపిస్తాయి. లేచి కదలడంవల్లనూ, చలిగాలిసోకకుండా కప్పుకొనుటవల్లనూ, నొక్కుకొనుట చేత బాధలు ఉపశమిస్తాయి.

'ఆర్సెనిక్' వాడడంచే కలిగే వ్యాధులను నివారిస్తుంది.

ఝుఝుసుకొనుటచే కలిగే దుష్ఫలాలకు 'ఓపియం' వాడిన తరువాత 'శంబుకస్' వాడాలి.

## *123.* సాంగునేరియా (Sanguinaria)

1. సాంగునేరియా సాధారణంగా చేసేపని యేమి ?

ఇది లోనికితీసుకున్నా పైకిరాసినా ప్రథమంగా ఒరుపును కలుగజేస్తుంది. ఇది తగిలినంతమేరా ఒరుస్తుంది. ఒరుపును కలుగజేయుటచే మానసికంగా ఆరాటంసంభవిస్తుంది. చెవులుఒరిసి వాస్తాయి. ముక్కుఒరిసి రొంపపడుతుంది. నరాలు చైతన్యంచెందడంచే చలి, కుదుపు కలుగుతాయి. సిరస్సుకు విస్తారం రక్తప్రసరణఅయి తలనొప్పి. రక్తస్రావాలు ప్రాప్తిస్తాయి. అమర్చలు ఒరిసి పచ్చిగా మండుతుంటాయి.

ఇది కుడివైపువ్యాధులకు ముఖ్యంగా పనిచేస్తుంది. కుడిభుజం వాతనొప్పిచే లేవదు.

2. 'సాంగునేరియా'చే సంభవించే మానసిక లక్షణములేమి ?

మెదడుచెడే ఆరాటం బయలుదేరుతుంది. ఈఆరాటం సాంగునేరియా వ్యాధులన్నిటిలోను ఉంటుంది. ఇది ప్రత్యేకమగు లక్షణం కాదు;దీనికి సంబంధించిన వ్యాధులన్నిటిలోను అంతర్వ్యాప్తినిలో ఆరాటంఉంటుంది. తలనొప్పి; జఠరవ్యాధులలోను, గుండెవ్యాధుల్లోను, శ్వాసకోశవ్యాధులలోను, ఈవిధంగా దీనికి సంబంధించిన ప్రతివ్యాధిలోనూ యీ మానసిక ఆరాటం గోచరిస్తుంది. కోపంగాను, కసికి పాట్లు పడుతూను ఉంటాడుయీరోగి.

3. సాంగునేరియా సారూప్యప్రభావముకల కేంద్రములేమి ?

(అ) మెదడు–ప్రకోపించుటచే ఆరాటం, ముక్కోపితనం సంభవిస్తాయి.

(ఆ) కుడితట్టు తలనొప్పివస్తుంది.

(ఇ) ముక్కు పడిశంపట్టి ముక్కులో మొటిమలు మొలుస్తాయి.

(ఈ) శ్వాసకోశాలలో అనేకమగు వ్యాధులను కలుగజేస్తుంది.

(ఉ) కుడిచెయ్యికీలు వాతంచే పడిపోతుంది.

(ఊ) స్త్రీలకు ముట్లుఉడిగేకాలంలో వొంటివెంట శగలు – పొగలు కలుగజేస్తుంది.

4. "సాంగునేరియా"చే సంభవించు తలనొప్పి ఎట్లుండును ?

నిర్ణీతకాలంలో అనగా ఏడురోజులలోగాని, మూడురోజులకు ఒకసారిగాని దీని తలనొప్పివస్తుంది. ఉదయం లేవడంతో ప్రారంభిస్తుంది. తలవెనుక ముచికలగుంటలో తలనొప్పిప్రారంభించి క్రమేణా పైకిఎక్కి చివరకు కుడి కంటిపై కేంద్రీకృతమౌతుంది. కొందరికి కుడి పార్శ్వంయావత్తూ నొప్పిగాఉంటుంది. తలపగిలేటట్లు నొప్పి, చలి,

కడుపు, వికారం. తినినఅన్నం పసరుగా వాంతి అవుతుంది. రోగి పడుకొనిఉండి నిద్రపోతే ఈతలనొప్పి వుపశమిస్తుంది. స్త్రీలకు ముట్లుడిగి పోయేకాలంలో వచ్చే తలనొప్పులకు మంచిమందు.

5. 'సాంగునేరియా' కలుగజేసే చెవిసంబంధమగు బాధలేవి ?

పై చెవి ఎఱ్ఱగావాస్తుంది. చెవిలో ఒకశబ్ధ్వనులు, హోరుగా వుంటుంది. తాకనివ్వడు. అకస్మాత్తుగా ఏదైనా చప్పుడైతే చెవిలో పోటుపొడిచినట్లుంటుంది.

రైలులోనో కార్లోనోవుండి అది అతివేగంగా పోతుంటే తానావేగానికి జోగుచున్నట్లు భావం. రోగి తనయందుకలిగే యీలాంటి చలనభావాన్ని తట్టుకోలేక ఎవరినైనా ఆప్తులను తన్ను అదిమిపట్టుకో మంటాడు. ఆచలనభావం పోవడానికి. ఈలక్షణం సాధారణంగా ముట్లు ఎండిపోయేకాలంలో కొందరిస్త్రీలకు వుంటుంది.

6. రోగిని అదిమిపట్టుకోవాలనే కోరిక లక్షణంగాగల మందులేవి ?

జల్సిమియం: రోగియొక్క హృదోగ్రాలలో తన్ను అదిమిపట్టుకోవాలని వాంఛిస్తాడు. శరీరమంతాచలి. వణకు, కంపం. ఆస్థితిలో తన్ను గట్టిగా అదిమిపట్టుకోమంటాడు.

లెకెసిస్ : మన్యం జ్వరాలలో చలి వణికించేస్తూన్నప్పుడు "లెకసిస్" రోగి తన్ను అదిమిపట్టుకోమంటాడు.

'సాంగునేరియా'లో మానసిక ప్రకోపంచే వోని చలనభావంతో తన్ను అదిమిపట్టుకోమంటాడు.

7. "సాంగునేరియా"కుగల నాసికాలక్షణములేమి ?

ఆఘ్రాణశక్తి సునిసితంగా వుంటుంది అందుచే వాసన ఏమాత్రం భరించలేడు. అమితంగా వెఱ్ఱివాసనల వలన సొమ్మసిల్లి పోతాడు.

ముక్కులో ఒరుపురుంటు. ఒరుపుకలిగించే స్రావం. రొంప, పడిశం. ముక్కులో నూకలకూడువంటి చిన్న మొటిమలు వేస్తాయి. (Polypi) వాటినుంచి సునాయాసంగా రక్తం స్రవిస్తూఉంటుంది.

8. తలనొప్పి అనేవ్యాధికి ప్రధానంగా వాడనగు అయిదు మందులను తెలుపుచూ వాటి సూచికలక్షణములందలి తారతమ్యములను వ్రాయుము.

(1) బెల్లడోనా (2) మెలిలోటస్ (3) గ్లోనైన్ (4) సాంగ్వి నేరియా (5) ఐరిస్.

బెల్లడోనాలో ముఖ్యంగా కుడివైపు అదురుచున్నట్లు, 'సాంగ్వి నేరియా' వలెనే విపరీతమగునొప్పిఉంటుంది ఇందు ముఖ్యంగా విస్తారం రక్తం సిరస్సుకు తన్నడంచే కలుగుతుంది. కాళ్ళుచల్లగానుండి సిరస్సు కాల్తూఉంటుంది. 'సాంగ్వినేరియా'లో ముఖ్యంగా తలనొప్పి జఠరవ్యత్యస్థంచే కలుగుతుంది. బెల్లలో పడుకుంటే తలనొప్పి ఉద్రేకిస్తుంది, లేచి జార్లబడి కూర్చోవాలి. 'సాంగ్వినేరియాలో' పడుకోవాలి; అప్పుడుగాని రోగికి స్వస్థతఉండదు. నొప్పిముచ్చికలగుంటలో ప్రారంభమై పైకివచ్చి కుడికంటిపైన స్థానంఏర్పర్చుకోడం 'బెల్ల'లో అంతగాఉండదు. 'బెల్లడోనా'లో కణతలు అదిరేటట్లు కొట్టుకుంటాయి. ఆలక్షణమే 'బెల్ల'ను ప్రధానంగా సూచిస్తుంది.

మెలిలోటస్ : అమితంగా సిరస్సుకు రక్తం ప్రవహించడంచే విపరీతమగు తలనొప్పి. దీనిచే మనస్థిమితంచెడుతుంది. తలను బ్రద్దల కొట్టుచున్నట్లు, లోని మెదడు నుదురుగుండా పొడుచుకువస్తున్నట్లు రోగికి భావన.

గ్లోనైన్ : లోకూడ సిరస్సుకు రక్తపోటుచే విపరీతమైన తలనొప్పి. తలను వెనక్కువంచితే ఉద్రేకించి, ముందుకువంచితే తగ్గు

తుంది తలనొప్పి. విపరీతంగా గుండె కొట్టుకుంటుంది. కొందరిస్త్రీలకు ఈలాటి తలనొప్పితో గర్భాశయం ముందుకుజారుతుంది. కొన్నిసమయాల్లో విస్తారం మూత్రింపోస్తే తలనొప్పి తగ్గుతుంది.

ఐరిస్ : ఇందు తలనొప్పి నియమంగా శెలవరోజగు ఆదివారం నాడు వస్తుందిముఖ్యంగా. ఉపాధ్యాయులు, విద్యార్థులు, ఫారిఖెరప్లు ఈతలనొప్పితోపాటు కళ్ళుమసగలు కమ్మటం, చూపు సరిగా ఆనక పోవడం వుంటుంది. పుల్లని తేమడవాంతి అవుతుంది. దానితో తల నొప్పి తగ్గడంప్రారంభించి క్రిమంగా పూర్తిగాపోతుంది.

సాంగ్వినేరియా : తలనొప్పితో నిద్రలేస్తాడురోగి. మచికల గుంటలో ప్రారంభమై ముందు కుడికంటిపై కేంద్రీకరిస్తుంది నొప్పి.

9. ముట్లు ఎండిపోయేకాలంలో 'సాంగ్వినేరియా' ఎట్లు ఉపయోగ పడును ?

ముట్లు ఉడిగేసమయంలో ఎక్కువగా రక్తబట్టలవుతూంటే ముఖ్యంగా 'సాంగ్వినేరియా' చేసే మేలు మరువరానిది. మైల ఎఱ్ఱగా కుదపకుదపల్లా వెడుతూ అతిగా వాసనవేస్తుంది. ఈలా రక్తస్రావం అవుతూ దీని ప్రత్యేకలక్షణాలతో కూడిన తలనొప్పిఉండడం గమనించాలి. ముఖంకంది వెచ్చగా శగలువస్తున్నట్లుంటుంది. సాయంకాలం చెక్కిళ్ళు ఎఱ్ఱగా గుండ్రంగా కందిఉంటాయి. "సాంగ్వినేరియాలో" యిదొక ప్రముఖలక్షణం. చమటలుపట్టి ముఖం కందడం తగ్గి రోగి సొమ్మసిలిపోతుంది.

వంటివెంట శగలు, పొగలు; దీనితోకుసుమ; అరచేతులు, పాదాలు మండిపోతాయి; కప్పుకున్నబట్టలు విసిరిపారేస్తుంది. భరించలేకుండగా స్తనాలు వాస్తాయి ఒకప్పుడు.

10. సాధారణంగా ముట్లెండిపోయేకాలంలో సూచింపబడే నాలుగు మందులేవి ?

(1) సాంగ్యునేరియా (2) గ్లొనైన్ (3) ఎమిల్ నైట్ (4) లెకసిస్.

11. క్షయవ్యాధిలో "సాంగ్యునేరియా" గుర్తింపనగు లక్షణాలేమి?

రోగి ప్రతిరోజూ సాయంకాలం క్షయసంబంధమగు జ్వరంతో బాధపడుతూంటాడు. ఈజ్వరం మిట్టమధ్యాహ్నం దాటాక 2 లేక 4 గంటలకు సోకుతుంది. బుగ్గలు ఎరుపెక్కుతాయి. సాధారణంగాపొడి దగ్గుతో ప్రారంభమవుతుంది. గొంతుగలో నుసగాను ఏవిహో ప్రాకుచున్నట్లుండి దగ్గొస్తుంది. ఛాతీ పైభాగం మంట; నిండుగాఉన్నట్లుంటుంది. కుడి ఊపిరితిత్తి అంటే చంటిదగ్గర సూదిపోట్లుంటాయి. ఊపిరితిత్తివ్యాధులలో దీనిప్రధానవ్యాధికేంద్రం కుడి ఊపిరితిత్తి.

ఛాతీయందలి కండరాలు పచ్చిగాఉంటాయి. అమితంగా ఆయాసం. కఫం దుర్వాసనగా ఉంటుంది. ఆవాసన రోగే భరించలేకపోతాడు. ఈలాటిస్థితిలో "సాంగ్యునేరియా" చేయగల సహాయం నిరుపమానం. క్షయజ్వరాన్ని తగ్గిస్తుంది. వ్యాధికేంద్రానికి రక్తప్రసరణను తగ్గించి వ్యాధిని క్రమంగా నివారిస్తుంది. కొన్నిమాసాలు శ్రద్ధచేస్తే మరణించేరోగిని ఆరోగ్యవంతుణ్ణిగా చేస్తుంది "సాంగ్యునేరియా".

12. న్యుమోనియావ్యాధిలో "సాంగ్యునేరియా" సూచికలక్షణాలేమి ?

దీని నైసర్గికమగు దగ్గు, శగలు, పొగలు, చెక్కిళ్ళు ఎరుపెక్కడంకాక, కళ్ళె తుప్పురంగులో దగ్గుతో వెడుతుంది. భరించరాని

ఆయాసం. కాళ్ళు—చేతులు అగిడిమంటలుగా ఉంటాయి; ఒకప్పుడు యీలాఉండే గుండె నిలిచిపోతుంది. గుండె నీర్సంగావుండి నాడి నిస్సత్తువగా, వక్రంగా చలిస్తుంది. నిస్త్రాణ, సోమవస్తాయి. ఒళ్ళు చలువలుకమ్ముతాయి. వికారంతో రోగి విపరీతంగా బాధపడుతాడు.

13. "సాంగ్యునేరియా"లో శ్వాసకోశాలకు సంబంధించిన సాధారణ లక్షణములేవి ?

గొంతుగలోనుస, పొడిదగ్గు; రొమ్ముమధ్య పాకుచున్నట్లు స్పర్శాభావం. దానితోదగ్గు. దగ్గుతో లేచికూర్చోవాలి. అపానువాయువులుగాని, తేనుపులుగాని వెడితే దగ్గు వుపశమిస్తుందికొంచెం. రోగికి అసహ్యంగా వాసనవేసేకళ్లి దగ్గినపుడల్లా పడుతుంది.

కుడిఛాతీమధ్యభాగంలో అంటే చనుమొనవద్ద చురుకు, పోటు. ఛాతీలోమంట, ఛాతీలో పచ్చిగావుంటుంది. శరీరంయావత్తూశగలు—పొగలు. బుగ్గలు ఎఱ్ఱగాకందివుంటాయి. కుడిభుజంనొప్పి; చెయ్యిలేవదు.

'న్యుమోనియా'లో క్లిష్టస్థితిలో వుపకరిస్తుంది. 'ఫోసర్ఫస్' వాడాకా రోగం కుదరక వుద్రుక్తపరిస్థితికి దారితీస్తే అప్పుడిది వుపయోగపడుతుంది. దీని నైసర్గికలక్షణాలు ముఖ్యంగా శరీరం శగలు కమ్మడం, చెక్కిళ్ళు ఎఱ్ఱబారడం, న్యుమోనియా నిలదొక్కుకొనిదగ్గు, దుర్వాసనతో కూడిన కళ్ళివుండి రోగిక్షయవ్యాధికి లోనగుచున్నాడేమో అనుపించేస్థితిలో 'సాంగ్యునేరియా' వాడితే అద్భుతంగా పనిచేస్తుంది. లక్షణాలనుబట్టి ఈస్థితిలో 'కాలీఅయోడేటం' 'స్టేనం' 'కార్బొవెజ్జి' కూడావుపయోగపడుతాయి. 'సాంగ్యునేరియా'తో పాటు.

14. అమత్వచలపై 'సాంగునేరియా"యొక్క ప్రాభావమేమి ?

అమితంగా ఒరుపును కలిగించే స్వభావం దీనికికలదు. అమత్వచలన్నియు ప్రథమంగా చవలేక పొడారివుంటాయి. దీనికితోడుపచ్చిగావుండి భగ్గున మండుతుంటాయి. నాటిపై నున్న పొర ఊడిపోయిందా అన్నట్లు. పడిశభారాల్లో దీని నైజగుణంయిది. మాట బొంగురుపోతుంది. గొంతుగవాచినట్లు పచ్చిగాఉండి పులమారుచున్నట్లుంటుంది. ఈగొంతులక్షణాలుగల కింకవాయువునకు దివ్యమగుమందు.

15. చర్మంపై "సాంగునేరియా" లక్షణము లేమి ;

ఋతుస్రావం సరిగాపోక ముఖముపై మొటిమలులేచిన యువతులకు యిదిమంచిమందు. ఇది యిచ్చుటచే ముఖంపై మొటిమలు పోవుటే కాకుండా నెలసరిక్రమస్థితికొస్తుంది.

అరచేతులు, అరికాళ్ళు బీటలుతీసి వెచ్చగాఉంటాయి. పాదాలు దళసరెక్కి వేడి మంటలుగా ఉంటాయి.

16. ఎట్టికీళ్ళనొప్పులకు "సాంగునేరియా" పనిచేస్తుంది ?

నొప్పులు తరచు ఒకచోటనుండి మరొకచోటకు మారుతుంటాయి. కండరాలు బిగబడుతాయి. ముఖ్యంగా నడుం మెడబిగుసుకుపోయి నొప్పిగాఉంటాయి. దీని ప్రత్యేకవ్యాధి కేంద్రం కుడిభుజం దానిగ్రంధి. దానిచుట్టునా ఉన్నకండరం రాత్రిపూట భరించరాని బాధ. చెయ్యి ఎత్తలేరు. ఇది యిల్లా కుడిభుజంమీద పనిచేస్తే ఇదే వ్యాధికి ఎడంభుజంమీద పనిచేసేది "ఫెరం".

17. పదునైదుపంక్తులకు మించకుండా "సాంగ్యునేరియా" యొక్క ప్రధానలక్షణములను క్లుప్తముగా వ్రాయుము.

ఉదయంపూట తలవెనుకభాగంలో నొప్పిప్రారంభించి తల అంతటా వ్యాపించి కుడికంటి పైభాగంలో స్థిరపడుతుంది.

2. 'సికేల్'యొక్క ప్రధాన స్వాభావిక నైసర్గిక లక్షణములేవి ?

రక్తం కొద్దికొద్దిగా చాలకాలం స్రవిస్తుంది. నెలసరి ఒకనెల నుంచి మరొక నెలసరిదాకా అవుతూనేవుంటుంది. ఈరోగులు కండలు నామమాత్రింకలిగి సన్నంగా, దుర్బలంగాఉంటారు. ఈరోగియొక్క శరీరం చల్లగాఉన్నా కప్పుకోవాలనే కోరిక లేకపోతుంది; ఇది దీనిస్వాభావిక నైసర్గికలక్షణం. లోనవేడి పైనచల్లదనం. అంటే శరీరమంతా చల్లగాఉన్నా వ్యాధిగ్రస్తభాగము వేడిగావుండి మండడం మరో అసాధారణ నైసర్గికలక్షణం. పాక్షికవాతాల్లో తిమ్మెర్లు, చీమలు పాకుచున్నట్లువుంటుంది. వ్యాధిస్థానంలో జిలగాను, ఏదో పాకుతున్నట్లు వుంటుంది. వేళ్ళలో రక్తపరిసరణలేక కమిలి, నల్లబడి క్రమంగా మాంసం క్షీణించి మృతమవుతుంది; దీన్ని గేంగ్రీన్ అంటారు.

దీని నైసర్గికలక్షణాలతోకూడిన కలరావ్యాధిలో పనిచేస్తుంది.

3. 'సికేల్'యొక్క రక్తస్రావ లక్షణములను వివరింపుము ?

ఇందు నల్లనిరక్త నిరంతరం స్రవిస్తూవుంటుంది, వాపు, బాధ అంతగావుండదు. ముక్కునుండియు, గొంతుగనుండియు, ఊపిరితిత్తుల నుండియు, మూత్రకోశంనుండియు, ఆసనంగుండాను పైన వుదహరించినవిధంగా రక్తంస్రవించేటప్పుడు "సికేల్" పనిచేస్తుంది. మూత్రం సిరాకంగుగావుంటుంది. గర్భకోశం దానికండరాలు బలహీనంగా వుంటాయి. రక్తంచాలకాలం స్రవిస్తుంది. ఒకనెలసరినుండి మిరుచ కుండా నాలుగు రెండవ నెలసరిదాకా అవుతూనేవుంటుంది కొంత మంది మధ్య స్త్రీలకు, బహిష్టు అయిన తొలిరోజున మొదటి బాగుగానే స్రవిస్తుందికాని నల్లగా, పల్చగావుంటుంది. ఈలా రెండువారాలు అయినతరువాత చిక్కనిస్రావం కొద్దికొద్దిగా రెండో నెలదాకా అవుతూనేవుంటుంది. ఈలాటిరక్తస్రావాల్లో నిరు, చిరుచమటలువుంటాయి.

ఏమాత్రం కందినా రక్తస్రావం ప్రకోపిస్తుంది. 'సికేల్' రోగి సర్వదా వేళ్ళను ఎడముగా వుంచుకుంటుంది ఒకదాని కొకటి.

4. ప్రసవసమయంలో 'సికేల్' సూచకలక్షణములేవి ?

డా. హెచ్. ఎస్. గురన్సే గారు అంటారు. "దుర్బలస్త్రీలకు బిడ్డనొప్పులు సరిగా రాక బలహీనంగా వున్నా, వచ్చే నొప్పులు నిలచిపోయినా. సరియగు నొప్పులు రాక రోగి నలిగిపోతున్నా "సికేల్"ను 200 పొటెన్సీలో దారికంలో యిస్తే చాలా పనిచేస్తుంది.

నొప్పులు సున్నితంగా, బలహీనంగా అంతులేకుండా వుంటున్నప్పుడు నొప్పులు క్రమంగా వృద్ధిగాక శిశువును గెంటలేనప్పుడు గర్భాశయకండరాలందలి నరాలు దుర్బలమై శిశువును బైటకు గెంటుటకు తగుబలం లేనప్పుడు "సికేల్" వుపకరిస్తుంది. రోగిపొట్టలో వెలితిగా ఖాళీగా వున్నట్లు వర్ణించవీలులేని ఆరాటం. ప్రసవానికి ముందు, బాలింతసమయమందు స్థనాలు ఎండిపోయి పాలుపడవు; పడినా క్రమంగా తగ్గిపోతాయి.

5. 'సికేల్' రోగికివచ్చే యీడ్పులు, మానసికలక్షణములు ఎట్లుండును?

కాలిపిక్కలలో కొంకర్లు, తొడలలోను, పాదాలలోను, అదుర్లు, వికుపులు; చేతులు కొంకర్లుపోతాయి. ఈడ్పులు యీమందుకు ముఖంలో ప్రారంభిస్తాయి. ఈరోగి ముఖ్యంగా వేళ్ళు ఒకదాని కొకటి ఎడముగా పెట్టుకుంటుంది; ఇదో ముఖ్యసూచకలక్షణం 'సికేల్'కు.

ఇందులో రోగి అతివుద్రేకంగా వుంటుంది. తదేకదీక్షతో భయంకరంగా చూస్తూంది ఎకటకావాడి. సిగ్గు-భిడియాలను, మానాభిమానాలను విడచిపెట్టేస్తుంది రోగి. బట్టలు విడచేసి దిగంబరిగా

వుంటుంది. మూసంలో వేళ్ళు పెట్టుకొని చీల్చుకోడానికి ప్రయత్నిస్తుంది. లజ్జాభావం పూర్తిగా నశిస్తుంది.

ఈడ్పులు, కొంకర్లు, మనోలక్షణాలు అన్నీ స్రావం అయినంత కాలం ఉద్ధృతంగా వుంటాయి. రక్తస్రావం మధ్యలో వస్తుంది. నూతికాకంపం. ముఖ్యంగా ఇందలి ఈడ్పులలో వ్రేళ్లను ఎడంగా ఉంచుకోడం యీమందును సూచించు ప్రధానలక్షణం. కుప్రంలో 'సికేల్'కు వ్యతిరేకంగా కొంకర్లు చేతివేళ్ళు అరచేతులలోనికి బిగబట్టడంతో ప్రారంభిస్తాయి. పిడికిలి బిగించివుంటుంది "కుప్రంలో".

6. ఎట్టి కంటిలక్షణములు "సికేల్" సూచికములు ?

అన్ని అవయవాల్లాగే కంటిగుడ్డు బలహీనతచే సత్తువకోల్పోయి దృష్టిమాంద్యంగా వుంటుంది. వృద్ధులకువచ్చు మోహపటలాల (Cataracts)కు వాడనగుమందు.

7. ప్రేగుల సంబంధమగు ఏలక్షణాలకు "సికేల్"ను అపేక్షిస్తాము ?

చాలకాలంగా నీళ్ళవిరోచనాలు అవుతుంటాయి. ఆవిరోచనాలు అమితంగా కావడంచే నీరసం, నిస్సత్తువులు కలుగుతాయి. సాధారణంగా విరోచనాలు, రక్తస్రావం ఒకేసారి రోగిని బాధిస్తాయి. విరోచనం రక్తపూరితంగా ఎఱ్ఱని నీళ్ళలాగ లేక అమితచ్ఛాయగల నీళ్ళగా అవుతాయి.

కలరా : రోగి బిగుసుకుపోయేస్థితిలో పని చేస్తుంది. ముఖం ముడుచుకుపోయి కళతప్పిపోతుంది. ఒంటిపై చీమలుపాకుతున్నట్లుంటుంది. ఒళ్ళుచల్లగా మంచులావుంటుంది; కాని ఏమాత్రం ఓపిక వున్నా బట్టకప్పితే లాగిపారేస్తాడు; యిదొకవిచిత్రం.

కొంకర్లు ఈడ్పులు వున్నప్పుడు "కుప్రం"తో అవి అదుపులోకి రాకపోతే "సికేల్" వాడితే ఈడ్పులుపోయి రోగి తెప్పరిల్లుతాడు.

కొంకర్లు : ఈడ్పులు : విస్తారిగా అయోమయంగావుంటాడు. చెముడు వినుపించదు. ఒళ్ళుత్రిప్పు; నిద్ర; మగత; చర్మం బిఱ్ఱుతప్పి ముడుచుకొనివుంటుంది. నాలుక ఊదాగావుండి కళ్ళుగుంటలుపడుతాయి. భరించరాని వాసనతో తెలియకుండా విరోచనాలు. కొంచెం, కొంచెంగా మలంఅవుతుంది. శరీరమంతా మెలిదిరిగి కొంకర్లుపోతుంది. ముఖం ముడుచుకొని నొక్కుపోతుంది. మూత్రం ఎంత బిగబట్టినా అవదు; కాని మూత్రం వస్తుందాఅని అనుమానం. రోగి కప్పుకోడానికి యిష్టపడడు. శరీరం చలువలు కమ్ముతాయి. మాట సరిగా వినుపించదు. తినినఅన్నం అరుగక వమనంచేసుకుంటాడు. ఒకటే ఓకరింపు. ఈలక్షణాలతో కొంకర్లుప్రారంభిస్తాయి.

8. 'గేంగ్రీన్' అనేవ్యాధిలో 'సికేల్' సూచకలక్షణాలేమి ?

చర్మం ఒడిలి బిగలాక్కుని మృదుత్వంచెడి బిగిసిపోయి పెళుసుగా వుంటుంది. చిరుచమట్లు. నల్లనిరసితో కూడిన బొబ్బలు లేస్తాయి. చల్లని పైపూతలు రోగికి వుపశాంతిని యిస్తాయి. అగిడిమంటలు. వేళ్ళు, గోళ్ళు నల్లగావుంటాయి. క్రమంగా మాంసమంతా పాడించిపోయి పుళ్ళల్లా అవుతాయి.

9. ఎట్టిచర్మవ్యాధికి సికేల్‌ను మందుగా వాడాలి ?

చర్మం పొడిఆరి, ఒడిలి. ముడుచుకుపోయి చూట్టానికి అనారోగ్యంగాను. అసహ్యంగాను వుంటుంది. సాధారణంగా చర్మంచల్లగా కవిలిపోయి ఊదాగావుంటుంది. కొందరిలో ఊదారంగుమచ్చలు, పొడలు, ఒడిలిన చర్మముపై కనుపిస్తాయి. ముఖ్యంగా రక్త ప్రసరణ

తక్కువగావుండే అరచేతులవెనుక, అరికాళ్ళలోను, తొడలలోను ఊదాగావుంటుంది. ఈ తావులలో తిమ్మెర, జిలావుండి ఒడిలిక్షీణిస్తాయి వ్యాధిగ్రస్తమైన వోళ్లు. కాళ్లు–చేతులయందు జిల, తిమ్మెర, చీమలు, నల్లులు పాకుతున్నట్లుండడం. చర్మంక్రింద ఏవో జంతువులు ప్రాకుచున్నట్లు భావిస్తాడు. ముఖ్యంగా వేళ్లు మొద్దుబారి, బండలై స్పర్శ జ్ఞానంనశించి మృత్యావస్థలో వుంటాయి. కాలివ్రేళ్ళు ముఖ్యంగా వృద్ధులలో సన్నబడి నలుపెక్కి సిథిలావస్థలో వుంటాయి. చర్మం మంటలు; రోగికిమాత్రం వేడిగావుండి తాకడానికి చల్లగావుంటాయి నల్లరక్తనాళాలువుబ్బి, చిట్లి, పుండైనప్పుడు (Vericose Ulcers) సికేల్ అద్భుతంగా పనిచేస్తుంది (లిప్పీ).

ఆకుపచ్చ రసితోకూడిన బాధపెట్టు చిన్నకురుపులకు "సికేల్" వాడాలి.

10. "సికేల్"యొక్క ప్రధానలక్షణములను పదునైదు పంక్తులలో వ్రాయుము.

సన్నగా, దుర్బలంగా, కోపిష్టిస్వభావంగల స్త్రీలకువచ్చువ్యాధులకు వాడేమందు సికేల్. రక్తం స్రవించేతత్వం. ఏమాత్రం దెబ్బతగిలినా వారాలపాటు రక్తం స్రవిస్తుంది. స్త్రీల మర్మేంద్రియం పటుత్వంతగ్గి తెరచుకొనివుండిపోయి రక్తం సాఫీగా కొద్దికొద్దిగా రోజుల తరబడి స్రవిస్తూవుంటుంది.

ఆకుపచ్చగాను, బూడిద వర్ణంగాను దుర్వాసనతోకూడిన కుసుమవ్యాధిని నివారిస్తుంది.

విస్తారం విరోచనాలు అవుతూకూడా విపరీతమగు ఆకలి. అతిసారవిరోచినాలు–వాసన–బాధ ఏమాత్రంవుండదు. కాని తెలియకుండా పెద్దవిగా అవుతూవుంటాయి.

వయస్సుమళ్ళినవారు నిద్రిలో మూత్రింపోసేవ్యాధిని "సి కేల్" అరికడుతుంది.

ఒళ్ళు ఆపాదమస్తకం మంటలు. నిశ్వాసకణాలు పడుతున్నట్లు భగ్గుమండుతుంది. చల్లగావున్నా లోపలితాపంచే కప్పుకోడు. కలరా, గేంగ్రీన్ మొదలగువ్యాధులలో యిది సూచకలక్షణం. రక్తంతో కూడినబుగ్గలుపుట్టడం కాలినట్లు బొబ్బలు లేవడం 'సి కేల్' స్వభావం.

కలరావ్యాధిలో కాళ్ళు చేతులు చల్లబడి రోగి కృంగిపోయే స్థితిలో పనిచేస్తుంది.

మూడవమాసంలో కలిగే గర్భస్రావాన్ని నివారిస్తుంది.

చీమలు. జెర్రెలు పాకినట్లు జిలగాను, తిమ్మెరగాను వుంటుంది శరీరమంతా.

ఎక్కిళ్ళు, కాళ్ళు-చేతులు కొంకర్లు దీనితో తగ్గుతాయి.

ఇందులో రోగి తనవేళ్ళను ఒకదానికి మరొకటి తగలకుండా ఉంచుతాడు-యీమందు కిదొకవిచిత్రలక్షణం. ఒళ్ళు చితుకపొడిచినట్లు నొప్పిగాను, జిలగాను ఉంటుంది.

ఝుమసుకుంటే కొంకర్లువస్తాయి 'సి కేల్' లో.

వ్యాధి లక్షణాలన్నియూ వెచ్చగా కప్పుకోడంచేత, ఋతు సమయంలోను, స్రావాలవలన హెచ్చుతాయి. చల్లని ఆరుబయట గాలికి కప్పుకోకుండా ఉండడంచేత, మర్దనాలవలనా, కాళ్లు-చేతులు సాచి ఉంచడంవలనా, వమనమయాక, చన్నీళ్ళస్నానంచేత ఉపశమిస్తాయి బాధలన్నీ.

# 125. సెలెనియం (Selenium)

1. "సెలెనియం" యొక్క ప్రధాన సూచకలక్షణమేమి ?

శరీరం యావత్తూ నీరసంగాను, నిస్సత్తువతోను ఉండుట దీని ప్రధానమగు సూచకలక్షణం. మానసికంగాను, శారీరకంగాను అమిత నీరసం. సాధారణంగా దీర్ఘవ్యాధులకు లోనైనప్పుడు, అమిత సంభోగం చేత, ముష్టిమైథునం వంటి దురభ్యాసాలకు లోనుగావడంచేత, అమితమగు సూర్యతాపంచేత లేక విస్తారం ఎండలో తిరగడంవల్ల అమిత నీరసం కలుగుతుంది. వడగాలిచే నీరసం, శోషవచ్చినప్పుడు "సెలెనియం" చేసేపని అమితం.

2. ప్రధానంగా శరీరమందలి ఏ మండలం (System)పై సెలెనియం పనిచేస్తుంది ?

ఇది ప్రధానంగా నాడీమండలంపై పనిచేస్తుంది. కాబట్టి నరాలకు సంబంధించిన వ్యాధులనివారణకు ముఖ్యమగుమందు. శరీరం యావత్తూ యీభాగం ఆభాగం అనకుండా నీరసం, నిస్సత్తువ కలుగజేస్తుంది. ఏమాత్రం పనిచేసినా అలసిపోతారు. రాత్రికాస్త ఆలస్యంగా మేల్కొన్నా లేక మానసిక ఆలోచనను కొద్దిగాచేసినా అలసిపోతారు. మరునాడు పగలల్లా మానసికంగాగాని భౌతికంగాగాని ఏమాత్రంకూడా పనిచేయలేరు. ఈరోగులు ముఖ్యంగా ఏమాత్రం ఎండవేడిమికికూడ తాళలేరు. ఒకప్పుడు ఇట్టే శోషవస్తుంది నీరసం వల్ల. అలసి సర్వదా పడుకొని నిద్రపోవాలని వుంటుంది. కాని నిద్రపోతే బాధలన్నియు ముఖ్యంగా తగ్గవలసిన నీరసంతోసహా హెచ్చుతాయి. నరాల దౌర్బల్యంతో ఏమాత్రంకూడా మానసికకృషిచేయలేరు. వీర్యస్ఖలనంచే అమితనీరసం, నిస్సత్తువ కలుగుతుంది.

3. "సెలెనియం" వంటి మానసికలక్షణములేమి ?

అమితమగు విచారం. ఏదో ఒకమత్తుపానీయం సేవించాలని ఉండే తీరనివాంఛను అణచుకోలేడు. పరిసరాలలో జరిగేదానియందు నిర్లక్ష్యం. మనస్సు గాబరాగాను, హెచ్చరిక అణుమాత్రంలేకుండాను స్తబ్దుగా ఉంటుంది. పనిచేసేసమయంలో మరపు. కాని నిద్రపోతుంటే కలలొస్తాయి; ఆకలలలో మరచిపోయినవన్నియు స్ఫురణకొస్తాయి. ఇదోచిత్రం 'సెలేనియం'లో మాటలుకలిపి చెప్పడంలో బాగారావు; వుచ్చారణబాగుండదు. తాను విన్నది చదివిందీ సరిగా అర్థంచేసుకోలేడు లేక అన్వయించుకోలేడు. తన వ్యాపారాన్ని సమర్థతతో నిర్వహించుకోలేడు. వ్యాపారం చేయుటాకికి సమర్థతతగ్గిపోతుంది. బుద్ధితో ఏమాత్రం కృషిచేసినా అలసిపోతాడు. మనస్సు సంభోగంపై మరల్చడమేగాని పుంసత్వమంతగావుండదు. సంభోగానంతరం మానసికబాధలన్నియు ప్రకోపిస్తాయి.

4. "సెలెనియం"లో శిరస్సుకు సంబంధించిన లక్షణాలేమి ?

పడుకొని లేచినప్పుడు, కూర్చుని నిలబడినప్పుడు ఒళ్ళుతిరుగుతుంది. మధ్యాహ్నం భోజనానంతరం వికారం, వాంతి; వీటితో సొమ్మసిల్లిపోతాడు. వాసన ఏమాత్రంసోకినా సహించలేడు. ఏమాత్రం ఘాటువాసనతగిలినా తలనొప్పివస్తుంది. టీ, లిమనీడు-బొత్తిగాగిట్టవు. అవి తీసుకుంటే తలనొప్పి. ఎడమకంటిలో కుట్టుచున్నట్లు పోటుగావుంది ఆకన్ను అదురుతుంది; ఈలా ముఖ్యంగా ఎండలోతిరగడంచే కదులుతుంది. అమితమగు బెంగ, దిగులు; ఈమానసిక ఆందోళనతో తెల్ల.. మూత్రం విస్తారంగా అవుతుంది. నీరసం విస్సత్తువతో కుమిలిపోతుంటాడు 'సెలెనియం' రోగి.

5. 'సెలెనియం' యొక్క మలబద్ధంతీరుఏమి ?

ప్రేగులకు చలనశక్తి నశిస్తుంది. అందుచే మలంకదలక ఎక్కడి కక్కడే స్తంభించిపోతుంది. మలములోనుండు స్వాభావికద్రవం పూర్తిగాఎండిపోయి మలం గట్టిపడుతుంది. కాబట్టి విరోచనం కావ డానికి ఏదైనా సాధనచేసుకవలసివస్తుంది. అదన్నీగాక మలమంతా ఒక్కచోటనే చేరిపోవుటచే పెద్దదై, ఆసనకండరంకు చలనశక్తిలోపిం చుటవలన, విసర్జన కావడం కష్టసాధ్యమవుతుంది. ఒకమోతాదు "సెలేనియం" వాడితే ప్రేగులకు ముఖ్యంగాఆసనకండరానికి చైతన్యం కలిగి క్రమంగా మలవిసర్జన తేలికవుతుంది (ఓపియం, ప్లంబం, ఎల్యూ మినా, బ్రయోనియా).

6. "సెలెనియం" ఎట్టి నిద్రలక్షణములను కలిగించకలదు ?

రోగి మూర్ఛన్నగా పడిపోతాడు. కోపిష్టుడు. కొద్దిపాటి అలికిడికికూడ నిద్ర మెలకువవస్తుంది.

ఇంకొక చిత్రమునకటిఉంది; ప్రతిరోజూ ఉదయం సరిగా ఒకే సమయమింతసమయానికి మెళుకువవస్తుంది 'సెలేనియం' రోగికి. మెళు కువ రావడం తడవుగా వ్యాధిలక్షణాలన్నీ హెచ్చుతాయి. సాధార ణంగా అర్ధరాత్రివరకు నిద్రపట్టదు.

7. "సెలీనియం"కు చర్మసంబంధమగు లక్షణములేమి ?

శీఘ్రస్ఖలన రోగము, వీర్యస్రావ రోగము, ముఖ్యంగా పసి వయసులోను విపరీతముగా [illegible] అక్కడక్కడ [illegible] దారిద వెంట్రుకలు [illegible] తల వెంట్రుకలు [illegible] కనుబొమలు, కంటిరెప్పల వెంట్రుకలు, మీసాలు, గెడ్డం ఇంకా యితరతావు

లందలి వెంట్రుకలు ఊడిపోతాయి. సవాయివ్యాధి జీర్ణించి అరచేతు లలోగజ్జి; ఆగజ్జి జిల, దురద.

మంత్రంలాటి గజ్జిబైలుదేరి రసి కారుతు దురదగా ఉంటుంది.

8. కాలేయవ్యాధులలో "సెలెనియం"ను సూచించు లక్షణాలేవి ?

కాలేయం పెద్దదై ఆకలి, అన్నహితవు క్షీణిస్తుంది. ముఖ్యంగా ఉదయంవేళ ఎంతమాత్రం ఆకలికూడవుండదు. నాలుకపై తెల్లని పాచికడుతుంది. కుడిపొక్కలో, కాలేయంలో సన్నని సూదిపోట్లు. కాలేయం అతిసున్నితంగావుంటుంది. కాలేయముండేతావున పొట్టపై సున్నితమగు పొక్కులు లేస్తాయి; ఈలక్షణం 'సెలేనియం'కుతప్ప ఏ యితరమందు యింతవరకు కలుగజేయలేదు.

9. గొంతుగకు సంబంధమగు 'సెలేనియం' లక్షణములేవి ?

గాయకులుమాత్రం జీరరాకుండ వుండడానికి బాగుగా ఉప యోగిస్తారు. ప్రారంభంలోమాత్రం జీరరావడం, పాడినకొద్దీ గొంతు బొంగురుపోవడం ఈరెంటినీ నివారిస్తుంది "సెలేనియం". గొంతుగలో కఫంచేరడంచే తరచు తరచు గొంతుగ ఖాండ్రించుకోవలసినఅగత్యం కలుగుతూఉంటుంది. గొంతుగక్షయకు వాడదగు మందు 'సెలేనియం"

10. గొంతుబాధలను నివారణచేయుటలో 'సెలేనియం' తో పోటీకి నిలచే మందులేవి ?

ఆరంజైత్రిసిలినం, స్పాంజియా, కాస్టికం, కార్బొవెజ్, ఫోస్ఫరస్.

11. పురుష జననేంద్రియములపై 'సెలెనియం' ప్రభావమేమి ?

పురుష జననావయవం అతినిస్సత్తువగావుంటుంది. వాంఛకే లోపముండదుగాని పురుషాంగానికి లేవనుండదు; లేవనంటున్నా

సంభోగం అసంతృప్తిగాను, అసంపూర్తిగానువుంటుంది. తరచు శుక్ల నష్టం. అమితంగా మూత్రం పోసేసమయాన్ని తెల్లగా పాలవలె కుదుపల్లా "ప్రాస్టేటిక్" ద్రవం పోతుంది. ఉదయంపూట లేపనం వుంటుందిగాని సంభోగేచ్ఛఉండదు. లేపనం వచ్చిందిగదాఅని సంభోగింపబోతే పురుషాంగం ముడుచుకుపోతుంది. మర్మావయవము దురదగాఉండి చిరుచమట్లుపోస్తాయి.

12. 'సెలేనియం'యొక్క లక్షణములనుగూర్చి క్లుప్తముగా పన్నెండు పంక్తులలో వ్రాయుడు.

స్వల్పమగు మానసిక, శారీరక పరిశ్రమలచే రోగి అలసిపోతాడు. ఈ స్థితి యింద్రియ స్ఖలనమువలన, టయిఫాయిడ్ మొదలగు దీర్ఘతరుణ వ్యాధులవలన లేక విపరీతంగా ఎండలో తిరుగుటచేతను కలుగవచ్చును.

ముఖం చేతులు, తొడలు, పాదాలు శుష్కిస్తాయి. వ్యాపారంలో చాల మరపు; అట్లు మరచిపోయిన వాంశాలన్నీ కలలలో జ్ఞప్తికి వస్తాయి.

ఇందులో వెంట్రుకలు ఊడిపోవడం ఒక లక్షణం. ఈ వెంట్రుకలూడ్డం ఒక్క తలవేకాకుండా కనురెప్పలవి, కనుబొమల మీదవి, మీసాలు, గెడ్డం వగైరాలుకూడ ఊడిపోతాయి.

జలుబు రొంప పట్టి విరోచనాలు అవడంతో అంత్యమవుతుంది. విరోచనం పెద్దదిగాను, గట్టిగాను ఉండడంచే ఆసనకండరం బలహీనమై తగిన శక్తి లేక మలవిసర్జన చేయలేదు. కనుక ఏదైనా సాధన చేయవలసి వస్తుంది మలం బయటకు పోవడానికి.

స్త్రీ వాంఛకు లోటుండదు; కాని సంభోగించడానికి పుంసత్వం లోపిస్తుంది. గాయకులు పాడేముందు గొంతుకలో జీర రావడానికి కూడ 'సెలేనియం' పనిచేస్తుంది. గొంతుగలో కఫంచే తరచు ఖాండ్రించవలసి వస్తుంది. చేతులు ఉలారం, అరచేతులలో అమితంగా దురద; యివి గనేరియా జీర్ణించుటచే కలిగేవి. 'చైనా' దీనికి వైరుధ్యం. అందుచే 'సెలేనియం' వాడిన తర్వాత 'చైనా' యిస్తే అనవుసరంగా బాధలు వస్తాయి. ఎడమ కంటిలో నూకపోట్లలా వుంటాయి పోట్లు. సూర్యతాపం వలనా గాలి దుమారంచేత టీ, లెమనీడ్లు త్రాగడం వలనా రోగలక్షణాలు ప్రకోపిస్తాయి.

నోటిలోనికి చల్లని గాలి పీల్చుటచేత, చల్లని నీరు త్రాగడంచేత ఉపశమిస్తాయి యిందలి బాధలు.

## 126. సెపియా (Sepia).

(ఏంటిసోరిక్ - ఏంటిసైకొటిక్)

1. ఎట్టి రోగులకు "సెపియా" వాడనగును ?

సన్నగా బక్కపలుచగా పొడుగుగానుండి పిరుదలు ఎండియున్న స్త్రీలకు దీనిని వాడాలి. పొడుగాటి స్త్రీలకు సెపియా; పొడుగాటి పురుషులకు ఫోస్ఫరస్.

పొడుగ్గా, సన్నగా, బక్కపలుచగా భుజాలనుండి క్రిందివరకు ఒకే విధంగా సన్నగావుంటారు. 'సెపియా' రోగులు.

2. రక్తంపై 'సెపియా' ప్రభావమేమి ?

తాపము, వేడి, శగలు పొట్టలో ప్రారంభించి క్రమంగా శరీరమంతయు వ్యాపించి సిరస్సుపైకి కేంద్రీకరిస్తుంది. దీనితో ఆరాటం,

నిస్సత్తువ వచ్చి, తుదకు చమటలు పోయడంతో అంత్యమవుతుంది. ఒళ్ళంతా ధనాదింపు. ముఖ్యంగా కాలేయం వుండే తావున, గర్భకోశంలోను, తుంటియందు యీ ధనాదింపు అమితంగా గోచరిస్తుంది.

నెలసరి నిలచిపోవడంచేతనో, ఉష్ణోగ్రతగల చోట ఉండడం వల్లనో లేక దెబ్బతగిలి ముక్కు అదరడంచేతనో ముక్కువెంట రక్తం పడుతుంది.

చేతులు వేడిగాను కాళ్లు చల్లగాను వుంటాయి. కాని పాదాలు వేడెక్కితే చేతులు చల్లబడుతాయి ఈ వింతలక్షణం సెపియాను సూచించే ప్రముఖ లక్షణం (ఫేరింగ్టన్).

3. "సెపియా" రోగియొక్క మానసిక స్వభావమును స్పష్టముగా విశదీకరింపుము.

రోగి నిరుత్సాహముగా వుంటుంది. విచారము, ఇట్టే; ఏడుస్తుంది. చాల నిర్లక్ష్యం. సంసార విషయాలు పట్టించుకోదు. తన కుటుంబాన్ని, పిల్లలనుకూడా చూచుకోదు అతి నిర్లక్ష్యం; ఏది ఎట్లా పోతే నాకెందు కనుకుంటుంది. చాలమట్టుకు యీ మందు ప్రేమ స్వభావాన్ని నాశనంచేసి అనురాగాన్ని రూపుమాపేస్తుంది. ప్రేమ ఉంటుందిగాని అనురాగం వ్యంగ్యమవుతుంది. అనురాగం ప్రేమ యొక్క ఫలితం. ప్రేమిస్తేనే అనురాగం ఉదయిస్తుంది. ప్రేమయొక్క చైతన్యమే అనురాగం. రోగిని 'యిదేమిటమ్మా' అంటే 'భర్తను ప్రేమించాలని నాకు తెలుసు; కాని యిదేమి ఖర్మమో నాకు ఆ విషయం మనస్సుకే పట్టడం లేదు' అంటుంది. ప్రేమ అనురాగంగా రూపొందడంలేదు. జీవితానికి సంతోషమే నశించిపోతుంది. సంఘంలో ఉండడం అంటే బాధ; ఒంటరిగా వుండడానికి భయం. తన కోప

మంతా తాను ప్రేమించేవారిపై తీర్చుకుంటుంది. తన భావాలకు ఎవరు వ్యతిరేకం చెప్పినా సహించలేదు. ప్రతిఘటిస్తే తనకు ఉన్న మంచి అభిప్రాయాన్ని మార్చుకుంటుంది.

మరపు ఎక్కువ. నిస్సహాయతను తెచ్చిపెట్టింది. దానిపై నిస్పృహ. తన వ్యాపారంలో శ్రద్ధ నశిస్తుంది. అత్యాస, మితిమీరిన లోభత్వం. (లైకోపోడియం).

4. "సెపియా" యొక్క సహజ సూచకలక్షణముల ఆరింటిని తెల్పుము?

1. ఉదరకుహరంలో శూన్యంగా ఏమియు లేనట్లుంటుంది. దానితో నీరసం, నిస్సత్తువ. అన్ని కోశాలలోను ధనారింపు. శ రీ ర ం చల్లగా ఉంటుంది.

2. పసిమివన్నె మచ్చలు. చెక్కిళ్ళ పై భాగంనుంచి అడ్డంగా ముక్కుపైనుండి ప్రసరించారు – శోభిలా ముఖంపై అడ్డంగా బైలు దేరుతుంది.

3. జననేంద్రియం క్రిందకు దిగలాగుతున్నట్లుండి అవి నిండుగా నున్నట్లు భావం.

4. అతి వేగంగా నడచినా పనిచేసినా వ్యాధి లక్షణాలు తగ్గుతాయి.

5. [illegible] రాత్రి మధ్యాహ్నం ఏ బాధ లేకుండా ఉంటుంది. వ్యాధి బాధిస్తున్నా పై వేడి ఉపశమిస్తాయి.

6. అన్నం తినేటప్పుడు, తిన్నాక, ఉదయం వేళ, సూర్యాస్తమయాన్ని స్థిమితంగా చూస్తున్నప్పుడు వ్యాధిలక్షణాలు హెచ్చుతాయి.

5. శోభమచ్చలాటి పచ్చగా, బూడిదరంగుగావున్న మచ్చలు పోయే టందుకు వాడదగు మందులేమి?

సెపియా; లైకొపోడియం; నక్సువామిక; సల్ఫర్.

6. తామరకు సాధారణంగా వాడేమందులేవి ?

సెపియా, కాల్కేరియా కార్బ్, బరియాటా కార్బ్, టెల్యూరియం.

7. 'సెపియా'లో శిరోలక్షణములేమి ?

పార్శ్వంనొప్పి (Hemicrania), సాధారణంగా ఎడమకంటిపై భాగాన్ని సిరస్సునొప్పి. ధనాదింపు ఆనొప్పి వాంతితో తగ్గుతుంది. కదిలినా వెలుగులోనున్నా, చప్పుడైనా, ఉరుములతో కూడిన గాలి-వానావచ్చినా ఉద్రేకించి, చీకటిగదిలో గాఢంగా నిద్రపోతే వుపశ మిస్తుంది ఆతలనొప్పిబాధ (బ్రై, బెల్లడోనా).

నడినెత్తిని చల్లగావున్నట్లుంటుంది (విరాట్రింఆల్బ). ఒక్కొ క్కప్పుడు తలనొప్పి ప్రళయంగావచ్చి తలకు కంపంపుట్టిస్తుంది, రోగి ఎంతప్రయత్నించినా తలకంపించుట అదుపులోకిరాదు (నేమ్)

8. పార్శ్వంనొప్పికి 'సెపియా'తో పోల్చదగు మందులేవి ?

"సేంగ్యునేరియా" : కుడిపార్శ్వం నొప్పి. మెడవెనక ముచికలగుంటలో పుట్టి కుడికంటిపై కేంద్రీకరిస్తుందినొప్పి. ఈనొప్పి సూర్యోదయంతో పుట్టి, సూర్యునితో పెరిగి, సూర్యాస్తమయంతో తగ్గుతుంది.

'అయిరిస్' దృష్టి మసగతో ప్రారంభించి పుల్లని వాంతితో నివారణమవుతుంది తలనొప్పి.

'పల్సెటిల్లా' అన్నివిధాలా 'సెపియా' కునకలు, కానియిందులో నొప్పి ఒకచోట నిలకడగావుండదు.

ఫోస్ఫరస్ – లో శక్తి గావుండేభావం లేనటంతో తగ్గుతుంది.

ఇక్షీపియా – లో రోగి కటిము నల్లగాళ్లు విదుస్తుంది. ఏమి తిన్నా, ఎంతతిన్నా పొట్టలోని నూన్యభావంపోదు.

ఒలెండర్ – కడుపులో వెల్తిగాను, గాబరాగాను వుండి చని పోతానేమో అనుపిస్తుంది రోగికి, అన్నంతిన్నా తగ్గదు. తిన్నదిఅరుగక మర్నాడు అజీర్తి విరోచనాలవుతాయి.

లైకోపోడియం – లో ముఖ్యంగా సాయంకాలం 4–8 గంటల మధ్య పొట్టలో వెల్తిగానున్నట్లుండి తిన్నాగాని ఒకప్పుడు తగ్గదు.

కాలికార్బ – అన్నం తినకపూర్వం వుంటుంది వెలితిగావున్నట్లు తిననాగాని తగ్గదుసరికదా హెచ్చుతుందికూడాను యీభావం.

కాక్యులస్ – ఈనీర్సం పొట్టలోపుట్టి ఛాతిలోనికి పాకుతుంది. ఇది రాత్రి నిద్రపోనిహేతువుచే కలుగుతుంది. లేక ప్రకోపిస్తుంది ఈ లక్షణం.

సెలీనియం : వెల్తిగావున్నట్లుభావం తిన్నా వుంటుంది. ఎక్కువగా ఛాతీలో నీర్సంగావుంటుంది నోరు తియ్యగావుంటుందదీనిలో.

సాకసపారిల్లా – కడుపులో ప్రేగులు అరవటంతో వుంటుంది వెల్తిగావున్నట్లుండేభావం.

సాల్ఫ్యూవనిమస్ – కడుపులో ధాతుష్టలు విస్తారంపోవుటచే వెల్తిగావుంటుంది. ఆరాటం.

పెట్రోలియం – సెపియా – ఇవి చాల అద్భుతంగా పనిచేస్తుంది యీలాటి నూన్యభావాలకు. ఇందులో దడ వణకు పొట్టలోపుట్టి ఒళ్ళంతా దడగావుంటుంది.

14. ఎట్టి మూత్రవ్యాధులను "సెపియా" నివారిస్తుంది?

బిడ్డరాత్రిపడుకోడంతడవుగా తెలియకుండా పక్కలో మూత్రం విసుస్తుంది. దగ్గినా, తుమ్మినా, నవ్వినా, పరధ్యాన్నముగావున్నా, తలుపుచప్పుడైనా, జోడుచప్పుడైనా తెలియకుండా మూత్రంపోతుంది. తరచుమూత్రం వుబ్బుకొనివస్తుంది. మూత్రం తెల్లగా పాలఛాయలో మండుతూ వెడుతుంది. దాన్ని ఒకగిన్నెలో నిలువచేస్తే గిన్నెఅడుగున తెల్లని మట్టివంటిపదార్థం పేరుకొని ఎంతకడిగినాపోదు. మూత్రానికి హటాత్తుగా వెళ్ళవలసిరావటం. మూత్రం విసర్జించేటప్పుడు మూత్రవాహినిలో కత్తితో కోస్తున్నట్లుండడం, శరీరంయావత్తూ కంపించడం "సెపియా"కు మూత్రలక్షణాలు. వీటన్నిటికి కారణం మూత్రకోశంయొక్క బలహీనత.

15. రాత్రి తొలినిద్రలో మూత్రం బట్టల్లో పోయడమనే లక్షణం "కాస్టికం" తో పోల్చి వ్రాయుము.

రెంటికీకూడ తొలినిద్రలో పక్కలో మూత్రంపోయుటవుంది. సాధారణంగా 'కాస్టికం' మొగపిల్లలకు వయోవృద్ధులగు పురుషులకు వుపయోగపడుతుంది. కాస్టికంలో పగలు రాత్రి అనే నియమం లేకుండా తెలియకుండా మూత్రంపోతుంది. మూత్రవిసర్జనానికిసహాయపడే నాడీకేంద్రము పాక్షికవాతముచేత, సీతగాలిచేత కాస్టికంలో యీ మూత్రవ్యాధి కలుగుతుంది. సెపియాలో మూత్రకోశం దుర్బలపడి తటస్థిస్తుంది.

16. స్త్రీలలో "సెపియా" ఏఏ వ్యాధులను కలుగజేస్తుంది.

మూడవ మాసంలో గర్భస్రావం కలిగిస్తుంది. 5 లేక 7వ మాసాలలో విస్తారం రక్తం స్రవించడం 'సెపియా' అరికడుతుంది. స్త్రీ జననేంద్రియములన్నియు చాలా బలహీనంగావుంటాయి. ప్రసవానంతరం; మానిపడను.

స్త్రీపురుషుల యిష్టప్రకారం సంయుక్తమైనా కూడా పరస్పర అయిష్టత వుంటుంది. ఓపిక క్షీణిస్తుంది. సంభోగానంతరం అలసిపోతుంది. కొన్ని రాత్రిళ్ళు నిద్రపట్టదు; పట్టినా కలలతో కలతనిద్రగావుంటుంది. నిద్రలో కండరాలు అదురు; అవయవాలలో యీడ్పులు. గర్భకోశంయోనివద్దా పచ్చిగావుండి కుసుమ స్రవిస్తుంది. మైల ఒకప్పుడు కొద్దిగాను మరొకప్పుడు ఎక్కువగాను ఋతుసమయంలో అవ్వటం సహజం (కెంటు). సున్నితమైన యువతులలో భరించలేనంత ఋతుశూల. సాధారణంగా పిల్లలు పాలుత్రాగడం తగ్గాక బహిష్టు అవుతారు. అట్లు బహిష్టు కాకపోయినా, ఒకవేళ పుట్టిన శిశువు మరణించి వెంటనే బహిష్టు కాకపోయినా "సెపియా" యిస్తే సక్రమంగా నెలసరి అవుతుంది. (పాలు శిశువుకు యిస్తూనే బహిష్టు అవుతుంది-కాల్కేరియా-కా)

పిండాశయం యోనివద్దా బయటకు వచ్చేస్తుందా అన్నట్లు దిగదీసేపోట్లుంటాయి గర్భకోశంలో.

నడుం మంటతో గర్భాశయం, యోని కండరాలలో పటుత్వం తగ్గి ముందుకు జారతాయి. గర్భాశయ ముఖద్వారంలో మంట పొడుస్తున్నట్లు పోట్లు. నెలసరి ముందుగా అవుతుంది కాని మైల మాత్రం నామమాత్రంగా అవుతుంది. (ఆలస్యంగాను, కొద్దిగాను నెలసరి అయితే- డల్కమేరా, ఫాస్ఫరస్, పల్స్, సల్ఫర్" కనుక్కు తెల్ల

గా పాలవలె ఉంటుంది. పగలు మామూలుగా అవుతుంది. (రాత్రి మూత్రం ఎక్కువ (బగిరిషియా) కనుక అధికం గాను, వాసనతో కూడి నీళ్ళలా అవుతుంది "సెపియా"లో.

నీరసంగా ఉండటం గర్భాశయంలోని అన్ని మర్మావయవాలు బయటపడి పోతాయేమో అన్నంత దిగలాగే భావం ఉండటంచే దానిని అదుపు చేద్దామని కాళ్లు బాసింపట్లు వేసుకొని ఉగ్గబెట్టుకు కూర్చుంటుట "సెపియా" యొక్క ప్రధాన నైసర్గిక లక్షణాలు. గర్భ కోశం పెద్దదిగా గట్టిగా ఉంటుంది.

19. "మ్యూరెక్సు, సెపియా"లకు గల సంబంధాంశములను వ్రాయుము

"మ్యూరెక్సు"కు "సెపియా"వలెనే గర్భాశయమందలి అవయవములన్నియు క్రిందకు దిగజారిపోవుచున్నట్లు భావముండి కాళ్లు బాసింపట్లు వేసుకొని కూర్చుంటుటే కాక బుతు సరి విస్తారముగా వెడలుటయు వెడలు సమయమందు మితిమీరిన సంభోగేచ్ఛయున్నూ ఉంటుంది.

18. పురుషావయవములందు "సెపియా" వాడదగు లక్షణాలేవి ?

పురుష మూత్రవాహిని నుండి తెల్లని పాలవంటి లేక పసుపు ఆకుపచ్చ మిశ్రమరంగుల దుర్వాసనతో కూడిన స్రావము వెలువడు నప్పుడు "సెపియా" వాడాలి. మేహ తెలుపు (gleet) ఎట్టి బాధలు లేకయే రాత్రికాలమందు మూత్రమే స్రవిస్తుంది. ఈ కంగు పసుపు వర్ణము; మూత్రవిసర్జన సమయమందు వమూత్రము మంట ఉండటం. ఉదయం లేచేసరికి మూత్రవాహిని చివర (స్రా)వముచే అంటుకొనిపోయి ఉంటుంది. కొన్ని తరచు వీర్యస్ఖలనముచేతను, పురుషావయవము బల

హీనమగుటచేతను, చిరకాలమునుంచి శగవ్యాధి జీర్ణించి మేహతేలు పువిస్తారముగా అగుటచేతను కలుగవచ్చును; ఇట్టి వ్యాధిని "సెపియా" నివారిస్తుంది. గ్లీటు (gleet) స్రావం చిరకాలం నుంచి ఉండి రోగి లావుగా ఉబగా ఉండి మంటను కలుగజేస్తే "కేప్సికం" మందు. పురుషుల నపుంసకత్వానికి స్త్రీల వంధ్యత్వానికి "సెపియా" వాడాలి.

19. కుసుమ వ్యాధిలో "సెపియా" వాడవలసిన సమయమేది?

పసిమి, ఆకుపచ్చ మిశ్రమ ఛాయలో కొద్దివాసనతో కుసుమ వెడలుచున్నప్పుడు, గర్భకోశమునుండి యోనిద్వారా అవయవములు దిగజారుచున్నట్లు భావము ఉండి నడుము నలుపుగా నున్నప్పుడు "సెపియా" ఉపయోగపడుతుంది. గర్భాశయంలో మంటతో గూడి పోట్లు.

20. "సెపియా" వాడవలసిన నడుము బాధలెట్టివి?

నడుం పట్టుఉండదు. నడుం చాల బలహీనంగా ఉంటుంది. నడుమునుండి తుంటి కొనవరకు పోట్లు; సాధారణంగా కూర్చుని ఉండుటచే వచ్చి అమితంగా పనిచేయుటచే తగ్గుతుంది. "సెపియా"కు ఒక వింతలక్షణం ఉంది– రోగి ఎంత బక్క–చిక్కి నీరసంగాఉన్నా ఎంత పనైనా చకచకా చేస్తుంది, నడవడంకూడా అంతే; అప్పుడు ఉన్న బాధలన్నీ కనుపించకుండ పోతాయి. మరోవిషయం – నొప్పిని అదిమి నొక్కితే తగ్గుతుంది; అందుచే నడుంనొప్పికి రోగి ఒక పెద్ద పుస్తకం కుర్చీకి క్రిందుగా వుంచి నడుమ దానిని అణచిపెట్టి కూర్చుంటే నడుము నొప్పి తగ్గుతుంది. వంగితే నడుంనొప్పి విపరీతంగా వుంటుంది.

రెండు భుజాల మధ్యనహా చల్లగా వుంటుంది. (రెండు భుజాల మధ్య మంటకు 'ఒ్రియోనియా, లైకో').

తక్షణం 'సిలికా' వాడవలెను. శరీరమంతు వలయముగంతగా ఈ లవణ మున్నచో కళి స్రావకముగానే కొనసాగి పుండును మాన్పును. 'సిలికా' లోపించినచో కళి పోవుట మందగించును. కళి ఎన్నాళ్ళకైనను కట్టువడక పుండుమానదు. ఎంత ఎక్కువగా ఈ లవణలోపమున్న అంత దీర్ఘకాలముగా కళి కారుచూ పుండు ఎప్పటికినీ మానక వాపు, పోటు సాగుచుండును.

3. 'సిలికా'కు గల సాధారణ మైన లక్షణములేమి? పుస్తకపు పుటకు మించకుండ వ్రాయుము.

ఇది సోరిక్, సైకోటిక్ తత్వములలో పనిచేయు చాల లోతైన దివ్యౌషధము. ఈ రోగులు సాధారణంగా నరముల దుర్బలత్వము కలవారు. వీరికి ముక్కుపై రోగముండును. పిరాకజెంది జీవితమున్న రోగులెందరు స్వాభావికులు. వీరు అతిసున్నిత స్వభావులు. కొద్దిపాటి శబ్దమునుకూడ భరించలేని దుర్బలులు. తినిన పదార్థములు పక్వమై ధాతువులుగా మారక శుష్కించెదరు. పిల్లలు తిండి లోపము చేకాక తగు జీర్ణశక్తిలేక చిక్కి నీరసముగా నుందురు. నరముల దుర్బలత్వము వలన కొద్దిపాటి కృషికికూడ అలసిపోతారు. ఏమాత్రం అలికిడైనను నిద్రాభంగం. స్థిమితములేక ఏదో ఒక అవయవము ఆడించు స్వభావము కలిగియుందురు. ఆరాటము, చెప్పినమాట విను స్వభావము కలిగి హృదయ కార్పణ్యముచే శోషపోవుదురు. కొద్దిపాటి మానసిక పరిశ్రమకూడ చేయలేరు. ముఖ్యంగా వ్రాసినా, చదివినా చాల నీరసం. చాల కష్టంగా వుంటుంది. ఏమాత్రం ఆలోచన చేయలేరు. ఆత్మవిశ్వాసం కొంచెంకూడ ఉండదు. నిస్పృహా, నిరుత్సాహం, సాధారణంగా వాచి పుండు కావడం, పసుపురంగు చీము స్రవించడం స్వభావం, వేడి క్షీణించి చల్లగా చైతన్యహీనంగా వుంటారు. శరీర

'సిలికా' వాడాలి. "మెలాంటిరినం" కూడా టీకాలు వేయడంచే కలిగే దుర్గుణాలను నివృత్తి చేయుటకు. టీకాలు వేయడంవల్ల కలిగేదుర్గుణాలు "థూజా" వల్ల నివారణకాగల హోంశాన్ని పాఠకుల హృదయఫలకంపై సిలాక్షరాల్లా నిలిచిపోవులకు ఒక స్వీయానుభవాన్ని వివరిస్తా. ఈ మధ్యనే ఒక "యస్-యి" రైల్వేవుద్యోగి గత ఆరుమాసాలనుంచియు అతిసార విరోచినాలుతో బాధపడుతూ శల్యావశిష్టుడై నాతో సలహా చేయడానికి వచ్చారు. సుమారు 35 సం॥వయస్సు. కళ్ళుగుంటలు వడ్డాయి. ముఖం పీక్కుపోయింది. ఎముకలు, చర్మంమాత్రం వున్నాయి. కూడావచ్చినమామగారు పట్టుకుంటేనేగాని లేవలేనిస్థితి. రెండుమాసాలపాటు రైల్వే ఆసుపత్రిలోవున్నా తగినంతగుణంలేదు. ఏమిచ్చినా విరోచినాలు తగ్గకపోవడం చూచి స్థానికంగావున్న కింగుజార్జి హాస్పటలుకు పరీక్షార్థం పంపారు. వారు నఖశిఖపర్యంతం పరిక్షచేసి, వ్యాధేదియులేనట్లు స్థిరపరచి యింటికి పంపేశారు.

కడుపులో 'గయిగుయి'లు. పేగులలో తరంగాలలా వుదయం వేళ విరోచనంకాకపూర్వం కదలిక, అరపులు విస్తారంగావుండేవి. ఒక ప్పుడు విరోచనానికి దొడ్లోకివెళ్ళుటకుకూడ తడవులేకుండా అయ్యేది. 'ఎలోసు' 'నేట్రింసల్ఫ్'. లక్షణాలపరికారం మందిస్తే పనిజరుగలేదు. రోగియొక్క మేనమామ క్షయవ్యాధివలన చనిపోయాడనివిని ఒక మోతాదు "ట్యుబర్కులినం"కూడ యిచ్చాను. రెండురోజులు అసలే విరోచనంలేదు. మూడోరోజు తెల్లవారగట్లనుండి గొట్టాలతోకొట్టి నట్లు ఒకటేవిరోచినాలు. అందుచే రోగిస్పృహతప్పి పడిపోతే కబురు పంపగానే వెళ్ళాను. అయిదవమాసం గర్భవతియగు అతనిభార్య తలుపు చాటున నిలునబడి కంటతడిపెడుతూ 'చెపితేవినకుండా ఊరుబాగుండ లేదంటూ టీకాలువేయించుకున్నారు, ఆమాయటీకాలు వేయించు కున్న నాటినుంచే యీ విరోచినాలు పట్టుకున్నాయి విడువ

కుంటా"అంది. ఆమాట వినగానే "దొరికావురా దొంగ" అనుకుని ఏనుగను ఎక్కినంత సంతోషపడ్డాను. 'అమ్మా దిగులుపడకండి; అసలు విషయం యింతకాలం దాచిపెట్టేశారు. రేపు యింక విరోచనాలు కావు. ఏమియు కంగారుపడకండి; అని హామీయిచ్చి మామగారిని వెంటపెట్టుకొని, డిస్పెన్సరీకివచ్చి 'తూజా' 200 లలో 2 పొట్లాలు యిచ్చి ఒకదాన్ని వెంటనే వెయ్యమన్నాను. నీళ్ళవిరోచనం తిరిగి అయితే రెండవది వేయమనిచెప్పి పంపించా. చూడండి మరునాడు ఆకుటుంబంపొందిన సంతోషం యింతా అంతాకాదు. లాభంలేదను కున్నరోగి పదిరోజులు తిరక్కుండా వుద్యోగంలో చేరాడు. టీకాలు వేయడంచే కలిగే దుర్గుణాలను త్రుంచడంలో 'తూజా'యొక్క ప్రతిభను నిరూపించడానికి యిది అద్భుతమగు కేసు. ఇల్లాగా సిలికాకూడ నిరుపమానంగా పనిచేస్తుంది.

6. ఏ మానసికలక్షణాలకు 'సిలికా' వాడాలి ?

నరాల దౌర్బల్యంతోపాటు మనస్సుకూడా దౌర్బల్యంగాను నీరసంగాను వుంటుంది. ఏకృషిలోనైనాసరే దుర్బలత్వం; అధైర్యం పిరికితనం, భయం, ఆత్మ విశ్వాసశూన్యత. ఏకార్యాన్నీకూడ జయప్రదంగా నిర్వహించలేమనే అధైర్యం 'సిలికా'కుగల ప్రత్యేకమైన మానసికలక్షణం. తనప్రయత్నంలో భంగపాటుకలుగుతుందనే మనోదౌర్బల్యం; కానిపనిని ప్రారంభించాడా జయప్రదంగా ముగిస్తాడు.

కొన్నిసంవత్సరాలుగా చదువుచూ పరీక్షలు సమీపిస్తుంటే భయం; కాని వుత్తీర్ణత మాత్రం ప్రథమశ్రేణిలోనే. ఆత్మవిశ్వాసం ఏమాత్రమూకూడ వుండదు. 'సిలికా' రోగికి. అసలుపనిని ప్రారంభించడానికేభయం. నలుగురిలోకి రావడానికి భయం, పరీక్షలంటే భయం.

'పల్సా'ను స్ఫురణకు తెచ్చే నెమ్మది, అణకువ, వినయం, మాట్లాడితే ఏడవడం 'సిలికా'కు కూడ వుంటాయి. ఇది 'పల్సా'కు కాలికం (Chronic) సహజమగు సహచారి.

విద్యార్థులు, ఉపాధ్యాయులు, న్యాయవాదులు మొదలగు మానసికశ్రమచేసే వారిలో మందబుద్ధి, మాంద్యత కలిగితే 'సిలికా' నివారిస్తుంది.

విద్యార్థులు పరీక్షలకని రేయింబవలు చదువుతారు నిద్రాహారాలు లేకుండా. అందువల్ల రోగి ఆరోగ్యం అన్నివిధాలా చెడుతుంది. అట్టివారికి 'సిలికా' మానసికబలాన్ని చేకూరుస్తుంది (కెంటు).

నిస్పృహా, జీవితమంటే విసుగు (కేరీ). 'సిలికా' రోగిధ్వనిని ఏమాత్రంకూడ సహించలేడు.

## 4. 'సిలికా' పనిచేసే చర్మవ్యాధులేవి ?

శరీరంలో ఏభాగంలోనైనాసరే వాచి చీముపడితే "సిలికా" దివ్యమైనమందు. చీమును వెలువరించి వ్రుండును మానుపుతుంది. దీనికిది సహజగుణం. సాధారణంగా "హీపార్", "కాల్కేరియాసల్ఫ" వాడేస్థితి దాటాకా అనగా వచ్చిన చీమును పోనార్చి వ్రుండును తగ్గించుటకు 'సిలికా'ను వాడాలి. శరీరంపై పులిపిరికాయలు, మొటిమలు, పొక్కులు, వ్రణాలు; వీటికి నిరుపమానమగుమందు. పాదాలకు విపరీతంగా వాసనవేయు చమటలుపట్టుట 'సిలికా'కు మరో ప్రముఖలక్షణం. చమటలు పట్టేటప్పుడు కాళ్ళనుతడిపితే చమటఅణగారి చలి కుమువచ్చి భయంకరమగు పెక్కువ్యాధులకుదారితీస్తుంది. 'సిలికా' అణచిపెట్టబడిన చమటలు పైకితెచ్చి వ్యాధిని పోగొట్టడమే కాకుండా శాశ్వతంగా చమటలనుకూడ నివారిస్తుంది. చర్మంలోని

నరాలు ప్రకోపించడంచే శరీరమందలి ఏభాగాన్ని ముట్టుకున్నా నొప్పి వల్ల ఏడుస్తాడు రోగి.

8. పాదాలకు వాసనతోకూడిన చమటలను పుట్టించే మందులేవి?

బరియాటా కార్బ, గ్రాఫయిటీస్, సోరినం, సెనెక్యులా, సిలికా.

9. ఏలాటి తలనొప్పిని "సిలికా" తగ్గిస్తుంది?

తలనొప్పి వెనుకభాగం ముచికల గుంటలో ఉదయం వేళ ప్రారంభమై నుదిటకి వ్యాపించి రాత్రి అయేసరికల్లా భరించరానంత నొప్పి అవుతుంది. అలికిడి ధ్వనికికూడా ఉద్రేకించి నెత్తచే ఉపశమిస్తుంది.

తల వెనుకనుంచి కుడిభాగంలోకి నొప్పి పొడుస్తుంది. మూడ పట్టున బరువు పెట్టినట్లనిపిస్తుంది. నడినెత్తి బరువు వారానికొక రోజున వచ్చే తలనొప్పులకు పనిచేస్తుంది. (లైకో, జల్సిమియం, శాంగ్యునేరియా సల్ఫర్.)

10. 'సిలికా' వాడితే తగ్గే కంటివ్యాధులేవి?

కంటి రెప్పలపై మొటిమలు, కంటి రెప్పలు వాలిపోతాయి. వెలుతురును చూడనివ్వని ప్రతి కంటి వ్యాధిని తగ్గిస్తుంది. కండ్లలో నలుకలు పడి బాధగానున్నప్పుడు "సిలికా" దివ్యమగు మందు. నలుక బైటకు వచ్చుటకు; విపరీతంగా కన్నీరుకారే వ్యాధుల నివారణలో కూడ "సైలీషియా" సాటిలేనిది.

11. "సిలికా" నివారించే చెవి రుగ్మతలేవి?

చెవినుండి చాలాకాలంగా చిక్కని దుర్వాసనగల చీముకారుటకు, చెవుల వినికిడిశక్తి లోపించుటకు. చెముడునకు, చెవిలోపుట్టే

వివిధ శస్త్రాలకు వాడాలి. ముక్కు బరువు, పెదవి పైభాగంలో మొటిమలుఉండి చెవివెంట చీముకారుచుంటే "సిలికా" వాడాలి.

12. నాసికావ్యాధులలో "సిలికా" వాడే స్థితులేవి ?

ముక్కులో గట్టి పక్కులు, రుచి, వాసన తెలియవు. ముక్కు వెంట రక్తము, రసి. ముక్కుఎముకలు సిథిలమై చిన్నచిన్న ముక్కలు గావూడి పడిపోవును. ముక్కులో భాగము ఒరిసి ముక్కు కోణాలలో చిన్నచిన్న కురుపులు వేయును. విపరీతముగు దురద ఉలారము, ముక్కు ఎంకి పక్కులుకట్టి ఒరిసిఉండును. ముక్కుచివర ఎఱ్ఱగాకంది దురదగా నుండును.

13. ఏఏ రోగలక్షణాలకు "సిలికా" వాడాలి ?

రాత్రిలందు భరించరాని పళ్లపోటు, సలుపు, వేడివల్లగాని, శీతలోపచారాల వల్లగాని ఆపోటు తగ్గదు. సాధారణంగా తేమ ప్రదేశాలలో నుండుటచే కాళ్ళు తడిసి పళ్లపోటు వస్తుంది. ఇగుళ్ళు ఉబ్బి, వాచి పంటి కుదుళ్ళయందు పుళ్ళు పడును. పళ్ళు పీకునపుడు ముక్క విరిగి మిగిలిపోవుటచే వచ్చు బాధలకు దివ్యౌషధము. శేషించిన పంటి భాగమును పైకి వచ్చివేయుటకు 'సిలికా' 1000 పొటెన్సీలోయిచ్చిన 4 లేక 5 రోజులలో ఆముక్క సహజముగా తప్పక వచ్చివేయును. ఇది నా స్వీయానుభవము. నా అనుభవములో ఇట్లు నివారింపబడిన విషయము నొకదానిని పాఠకుల మనస్సుకు పట్టుటకు యీ క్రింద నుదహరించు చున్నాను.

60 సం॥ల వయస్సుగల పింఛను తీసికొనిన తహసిల్దారుగారు పళ్ళపోటును, సలుపును భరించలేక వైద్యునిచే ఆపన్ను తీయించుచుండగా అది సగములో విరిగిపోయినది. మరునాటికి దవడంతా వాచి

భరించరాని ఆటు, పోటు. దానికి పెన్సిలిన్ యింజక్షన్లు, యింకా ఎన్నో యితరమందులూ యిచ్చినాగాని బాధ తగ్గలేదు. ఎక్సురే తీసి శస్త్రచికిత్స చెయ్యాలన్నారు వైద్యులు. కాని ఆయన మధుమేహ రోగి అవటంచే శస్త్ర చికిత్స అంటే భయం. నాకు కబురుపంపగా వెళ్ళి 1000 పొటెన్సీలో 'సిలికా' ఒక్క మోతాదును ఇవ్వగా ఆ రాత్రికే ఒళ్ళు తెలియని నిద్రపట్టి తెల్లవారేసరికి ఏరు పాటారినట్లు వాపు, ధనారింపు తగ్గి సరిగా అయిదవరోజున మిగిలిన పంటిముక్క సహజముగా పైట పడిపోయినది. 'సిలికా', సిథిలమైన ఎముకముక్కలను వెలుపరించుటకు ఉపయోగించు చక్కని ఉదాహరణ.

పళ్ళపై పింగాణీవలె మెరుపుగల పదార్థము సిథిలమగుటను నివారించును.

నాలుకవాచి పెదవిపై నోరంతయు ఆక్రమించి ఆటు, పోటుగా నుండి రాత్రి కాలములో ఉద్రేకించి వేడిచే ఉపశమించు పరిస్థితిలో 'సిలికా' వాడాలి.

గొంతుక, మెడలోని గ్రంథులు వాచి బాధగానున్నచో 'సిలికా' దివ్యమగు మందు. గొంతుగలోని టాన్సిల్సు వాచి చీము పట్టినప్పుడు యిది పనిచేయును. చీమును పోగొట్టి, వాపును, బాధను తగ్గించిన తరువాత 'కాల్కేరియా సల్ఫ్' ను యిచ్చిన పుండును పోనాడ్చును.

14. "సిలికా" రోగిగల ఇతరలక్షణములేమి ?

వెచ్చని ఆహారమున్నచో అహితవు; చల్లని ఆహారపానీయముల నభిలషించును. చల్లని ఐయిస్‌క్రీము, మంచునీళ్ళు తరచు సేవించాలనే వాంఛ. సిలికా రోగికి చాలా ఉపశాంతి కలుగుతోంది. వేడి పదార్థ

ములు తినినచో ముఖమునకు, తలకు, విపరీతమగు చెమటలు పట్టును. సిలికారోగికి పాలు పడవు. (సెపియా) మలబద్ధము. కొంతవరకు మలము బైటకువచ్చి మరల లోనికి పోవును.

15. స్త్రీలకువచ్చు ఏవ్యాధులకు "సిలికా" వాడాలి ?

శరీరమంతయు చల్లగానుండును పాదములకు వాసనవేయు చెమటపట్టుటతో కూడి సంభవించు అన్నివిధములగు ఋతు దోషము లను నివారించును. మలబద్ధము. ఒరుసు. మంట కలుగజేయు పాలవంటి కుసుమ, కుసుమ స్రవిస్తున్నప్పుడు నాభిదగ్గర కోయుచున్నట్లు పోట్లు

స్తనాలలో రాళ్ళవంటి గట్టి కురుపులు కట్టుటను తగ్గించును. రొమ్ములలో కురుపుపుట్టే సూచన కనుపించినప్పుడు వాడాలి. చన్ని ళ్ళలో తిరుగుటచే పైకి లాగబడిపోవును. పగులును. చీముపట్టకుండా నివారించును.

16. శ్వాసకోశములకువచ్చు ఏయేలక్షణాలకు "సిలికా" వాడాలి ?

న్యుమోనియాలో కళ్ళె తెగిపడు అవస్థలో పనిచేయును. క్షయ వ్యాధిలో రాత్రిళ్ళు చెమటలు పట్టుటకు, విషజ్వరము వచ్చుటకు పనిచేయును. రాళ్ళుకొట్టుటే వృత్తిగాకలవారికి వచ్చు ఊపిరితిత్తుల వ్యాధులకు దివ్యమగు మందు. పగటివేళ మాత్రము ఆకుపచ్చని దుర్వాసనగల కళ్ళె విస్తారంగా పడును. కొంప పట్టి ఉబ్బసపు దగ్గు అం కురించినవారికి యీ మందును వాడాలి.

17. కాకిచిప్పల (Epilepsy) లో 'సిలికా' తగ్గించే లక్షణాలేవి ?

బహుళపక్షపురాత్రి సమయములోవచ్చే కాకిచిప్పలకు. అది వచ్చు సూచన గుండెలదిగువన ప్రారంభమై గొంతుగలోనికివచ్చును. ముఖ్యముగా అమావాస్యనాటిరాత్రి ఉద్రేకముగానుండును.

18. [illegible] లక్షణములను 'సిలికా' నివారింపగలదు ?

వెన్నెముకయొక్క పై భాగము నొప్పిగానుండును. పాదములందు మొలకలు. కాలివ్రేలిగోళ్ళు లోనికి ముడుచుకొని గొర్రెగా నుండును. ఉరికాళ్ళు సుస్థితముగానుండి నడువలేరు. నిద్రపోయిన వెంటనే చమటలు పట్టును.

19. "సిలికా"కుగల ఉద్రేక ఉపశమనములేమి ?

చలిగాలిచేతను, తేమలోనుండుటచేతను, వ్యాధిలక్షణములు ఉద్రేకించును. వేడిచేతను, ఉష్ణమువల్లను ఉపశమించును.

## 128. స్పైజీలియా (Spigelia)

1. "స్పైజీలియా" యొక్క సాధారణ ప్రయోజనమేమి ?

కన్ను, గుండె – వీటి చలనమునకు సంబంధించిన కండరముల పైనను, అందలి నరములపైనను దీనికి ప్రత్యేకప్రభావముకలదు. వీటికి సంబంధించిన వాతనొప్పులకు పనిచేయును. ప్రత్యేకంగా రక్తలోపంవల్ల కలిగే నీరస నిస్సత్తువులచే బాధపడేవారియందు ఉపకరిస్తుంది. మహావాతతత్వంకలవారికి, క్రిములచే బాధపడేబిడ్డలకు ఉపకరిస్తుంది.

2. "స్పైజీలియా" యొక్క మానసికలక్షణములేమి ?

మందమతి, జ్ఞాపకశక్తిలోపించుట. ఏపనిచేయుటకు యిష్టముండదు. ఆరాటం, గాబరా, భావినిగూర్చినబెంగ, విచారం, దిగులు,

ఆత్మహత్యాభావము. వాడియగు కొనలుగల మేకులు, సూదులు అంటే భయము. చిరచిరలాడుటచే నొచ్చనిమాటచెప్పినా కోపం.

3. "స్పైజీలియా"కుగల సాధారణ లక్షణములేమి :

ఇది హృద్రోగముపై పనిచేసే ప్రధానమందులలో ఒకటి. గుండెదడ. గుండె ఉధృతంగా కొడుతుంది; దానితో ఛాతీఅంతయు అదిరిపోతుంది. గుండె కొట్టుకునేధ్వని రోగికేకాక దగ్గరనున్నవారికి కూడ వినుపిస్తుంది. విపరీతముగ యీలాటిగుండెదడకేకాకుండా గుండెకాయలోని వాల్వులు (Valves) చెడినప్పుడుకూడ పనిచేస్తుంది. కదిలినా, మెదిలినా గుండెదడ ప్రకోపిస్తుంది.

తలనొప్పి : తల వెనుకభాగంలో ప్రారంభించి ఎడమకంటిపైకి కేంద్రీకరిస్తుంది. తలనొప్పి హెచ్చడం, తగ్గడం సూర్యగమనానికి సంబంధించి ఉంటుంది. నొప్పిగలవైపు కంటినుండి నీళ్ళుకారుతాయి. పడిశంపట్టి, పండి, గొంతుగలో కఫంచేరితే మింగేస్తాడు. మెల్లచూపు. కళ్ళపోటు; ఈపోటు అన్నివెంపులకు పాకుతుంది. కళ్ళుఅదురుతాయి. కుడితట్టునేగాని రోగి పరుండలేడు; నడుముక్రింద ఏదైనా ఎత్తుపెట్టుకోవాలి. సిరస్సు ఎత్తుమీదఉంటేనేగాని రోగికి స్వస్థతఉండదు. కణతలు ఒణుకుతాయి, అదురుతాయి, బొడ్డుచుట్టునా పోట్లుపొడుస్తాయి (డన్‌హామ్). పిల్లలు క్రిములతో బాధపడేటప్పుడు పనిచేస్తుంది. క్రిమివాతం; ఆసనం దురద, ఉలారం.

నత్తి — మాట్లాడే ప్రారంభంలో అక్షరం మూడు నాలుగు పర్యాయములు ఉచ్ఛరిస్తేనేగాని మాట తెమిలిఊడిరాదు. చలి ఛాతిలో ప్రారంభించడం దీనికోలక్షణం. విస్తారం జొగచుట్టలను కాల్చడంచే వచ్చేపండ్లపోటును నివారిస్తుంది. లక్షణాలన్నీ కదలినా, ఏ

మాత్రం గాడపగాడున్నా, తేసుగాడున్నా, కళ్లుకదిపినా, తీపితిన్నా, అర్థరాత్రికి ముందుభాగంలోను. చల్లనిపానీయాలచేత హెచ్చుతాయి. కుడితట్టు పడున్నా. తలను ఎత్తుగానుంచినను (ఆస్స, కాల్కేరియా, స్పాంజియా) ఉష్ణపదార్థాలచేతను, ఎత్తునుండి కిందకు దిగేటప్పుడూ బాధలన్నియూ ఉపశమిస్తాయి.

4. ఏలాటి తలనొప్పికి "స్పిజీలియా" వాడాలి ?

పార్శ్వపునొప్పి ; ఇది ముచికలకుంటలో ప్రారంభించి ముందుకు పాకి ఎడమకన్నుపై కేంద్రీకరిస్తుంది. (కుడి : సాంగునేరియా, సిలికా) కదిలినా, ఏమాత్రం శబ్దమైనా తలనొప్పి హెచ్చుతుంది. సూర్యగమనంతో హెచ్చి క్రమంగా సూర్యుడు పడమటకు దిగుతుంటే తగ్గుతుంది (నేట్రముమూర్; బెబే). ఏపార్శ్వంలో తలనొప్పో ఆవైపు కంటినుండి నీరుకారుతుంది. అధోముఖంగాచూస్తే కళ్లుతిరుగుతాయి. (ఊర్ధ్వముఖంగాచూస్తే కళ్ళుతిరగడం – పల్సు).

5. ఏలాటి కంటిపోట్లకు "స్పిజీలియా" వాడాలి ?

కంటినరాలలో శూలంతో పొడుస్తున్నట్లు పోటు. ఈపోటు కంట్లోనుంచి వెనుకతట్టుకు పొడుస్తున్నట్లుంటుంది. కనుగుడ్డు బైటకు పడిపోతున్నట్లూ, కనుగుడ్డు అదివుండేసందుకంటె పెద్దదైపోయినట్లుంటుంది భావన. కళ్ళు చల్లగావున్నట్లనుపిస్తుంది (తూజా).

6. ముఖంలోపోట్లు లక్షణంగాగల మందులేవి ? వాటిలక్షణాలేమి ?

స్పిజీలియా, కొల్చికం, ఆస్స, ప్లేటినం, కెమోమిల్లా, కేప్సికం, వెర్బేసికం.

"స్పిజీలియా" : విపరీతంగా పోట్లు, మంట, వాపు, తీపు; ముఖ్యంగా ఎడమపార్శ్వం.

"కాల్మికం": వుపద్రవమగు బాధ. పాక్షికవాతమూ అనుసరిస్తుంది.

"ఆరమ్": ఎఱ్ఱగా కంది వేడిగా వుంటుంది. పోటు ఒక చెంప నుండి వేరొక చెంపకు పోతున్నట్లుంటుంది. భయం, ఆరాటం, మరణభీతి.

"ప్లాటినం": క్రమంగా నొక్కివేసినట్లు బాధ, తిమ్మిరి, వ్యాధి గలచోట నొక్కి వ్రేలాడి. అమితగర్వం.

కేప్సికం: బార్లలా తీర్చినట్లుండి నొప్పి, మంట. పైన నొక్కితే భరించలేడు. ఊబకాయులు.

కెమోమిల్లా: ఒక చెవినుగు; పోట్లు వేడివలన హెచ్చుతాయి. భరించలేని బాధ, కోపం.

7. హృదయవ్యాధులలో స్పైజీలియా లక్షణములేమి?

ఛాతీయొక్క ఎడమభాగంలో సున్నితమగు సూదిపోట్లు. అవి మెడలోనికి, చేతిలోనికి వ్యాపిస్తాయి, కదిలితే ప్రకోపిస్తాయి. నాడి దెబ్బకు, గుండెదెబ్బకు సమన్వయముండదు. ఛాతీపై చేయివేసి నిదానించిన సున్నితముగా తట్టినట్లు స్ఫురించును. గుండెపై పొరవాచి నొప్పిగానున్నప్పుడు దివ్యమగుమందు. గుండెయొక్క వక్రిగమనమునకు పనిచేయును. అన్నివిధములగు గుండెనొప్పులకు నిరుపమానముగా పనిచేయును.

ఆయాసము, ఊపిరాడక వుక్కిరిబిక్కిరగుదురు. ముఖ్యంగా నడచినా, కదలినా, భుజములు-చేతులు పైకిఎత్తినా వుద్రేకించును. కుడితట్టునమాత్రమే పడుకోగలుగుతారు. ముందుకు ఏమాత్రం వంగినా కెరటంకొట్టినట్లు గుండెకొట్టును. అమితమగు గుండెదడ. మనిషి అదిరిపోయేటట్లుంటుంది గుండెదడ. గుండె కొట్టుకునేచప్పుడు రోగికే

కాకుండా పైవారికికూడా వినుపిస్తుంది. ఇల్లాటి పెక్కువిధములగు గుండెవ్యాధులకిది నిరుపమానమగు ఔషధము.

8. క్రిములకు "స్పైజీలియా" సూచకలక్షణములేమి ?

కళ్ళు అదురును. ముఖం పాలిపోయి తెల్లగా అదురుతుంది. కళ్ళచుట్టునా నీలిఛాయ వలయము లేర్పడును. బొడ్డుదగ్గర పోట్లు, వికారం. ఒకప్పుడు కోప వచ్చినట్లుంటుంది. ఆసనములో నురద, ఉలాకం పాకుచున్నట్లు భావం.

## 129. స్పాంజియా టోస్టా (Spongia Tosta)

1. "స్పాంజియా" ఏ ప్రధాన కేంద్రాలపై పనిచేస్తుంది ?

'స్పాంజియా' ప్రధానంగా గ్రంథులపైనను, అమత్వచలపైనను పనిచేయును. గ్రంథులు వాచుట; అమత్వచలన్నియు ముఖ్యంగా స్వరపేటి, సప్తపథియందలి అమత్వచలు వాచి పచ్చిగా నుండును.

2. మూడు మాటల్లో 'స్పాంజియా' సూచకలక్షణములను వ్రాయుము.

ఆరాటము, భయము, ఆయాసము.

అమిత ఆరాటము; మరణ భీతి, ఆయాసము, గుండెదడ. గుండె నిస్సత్తువ. ఇది గుండెవ్యాధులను నివారించు ముఖ్యమగు మందులలో నొకటి.

3. 'స్పాంజియా' యందలి భయమెట్టిది ?

మరణభీతి, భావినిగూర్చిన భయము, ఆందోళన. ఏదో ప్రళయము సంభవించనున్నదని భయం. రాత్రి నిద్రలో ఉక్కిరిబిక్కిరై

భయంతో కంగారుగా లేస్తారు. కొన్నేసటివరకు ఏమియూకూడ తెలియదు. నిదానంపై పరిసరాలను గుర్తిస్తారు.

4. రాత్రి భయంతో లేచే లక్షణాలుగల అరడజను మందులను పేర్కొనుము.

1. ఆర్సెనిక్, లైకోపోడియం, సెంబుకస్, లెకసిస్, ఫాస్ఫరస్, కార్బొవెజి - స్పాంజియా.

5. 'స్పాంజియా' అన్నివిధములా "ఎకనైట్"ను పోలియుండును అన్నారు డా. కెంటు. అదెట్లో స్పష్టపరచుము.

'స్పాంజియా' వలెనే 'ఎకనైట్'కు కూడ గుండెపై ప్రాభవము కలదు. గుండెకు ఉద్రేకమును కలిగించును. ఆరాటము, భయము, ఆందోళన, మరణభీతి; యీలాటి లక్షణాలన్నీ విపరీతంగా 'ఎకనైటు'కు కూడ ఉన్నాయి. కాని దీనికి విపరీతమగు జ్వరం ఉండటం అన్ని మందులనుంచి ప్రత్యేకిస్తుంది. 'స్పాంజియా' లో జ్వరం చెప్పుకోతగినంత ఉండదు; ఉన్నా స్వల్పం. "స్పాంజియా" ఎకనైటు కంటె అంతర్గతమునకుపోయి పనిచేయు మందు. ఒకప్పుడు అవయవాలలోకూడ మార్పు తేగలిగినంత లోతుగా పోతుంది. 'ఎకనైట్' లక్షణాలు తుఫానులావచ్చి నిలకడగా వుండక వెంటనే తగ్గిపోతాయి. తరుణముగా మాత్రమే పనిచేయును.

ఈ రెండున్నూ కింక వాయువు (Croup)లో ఒకేవిధంగా సూచిస్తాయి. కాని స్పాంజియాలో 'క్రూపు' చాల లోతుగాను, క్రమంగాను అంకురించి కొన్నిరోజులకుగాని దాని భీకరస్వరూపము వెల్లడిగాదు. 'ఎకనైట్'లో బిడ్డకు ఈ వేళ సీతగాలి సోకితే రాత్రి పడుకోవడం తడవుగా ఒళ్ళు తెలియకుండాపోయి చేతుల్లో వుండక, విపరీతంగా

'కింకవాయువు' వచ్చేస్తుంది. చాల భయానకంగా ఉంటుంది. ఒక్క ముక్కలో చెప్పాలంటే 'ఎకనైట్' తాటాకు మంటలా అంతలోనే విపరీతంగావచ్చి మళ్ళా కొద్దిసేపటిలోనే అణిగిపోతుంది. 'ఎకనైట్' వాడకంతో కింకవాయువు సంపూర్ణంగా పోకపోతే "స్పాంజియా" నివారిస్తుంది. ఈలా రెంటియందు లక్షణాలు చాలవరకు పోలి వుంటాయి.

6. గ్రంథులన్నిటి పట్లున్నప్పుడు 'స్పాంజియా' వాడాలి ?

'స్పాంజియా'లో గ్రంథులు అన్ని బాధలకు కేంద్రమవుతాయి. అని క్రమంగా వాచి గట్టిగా రాళ్ళలా అవుతాయి. గుండె, థైరాయిడ్, వృషణాలు మొదలగు ప్రధానగ్రంథులేగాక అన్నిగ్రంథులూ కూడ చెడుతాయి. గుండెజబ్బులలో కండ్లు ముందుకు పొటకరించుకొని గవదలు వాస్తాయి. వృషణాలు వాస్తాయి. శగ జీర్ణించడంచే 'ఆర్కయిటిస్' అనే బీజ్జాలవాపు సంభవిస్తుంది. సీత గాలిచే చాల భాగం గ్రంథులువాచి గట్టిగా రాళ్ళలా వున్నప్పుడు 'స్పాంజియా' నుస్తుండాలి.

7. కింకవాయువులో ప్రధానంగా పనిచేసే నాలుగు మందులను పేర్కొనుము అవి వాడదగు వ్యాధిక్రమమును వివరింపుము.

1. ఎకనైట్ 2. స్పాంజియా 3. హీపార్ సల్ఫ 4. ఫాస్ఫరస్.

"కింకవాయువు"లో ప్రథమంగా ఆలోచించవలసినది 'ఎకనైట్' విశిష్టత. సీతగాలిపోకః రాత్రియే గురక, ఆయాసం దగ్గు మొదలగు కింకవాయువు లక్షణములందు విపరీతమగు జ్వరం, త్రుళ్ళిపాటు, భయం ఉన్నచో "ఎకనైట్"కు మించిన మందే లేదు. ఎకనైట్" 30 శక్తి 200 పొటెన్సీలో రెండింటికి మోతాదులు యిచ్చిన యితర

మందులతో నిమిత్తము లేకయే చాలవరకు నివారణగును. ఏకారణం చేతనైనను వ్యాధి తగ్గక ఘనీభవించి తరచు దగ్గు, ఊపిరాడకుండుట, నిద్రనుండి లేచిన ప్రకోపించుచున్నచో వెంటనే "స్పాంజియా" వాడాలి. దగ్గునప్పుడు రంపపు కోతలాటి ధ్వనియగుట 'స్పాంజియా'కు గుర్తింపు లక్షణము. 'స్పాంజియా' 200 పొటెన్సీని ఒక 1/2 కప్పు నీటిలో 5 లేక 6 చుక్కలు పోసి ప్రతి 15 నిముషములకు దగ్గు వడి తగ్గేటంత వరకు ఇచ్చుచుండవలెను. తరువాత దగ్గువచ్చు వేళను యితర లక్షణములను గమనించి మందు యిచ్చు వ్యవధిని హెచ్చింపవలెను. "కూప్రం" పలుచబడినను యింకనూ దాని లక్షణములున్నచో 'హీపార్-సల్ఫ'ను వాడవలెను. 'హీపార్' అర్ధరాత్రి దాటినవెనుకను, ప్రాతః కాలమునను హెచ్చుగానుండును. వీనితో వ్యాధి పూర్తిగా నివారణ కాగలదు. కాని ఇంకనూ ప్రతి సాయంకాలము దాని లక్షణములు కనుపించుచున్నచో 'ఫోస్ఫరస్' యిచ్చిన నిశ్శేషముగా నివారణయగును. ఈ వ్యాధి సోకినవెంటనే చికిత్సను ప్రారంభించవలెను.

8. హృద్రోగములలో "స్పాంజియా" వాడనగు సమయమేది ?

హృద్రోగములలో యీ మందుయొక్క సూచకలక్షణము లున్నచో ఎట్టి భీకరవ్యాధి అయినను సులువుగా నివారణయగును. హృద్రోగములకు "స్పాంజియా" నిరుపమానమైనది. గుండెయందలి ద్వారములు (Valves) వాల్వులు చెడుటవల్ల వచ్చు హృదయరోగములను 'స్పాంజియా' నివారిస్తుంది. ఊపిరాడక ఉక్కిరిబిక్కిరై నిద్ర నుండి వులిక్కిపడి కంగారుగా లేస్తాడు, ఊపిరందక బాధపడుతాడు. ఆరాటం, ఆదుర్దా, తిందోళన. అశాంతి. పిటకతోడు ఉక్కిరిబిక్కిరి చేసే దగ్గు. రోగిని పడుకోనివ్వదు వ్యాధి. పడుకుంటే తలను చాల

ఎక్కువగావుంచి పడుకోవాలి 'స్పాంజియా' రోగి. మరో చిత్రమేమిటంటే ప్రసరించే లేదా వ్యాధిలక్షణాలు పెరుగుతాయి. (ఆకాసిస్) హృద్రోగాలలో వచ్చే దగ్గుకు దివ్యమైన మందు 'స్పాంజియా'. 'నాజా' కంటె కూడ శాశ్వతముగా నివారిస్తుంది.

9. గాయిటర్లో 'స్పాంజియా' వాడదగు లక్షణములేవి ?

థైరాయిడు గ్రంధి మిక్కిలి పెద్దదై గట్టిగా గడ్డమునకు క్రింద కాలిపోవును. ఒకప్పుడు ఆ గ్రంధి శ్వాసగొట్టమును నొక్కుటచే రోగి ఊపిరాడక ఉక్కిరిబిక్కిరి యగును. కొందరికి చంద్రగతి ననుసరించి గ్రంధియొక్క వృద్ధిక్షయములు జరుగును. "స్పాంజియా" యైనను లేక మరి యే యితర మందైనను యీ వ్యాధికి వాడవలసి వచ్చినప్పుడు బహుళపక్షములో అనగా పూర్ణిమ వెళ్ళిన మొదటి రోజులలో ప్రారంభించుట మంచిది. "గయటీర్" వ్యాధి చికిత్సను బహుళ పక్షంలో చేయడం మంచిది.

10. వృషణములవాపుకు "స్పాంజియా" వాడవలసిన లక్షణాలేవి ?

వృషణములు వాచి పెద్దవై గట్టిగా ఉంటాయి. ఇరు ప్రక్కలనూ వుండే వీర్యనాళాలు ఉబ్బి భరించరాని బాధపెడుతాయి; గట్టిగా పిసుకుతున్నట్లూ, గట్టిగా మెలిపెట్టి తిప్పుతున్నట్లు ఉండడం బాధయొక్క స్వాభావికం. కదలినా, మెదలినా క్రిందకు బట్ట తగిలినా భరించలేని బాధ. ఒకప్పుడు తగిలిన శగవ్యాధి జీర్ణించి యీలా బాధ వుంటే దాన్ని ఆర్కయిటిస్ అంటారు. ఆవ్యాధికి యిది వాడవలసిన మందు.

11. స్వరపేటి (గొంతుక) నొప్పికి "స్పాంజియా" వాడదగు లక్షణా లేవి ?

కొందరిలో పొడి సీతగాలిలో తిరుగుటచే స్వరపేటి వాచి బొంగురుపోతుంది. ఒకప్పుడు మాట రావడంకూడా కష్టంగావుంటుంది. గొంతు చాల తీపుగాను, పచ్చిగాను వుంటుంది. గొంతుగ బొంగురుపోయి 'కూప్రు'లాటి దగ్గు. గొంతుగ పొడిఆరి బిగుసుకొని బాధగా వుంటుంది. మాట్లాడ్డం కష్టమై మాట బొంగురుగా వుండి ఒకప్పుడు చాల హీనస్వరంలోనికి దిగుతుంది. స్వరపేటి మంట. స్వరపేటి సంబంధమగు క్షయవ్యాధి. తీపి పదార్థములు తినుటచే గొంతు నొప్పి ఎక్కువవుతుంది.

12. "స్పాంజియా"కుగల దగ్గులక్షణములేవి ?

పొడిదగ్గు బొంగురుగా కుక్క మొరిగినట్లుంటుంది. ముఖ్యంగా రంపం కోతవంటి ధ్వనిగల దగ్గు రావడం 'స్పాంజియా'కు సూచక లక్షణం.

ఇందు దగ్గు సాయంసమయాన్ని, అర్ధరాత్రికి ముందు, మాట్లాడినా, నవ్వినా, పడుకున్నా, వేడిగానున్న గదిలో వున్నా హెచ్చుతుంది.

వెచ్చని పదార్థములు తిన్నా, లేక త్రాగినా దగ్గు వుపశమిస్తుంది. ఆయాసం తగ్గడానికి రోగి వంగి కూర్చుంటాడు. ఎడమ ఊపిరితిత్తి యొక్క పైభాగం దీని వ్యాధి కేంద్రం.

హృద్రోగ సంబంధమగు దగ్గునకు దివ్యమగు మందులలో ఒకటి. రోగి నిద్రనుండి ఉలికిపడి కంగారుగా లేస్తాడు; ఆతృతగాను ఆందోళనగాను వుంటాడు. ఇలాటి స్థితులను అద్భుతంగా నివారిస్తుంది 'స్పాంజియా'. ఇట్టి దీర్ఘవ్యాధులలో కూడ ఇది పనిచేస్తుంది. (1000 పోటెన్సీలో ఇవ్వాలి – నేష్).

18. "స్పాంజియా" యొక్క సహజసాధారణలక్షణములేమి ?

ఇది ఊపిరిగొట్టంపైన, గుండె వ్యాధులలోను. గ్రంధుల సంబంధమైన వ్యాధులలోను ప్రధానంగా పనిచేస్తుంది.

కింకవాయువు సంబంధమగు దగ్గులలో, దగ్గు రంపం కోతవంటి ధ్వనితో వుంటే వాడే దివ్యమగు మందు. ముఖ్యంగా నిద్రనుండి బాధతోను, దగ్గుతోను లేస్తారు. తీపివస్తువులు తినుటచే గొంతుగ నొప్పి, గొంతు బొంగురు; తరచు గొంతు ఖాండ్రించాలి. గయిటీర్: థైరాయిడ్ గ్రంథి గెడ్డంవరకు వస్తుంది ముందుకు. పొడిదగ్గు, గొంతుగ ఆరి బిరబిగుసుగున్నట్లుంటుంది.

గుండెల్లో నొప్పి; గుండె వాల్వ్యులు చెడి వచ్చే గుండెజబ్బులకు నిరుపమానమగు మందు.

వృషణములు వాటికి యిరుప్రక్కలనూ ఉన్న వీర్యనాళికలు వాచి బాధగా వుంటాయి. కదిలినా, బట్ట తగిలినా బాధ. గనేరియా జీర్ణించడంచే కలిగే "ఆర్క్-యిటిస్" అనే వృషణాల వాపులకు దివ్యమగు మందు.

నాభికి క్రిందిభాగం యావత్తూ తిమ్మిరగానుండి, అవయవాలు బిగుసునుపోతాయి.

గ్రంధులు వాచి దురద. కంటినుండి జిగటగానుండు నీరు దానితో చూపు మందగిస్తుంది. (లిప్పీ).

నెలసరి దిసించి అయి విస్తారంగా అవుతుంది. తరచు ఆపుకోలేని మూత్రానుమానం. సిరస్సుకు రక్తధాటి.

తలక్రింద ఎత్తు తక్కువైనా, నిద్రపోయినా వ్యాధి లక్షణాలు ప్రకోపించడం ఈ 'స్పాంజియా'కు గుర్తింపు లక్షణం.

## 130. స్టేన్నం మెటాలికం (Stannum Metallicum)

1. "స్టేన్నం మెటాలికం" యొక్క నిరూపణ విషయము ఎందు కలదు ?

హానిమన్ మహాశయులు రచించిన ఆది గ్రంధమగు హానిమన్ వస్తుగుణదీపిక యందును, వారి కాలిక వ్యాధుల గ్రంథమందునను క్రిధముగా దీని విషయములు వివరింపబడినవి.

2. "స్టేన్నం" యొక్క సాధారణ నైసర్గికమేమి ?

"ఛాతీలో అమిత నీరసం" పొట్టలో శూన్యభావం; యీ రెండున్నూ ప్రిధాన సూచకలక్షణములు. అపరమితంగా నీరసాన్ని, నిస్త్రాణను కలిగిస్తుంది. నరాల దుర్బలత్వంచే నీరసం, నరాల బాధ. అన్ని విధాలా నీరసాన్ని. నిస్సత్తువను కలుగజేయడం "స్టేన్నం" కు నైజము.

3. "స్టేన్నం-మెటాలికం" కలుగజేసే సాధారణ స్వాభావికలక్షణాలేవి ?

ఛాతీలో నీరసం ఇందలి ప్రిధానలక్షణం. మాట్లాడలేనంత నీరసం. కాళ్ళు చేతులు నిస్సత్తువగా వుంటాయి. అమిత నిస్త్రాణచే రోగి కుర్చీలో కూలబడుతాడు. నీరసంచే నిలువునా కూర్చోలేడు. క్రిందికి మెట్లు దిగేటప్పుడు ఆయాసం. అవరోహణకష్టంగా ఉంటుంది. (మెట్లు ఎక్కడం కష్టం – 'బొరేక్సు, కాల్కేరియా') మానసికంగాను శారీరకంగానుఅ మితమగు నీరసం, నిస్సత్తువ. దీనికి నొప్పులు క్రిమంగా హెచ్చి క్రిమంగా తగ్గుతాయి. వ్రాస్తొంటే చెయ్యి వణుకుతుంది. ఆడవాళ్ళు చీపుక పట్టుకొని ఊడ్చలేరు. (కెంటు).

'స్టానం' రోగి నీరసన, విచారంతో ఉండి ఏడ్చే స్వభావం కలవాడుగా వుంటాడు. స్థిమితంగా వుంటే వ్యాధి హెచ్చుతుంది. కదిలితే ఉపశాంతిగా వుంటుందిగాని నిస్సత్తువచే బాధపడుతాడు. (లిప్పి) విడుపులేకుండా సర్వదా బిగించే దగ్గు. శూల – దీనితో ఆకలిగా వుండే భావం. ఉదరంలో నెట్టినా, శూన్యంగా వున్నట్లనిపిస్తుంది. శూల – గట్టిగా అదమిపట్టినా, పొట్టపై ఆనుకు పడుకున్నా తగ్గుతుంది. మలంతో క్రిములు పడుతాయి. నెలసరి కుదించినట్టు మైల అమితముగా అవుతుంది.

తనువు నీరసం. నిస్త్రాణ కలిగిస్తుంది.

దగ్గు గుల్లగా శబ్దంతో లోపలనుంచి వస్తున్నట్లుంటుంది. దగ్గు తెరలు తెరలుగా వస్తుంది. శ్లేష్మం విస్తారంగా పడుతుంది. శ్లేష్మం తియ్యగాగాని. ఉప్పగాగాని ఉంటుంది; ముద్దగా పసుపు, ఆకుపచ్చ మిశ్రమ వర్ణంలో వుంటుంది; ఒక్కొక్కప్పుడు పగటిపూట మాత్రం పుల్లగా వుంటుంది ఖఫం. గొంతుక బొంగురుగా వుండి దగ్గినకొద్దీ తగ్గుతుంది. తెల్లవారుగట్ల నాలుగు గంటలకునుదుటిపైన, మెడమీద చమట్లు పట్టి రోగి నీరసిస్తాడు.

కుడితట్టు పడుకున్నా, దగ్గినా, నవ్వినా, వేడిపానీయాలను సేవించినా వ్యాధిలక్షణాలు తగ్గుతాయి.

అరికాళ్ళు, అరిచేతులు మంటలు (లెకెసిస్, సల్ఫర్, సేంగ్వినేరియా)

నాలుకపై పచ్చనిపాచి, ఆగోవని ఆకలి; ఎంతతిన్నా తృప్తి వుండదు; వంటవాసనకిట్టదు. వంటయింటి వాసనకు వాంతులవుతాయి. (కోల్చికం). ఆంబవికోచినాలు.

ఉదయం 10 గంటలకు చలిజ్వరం. క్షయసంబంధమగు హెక్టిక్ జ్వరం. ఆజ్వరంలో వేళ్ళకొనలు తిమ్మిరెక్కుతాయి.

4. దగ్గువ్యాధిలో 'స్టేన్నం'ను గుర్తింపులక్షణములేమి ?

ఇందు దగ్గుసాధారణంగా కఫంతోకూడివుంటుంది. శ్లేష్మం తియ్యగానో, ఉప్పగానో వుంటుంది (కాలీ-హైడ్రోయిడేటం, సెపియా). ముదురుపసుపు, ఆకురంగు లేక రెండున్నూ మిశ్రమరంగుగా గాని ఉంటుందిరంగు.

పాడినా, నవ్వినా, కుడివెంపుతిరిగినా దగ్గు హెచ్చుతుంది. ఛాతీ యొక్క ముందుఎముకలలో వెలితిగానున్నట్లుభావం. మొత్తం ఛాతీ అంతా నీర్సంగాను బలహీనంగాను వుంటుంది. తెల్లవారగట్ల మెడకు విస్తారం చమటలుపోస్తాయి. క్షయవ్యాధిలో 'స్టేనం' వాడ్డం అపాయకరంకాదు. నివారణచేయలేకపోయినా తశ్శాంతి కలిగిస్తుంది స్టేనం.

5. ఛాతీలో నీరసం కలుగజేసేమందులు వాటిలక్షణాలు వ్రాయుము.

కార్బోవెజ్జి, ఫోస్ఫారిక్ ఏసిడ్, స్పాంజియా, సల్ఫర్.

కార్బో-వెజ్ : వుదయం దంతధావనసమయంలో హెచ్చుగా గుండెనీర్సం.

స్పాంజియా : నడిస్తే గుండెలోనీరసం.

ఫోస్ఫారిక్-ఏసిడ్ : ముష్టిమైథునంవల్లనూ, విస్తారంగా ఎదిగిపోయే యువకులకున్నూ సంభవించు గుండెనీరసముతగ్గుతుంది.

సల్ఫర్ : ఉదయం అతిసారవిరోచినాలు; విస్తారం చర్మవ్యాధులు; వున్నవారికిగల గుండెనీర్సానికి పనిచేస్తుంది.

6. 'స్టేన్నం'యొక్క తలనొప్పి స్వభావమేమి ?

సూర్యగతిననుసరించిన తలనొప్పి; సూర్యోదయంతో ప్రారంభించి మధ్యాహ్నంవరకు క్రమముగాహెచ్చి ప్రొద్దువాలినకొద్దీ

తగ్గుతూ సూర్యాస్తమయంతో పోతుంది. ఒకప్పుడు తలనొప్పి ప్రొద్దుట 10 గంటలకు ప్రారంభించి 20 నిమిషములలో హెచ్చి క్రిమంగా తగ్గి పోతుంది. నొప్పి నుదురుపైన యెడమకన్ను పై భాగంలోను వుంటుంది.

7. సూర్యగతిని అనుసరించిన తలనొప్పి గల కొన్ని మందులను చెప్పుము.

కాల్మియా : క్రిమంగా హెచ్చుతగ్గులు వుండవుగాని మిట్ట మధ్యాహ్నంమాత్రం తలనొప్పి హెచ్చుగా వుంటుంది.

కేక్టస్ : బిగలాగినట్లు తలనొప్పి. సూర్యగతిని అనుసరించి వుంటుంది.

నేట్రం-మూర్ : ఇది తలనొప్పిని సూర్యగతిననుసరించి రాక పోయినా సూర్యగతిని అనుసరించివచ్చే తలనొప్పిని తగ్గిస్తుంది.

సేంగ్వునేరియా : సూర్యగతిని అనుసరించి వుంటుందికాని, ఇది కుడిపార్శ్వమున వుంటుంది.

8. కాకిచిమ్మలు (Epilepsy)లో "స్టేన్నం"ను ఎప్పుడువాడాలి ?

ప్రేగులలో క్రిములుండుటచేవచ్చు కాకిచిమ్మలకుపనిచేస్తుంది. నోరుతీపి. కడుపులోపోట్లు. ఫిట్టులో బొటనవ్రేళ్ళు అరచేతులలోకి లాక్కొని బిగబట్టడం—కాకిచిమ్మలలో దీనిసూచకలక్షణం.

9. "ఫాస్పరస్"కు స్టేన్నంకుగల తారతమ్యమేమి ?

రెంటికీ సాయంకాలం గొంతు బొంగురుపోతుంది. ఛాతీలో శిరస్సు, దగ్గు; కళ్ళెపస్తారం పసుపుపచ్చ ... ... యబాపశుజ్వరంకూడ అంచ రిస్తుంది; కాని ఫాస్పరస్కు కళ్ళెలో రక్తపుచార, ఛాతీబిగబట్టినట్టుండడం, ఎడమతట్టుపడుకోలేకపోవడం, చల్లని పంచువంటినీరు త్రాగాలని వుండడం అదనంలక్షణాలు.

10. స్త్రీలకు ఏ వ్యాధులకు స్టేన్నం అవసరము?

నిస్సత్తువచే గర్భాశయం జారటం, అతినిస్త్రాణతో కూడివుండే కుసుమస్రావానికి, నెలసరి దిగించివచ్చి విస్తారంగా స్రావమగుటకు 'స్టేన్నం' పనిచేస్తుంది.

ఈపైలక్షణాలతో కూడి అతినీరసంగాను నిస్సత్తువగానువుంటుంది. హృదయంవ్రాలు చీరకట్టుకోడానికికూడ ప్రాణవుండక అనేక సార్లు కూర్చున్నాకగాని బట్టకట్టు పూర్తి కాదు.

11. క్రిములవ్యాధిలో 'స్టేన్నం' సూచకలక్షణములేమి?

హానిమన్‌గారి సిద్ధాంతంప్రకారము "స్టేన్నం" ప్రేగులలోని క్రిములకు మత్తునుకలిగిస్తుంది. వెంటనే భేదికిమందిస్తే క్రిములకు స్థానచలనంకలిగి పడిపోతాయి.

## 131. స్టెఫిసాగ్రియా (Staphisagria)

1. స్టెఫిసాగ్రియాకు వాడుకపేరేమి? దీనినెట్లు తయారుచేతురు?

దీని మామూలుపేరు 'లార్క్‌స్పర్'. ఇది దక్షిణయూరప్‌లో దొరకుతుంది. దీని పండిన పండ్లనుండి దీని మాతృద్రావకమును తయారుచేతురు.

2. స్టెఫిసగ్రియా సాధారణముగాచేయు ప్రధానకృషియేమి?

ప్రధానంగా ఇది జననేంద్రియములమీదను, మూత్రకోశము పైనను ప్రోస్టేటుగ్రంథిపైనను, చర్మముపైనను, పళ్ళపైనను పనిచేయు త్రిదోషములు సోరా, సైకోసిస్, సిఫిలిస్‌లను నివారించగల అంతర్గతమునకుపోయి పనిచేయుమందు. కోపము, పరాభవం, నిందలు

వలన కలిగేదుష్ఫలితాలకు వుపయోగిస్తుంది ముఖ్యంగా. అమిత సంభోగము, దుష్టసంభోగమువలన కలిగేవ్యాధులను తగ్గిస్తుంది.

3. స్టెఫిసగ్రియాకు గల ప్రధాన సూచకలక్షణములను వ్రాయుము.

దీనికి మానసికలక్షణములు ముఖ్యమైనవి. మనస్సులో వృష్టి అభిప్రాయము, దాని ఫలితంగా ఉద్భవించేవ్యాధులు. కోప, క్రోధాలు అణచిపెట్టుటచేత, లోలోన ఎంతో కుళ్ళి కృశించుటచేత నిందలు, పరాభవాలు గాఢంగా మనస్సునపట్టుటచేత కలిగేవ్యాధులకు పని చేస్తుంది.

ముష్టిమైథునం: దానివలనకలిగే పరిణామాలు; అమితసంభోగంచేకలిగే బుగ్మతలు దీనితో కుదురుతాయి. నిరంతరం కామోద్రేకంతో వుండి శృంగారగాథలతో కాలక్షేపం చేయడం దీనిలక్షణమే. పిల్లలకు పళ్ళునల్లబడి సిథిలమవుతాయి.

స్త్రీల జననేంద్రియాలు, పళ్ళు, పొట్ట, పురుష జననేంద్రియాలు అతి సున్నితంగా వుంటాయి.

ఇవి దీని ప్రధానసూచకలక్షణాలు.

4. "స్టెఫిసగ్రియా"కుగల మానసికలక్షణములేమి ?

బిడ్డ చాల చీదరగా, కోపంగా వుంటుంది. ఏవో కావాలని మారాముంపెడుతుంది. ఇస్తే విసిరికొట్టేస్తుంది. ఈలాటి బక్కకోపం వుదయంపూట విస్తారంగావుంటుంది. పాలిచేపళ్ళు గొగ్గిలుగాఅయి నల్లబడుతాయి. ఇగుళ్ళువాపు, ఉదరపొట్ట.

ముష్టిమైథునంచే యువకులకు మనస్సుచెడి, వుత్సాహంలేక సిగ్గులుగాను, బెంగగాను వుంటారు. ఈ మరలవాటు జీవితవికాసాన్ని

చేరుస్తుంది. విచారం. సంభ్రమం కేబీతి. ఒంటరిగావుండాలంటాడు. సిగ్గు. ఆడవాళ్ళంటే భిడియపడుతాడు. యువకునకు వుత్సాహం ఆనందం వుండదు.

స్త్రీలుకూడ దురభ్యాసాలకు లోనై పైన వ్రాసిన మానసికతత్వములో వున్నప్పుడు యీమందువాడాలి. సాధారణంగా వేళ్ళతరబడిని భర్తయిల్లువిడచివున్నప్పుడు స్త్రీలకు యీలాటిదుర్గుణాలు కనుపిస్తాయి. కామాన్ని అణచిపెట్టుటచే నరాలు దుర్బలమై అనేకవ్యాధులకు దారి యేర్పడుతుంది. యోనిలో దురద, వులారం. అట్టివారికి స్టైఫిసాగ్రియా కామోద్రేకాన్ని తట్టుకునే మానసికబలాన్ని చేకూరుస్తుంది.

ముఖ్యంగా కోపం, క్రోధం మనస్సులో పెట్టుకొని దానితో కృళ్ళికృసించడానికి తత్ఫలితంగా అంకురించే వివిధవ్యాధులకు దివ్యమగుమందు. "స్టఫిసగ్రియా" పరాభవం, నింద మనస్సున పెట్టుకొని మానసికంగాను శారీరకముగాను అనేకవ్యాధులకు లోనైనప్పుడు స్టఫిసగ్రియా స్ఫురణకురావాలి. విచారం, దిగులు, మనోవ్యాకులత, చిరచిరలు, ఏకాంతంగావుండడం ఈలాటి దుర్గుణాలు కోపం మనస్సులో పెట్టుకొనుటచే అంకురిస్తాయి. 'స్టైఫిసగ్రియా' మూలకారణాన్ని నివారించి మనస్సుకు తగుబలం చేకూరుస్తుంది. ఆలాటివాటిని ధైర్యంతో ఎదుర్కొనగల మానసికశక్తిని యిస్తుంది. ఏమాత్రంమాటకైనా 'స్టైఫిసగ్రియా' రోగి నొచ్చుకుంటాడు.

మానవత్వానికిమూలం మనస్సు. కావున మానసికలక్షణాలే సారూప్యచికిత్సావిధానానికిమూలం. అట్టి అమూల్యమానసికచిత్రాలను చిత్రించేటప్పుడు పాఠకుని మనస్సుకు ఔషధంయొక్క మానసిక లక్షణాలు హత్తుకునేటట్లు చూడాలి గ్రంధకర్త. 'స్టైఫిసగ్రియా' కోపానికి మందని చెప్తూతూ ఆకోపాన్ని విపరీతంగా వర్ణించారు. ముఖ్యంగా

కోపాన్ని బయటపెట్టక అణచిపెట్టుకోడంచే సంభవించే దుష్ఫలితా లకు 'స్టెఫిసగ్రియా' మందని పాఠకులు గుర్తించాలి. సంసారంలో మాటామాటావచ్చి అదే మనస్సులో పెట్టుకొని భార్యాభర్తలమధ్య కలిగే విభేధాలను, క్రోధాలను దీనితో అరికట్టి సంసారాన్ని కుదుటపరచి అన్యోన్య ప్రేమాతిశయాలతో సంసారయాత్ర చేసేటట్లు చేసినవి నా ముప్పదిసంవత్సరాల అనుభవంలో ఎన్నో ఉన్నాయి. 'స్టెఫిసగ్రియా' కుగల మానసికలక్షణం సహాయంతో. ఈమధ్యనే 'స్టెఫిసెగ్రియా' యిస్తే నివారింపబడిన ఒక యువతియొక్క ఉన్మాదస్థితిని చెప్తాను పాఠకులమనస్సుకు పట్టేందుకు.

బ్యాంకుఏజంటుగా పనిచేసే ఒక గృహస్థు ఒకనాటి సాయం కాలం తనభార్యను యీడేరినకుమార్తెను వెంటబెట్టుకొని తనకుమార్తె యొక్క మానసికస్థితినిగురించి నాతో సలహాచేసేందుకు వచ్చాడు మిత్రుల ప్రోద్బలంమీద. కుమార్తెకు యిరువదిసంవత్సరాలు; వివాహంకాలేదు. విద్యావతి. సన్నగా పొడుగ్గాఉంది. పచ్చనిశరీరఛాయ, సర్వాంగసుందరి. చూస్తే రోగిఅని ఎవరూఅనుకోలేరు. వెకిలితనం వెల్లడవుతోంది. నాకేసిచూచి విరుగబడి నవ్వింది ప్రథమంగా. విపరీతమైన దాహం. తండ్రి అదమాయిస్తే రెచ్చిపోయింది. తల్లి కంట తడిపెడుతూ పిల్లస్థితి ఏకరువుపెట్టింది. అసలు చాల బుద్ధివంతురాలనియు. వినయవిధేయతలు కలదనియు, చాల మర్యాద, అణకువతో వర్తించేదనియు చెప్పిందితల్లి. పదిరోజులక్రితం పక్కింటికెడితే ఒక ముసలామె "అమ్మాయి ఈడొచ్చినపిల్లవు మా అబ్బాయిలువుండగా నీ విల్లా రాకూడదు" అంది. అంతటితో పిల్లధోరణి మారిపోయింది. అన్నానికిరాదు; ఏమీ పట్టించుకోదు. తమ్ముళ్ళను చెల్లెళ్ళను తిడుతుంది, కొడుతుంది; ఎన్నడులేంది పుస్తకాలు చించి విసిరేస్తుంది. ఇదేమిటంటే కేకలు. రాత్రిళ్ళు నిద్రపోదు. తల్లిఅన్నా తండ్రిఅన్నా

కోపం. కూతురుస్థితికి తల్లితండ్రులు బెంగపెట్టుకున్నారు. వివాహ ప్రయత్నం చేస్తుండగా పిల్లమనస్సు యీరీతిగా చెడిపోయినందుకు ఆ దంపతులిద్దరు బెంగటిల్లి విచారంతో ఈపిల్లస్థితి వేగంగా బాగుపడే ట్లు చూడాలని ప్రార్థించుచున్నారు. ఒక్కవారంరోజులలో పిల్లయథా స్థితికొస్తుందని చెబుతూ 3 మోతాదులు "స్టైఫిసగ్రియా" యిచ్చి ఒకటి ఆరాత్రి, రెండవది మరునాటి వుదయం వేసి ఏలా వున్నదీ మరునాటి సాయంకాలం తెలుపమనిచెప్పి పంపేను. అమ్మాయికి యింత స్వల్ప వ్యవధిలో స్వస్థత చేకూరినందులకు నన్ను అభినందిస్తూ తనభార్య పొందిన ఆనందాన్ని వివరిస్తూ వుత్తరంవ్రాసి మరునాడు పంపించారు. తిరుపతిలో స్వామిసాన్నిధ్యంలో జరుగబోయే ఆ అమ్మాయి వివాహా నికి ఆహ్వానిస్తూ యీపాఠ్యసంపుటి వ్రాస్తుండగానే నాకు శుభలేఖ వచ్చింది. ముసలమ్మవలన కలిగిన అవమానం మనస్సున పట్టి యీస్థితికలిగించె. ఆపిల్లకు. అవమానంచే విపరీతపరిణామాలు సంభ విస్తే 'స్టైఫిసగ్రియా' నిరుపమానంగా పనిచేస్తుంది.

6. పిల్లలకువచ్చు ఏఏ వ్యాధులకు 'స్టైఫిసగ్రియా' పనిచేస్తుంది ?

ఉదరపొట్ట; బక్కకోపం; ఇది అది కావాలని మారాము; ఇస్తే విసిరికొట్టెయ్యడం; కడుపునొప్పి; తిన్నా తాగినా బాధ ఉద్రే కించడం. యీలక్షణాలుంటే యిది దివ్యౌషధం పిల్లలకు. పొట్ట పట్టు చెడి వ్రేల్లాడుతున్నట్లుభావం. అందుచే జ్ఞానమొచ్చినపిల్లాడయితే పొట్టపడిపోతుందేమోఅని చేత్తో పట్టుకుంటాడు. ఇట్టిపిల్లలకుఎన్నడూ సరిగా పాలపళ్ళు పొటకరించుకురావు. పళ్ళు రావడంతడవుగాముక్క లుగావిరిగి నొక్కిగాఅయి నలుపెక్కుతాయి చూడ్డానికి. ఇగుళ్ళుగట్టి పడక అసహ్యంగా మెత్తగావుండి రక్తంకారుతాయి; సున్నితంగా వుండి బాధగావుంటాయి.

6. ఎలాంటి మూత్రలక్షణాలకు "స్టైఫిసగ్రియా" యివ్వాలి ?

ఈమందు గల మూత్రలక్షణాలలో ఒక వింతవుంది. మూత్ర విసర్జన చేయని సమయంలో మూత్రవాహినిలో మంట. మూత్రం విసర్జిస్తుంటే మంటవుండదు. ఇది అసాధారణలక్షణం; అసహజలక్షణం. వృద్ధులకు మూత్రం తరచుగా బొట్లుబొట్లుగా వెళ్ళడంకద్దు. ఈవ్యాధికీమందు పెట్టిందిపేరు.

7. 'స్టైఫిసగ్రియా' ఏఏ చర్మవ్యాధులను కలిగిస్తుంది ?

ఎండుగజ్జికి, రసికారే కురుపులకుకూడ పనిచేస్తుంది. రసికారే గజ్జికి రసి తగిలినంతమేర ఒరిసి దురదపెట్టి పొక్కులు లేచినప్పుడు వాడాలి. ఇందలి చిత్రం ఒకటి; దురదపెట్టినచోట గోకితే అచ్చట దురద తగ్గి మరొకచోటకు మారుతుంది దురద. గజ్జిపైన అట్ట కట్టినట్లు కనుపించి ఆ అట్టను కాస్త తప్పిస్తే దానిక్రింద విపరీతంగా చీము ఉంటుంది. తలపైన, ప్రక్కన, చెవులపైన, చెవులచుట్టునా గజ్జి, రసి, దురద. ముఖ్యంగా కంటిరెప్పలయందు లేచే మొటిమలకు "స్టైఫిసగ్రియా" నిరుపమానమైన మందు.

పులిపిరికాయలు, కాలీపువ్వులో వుండే మొలకలవంటి మొలకలు శరీరంపై లేచే తత్వాలకు సాటిలేని మందు.

8. "స్టైఫిసగ్రియా" కుదిర్చే కంటివ్యాధులేవి ?

కనురెప్పలు దురద, "స్టైస్" మొటిమలు; చిన్నచిన్న మొలకలు అంకురించి పుండ్లు అవుతాయి. ఒకచోట మాని మరోచోట మొలుస్తాయి. కాలికమగు బ్లెఫరిటిస్ అను వ్యాధిని తగ్గిస్తుంది.

9. "స్టెఫిసగ్రియా" నివారించే ఉదర వ్యాధులేవి ?

పొట్టసళ్ళి క్రిందకు వ్రేలాడుచున్నట్లు భావన. ఉదర సంబంధ మగు కండరముల నిస్సత్తువే యీ భావనకు హేతువు. మత్తు పదార్థాలంటే మక్కువెక్కువ. పొగచుట్టలు ఎక్కువగా కాల్చాలంటాడు. ఏమాత్రం తిన్నా, త్రాగినా కడుపులో పోట్లు.

10. "స్టెఫిసగ్రియా"కు గల సాధారణ లక్షణాలేమి ?

ముష్టిమైథునం. అమిత సంభోగించే కలిగే మానసిక లక్షణ ములకు అనగా నిరుత్సాహము, భీతి, భయము, ఆరాటము ఈ మొదలగు లక్షణములకు దివ్యంగా ఉపకరిస్తుంది.

చాల సున్నితమనస్కుడు; ఏమాత్రం మాటకైనా నొచ్చుకుంటాడు. కోపము, గర్వము, అసూయ వీటిచే కలిగే వ్యాధులకు వాడాలి. నుదురుయందు ఒక గుండ్రని చెండు వున్నట్లు మనోభావము. వాడిగల కత్తి మొదలగు ఆయుధములచే గలిగే నరుకులకు, శస్త్ర చికిత్సలయందలి కుట్లు, పోట్లకు పనిచేస్తుంది. పరాభవం, కోపం, అసంతృప్తి; ఇట్టి మానసిక ఉద్రేకమును మనస్సులో పెట్టుకొని మథనపడుటచే కలిగే వ్యాధులకు యిది మందు.

కంటిరెప్పలపై మొటిమలు ఒకటి మానితే మరొకటి పొటకరిస్తుంది. గర్భవతులకు, ఋతుమతులకు పంటి పోటు; ఆహార పానీయాలు తగిలితే పోటును భరించడం కష్టం. పళ్ళకొనలు సిథిలమై నలుపెక్కుతాయి; కొందరికి విరిగిపోతాయి. పొగచుట్ట త్రాగడమంటే ప్రీతెక్కువ. కడుపు నిండుగావున్నా ఆకలే. మూత్రం ఉబ్బుకొస్తుంది; కాని గంటల తరబడి కూర్చోవాలి మూత్రవిసర్జనానికి. మూత్రవిసర్జన చేయని సమయంలో మూత్రవాహినిలో మంట. ముష్టిమైథునం, నిరంతరం సంభోగ సంబంధమగు ఆలోచనలే.

దగ్గు పొగలు మాత్రం భోజనానంతరం మాత్రం వస్తుంది. పగలు మగత, కునికిపాట్లు; రాత్రి తెల్లవార్లు మేలుకొని వుండడమే. గజ్జి, పురిపిరపకాయలు.

## 132. స్ట్రామోనియం (Stramonium)

1. "స్ట్రామోనియం" అననేమి ?

దీన్ని మామూలుగా "థారన్ ఏపిల్" అంటారు, 'దత్తూరా' అని పిలుస్తారు. మన ప్రాంతీయులు. పాడుదొడ్లలోను, గయాళి భూములలోను, చెత్తలమీద మొలుస్తుంది యీ చెట్టు. తాజా మొక్క సమూలంగా తీసి ద్రావకం తీస్తారు.

2. "స్ట్రామోనియం" యొక్క సాధారణ ప్రయోజనమేమి ?

ప్రధానంగా స్ట్రామోనియం జ్ఞానేంద్రియములపై ప్రసరించి (1) సంధి (2) విపరీతమగు మనోభావాలు (3) తరుణ ఉన్మాదాలు కలిగిస్తుంది.

3. సంధిలో 'స్ట్రామోనియం'ను సూచించు లక్షణాలేమి ?

"స్ట్రామోనియం" సంధి భీకరంపంలా ప్రళయంగా వస్తుంది. జ్వరం విపరీతం; సంధి; మితిమీరిన ఉద్రేకం; దార్ఢ్యం; ముఖం భీకరంగాను భయావహంగాను వుంటుంది. రెప్ప వేయకుండా గుడ్లు మిటకరించుకొని ఏదో ఒక వస్తువు కేసో, ఎదుటనున్న మనిషి వైపో తదేక దృష్టితో చూస్తాడు. ముఖం కంది శేగురుముద్ద అవుతుంది. ఒళ్ళు సలసలా కాగిపోతూ "పెల్లు"మని జ్వరం. శిరస్సు కాలిపోతుంది. కాళ్ళు మాత్రం చల్లగా వుంటాయి. ఇంత భీకరసంధి మరే యితర

మందులోను కనుపించదు. భయంకర దృశ్యం, భీతావహమగు చేష్టలు.

హద్దులేని పోరాటం, మితిమీరిన పేలాపన. వర్ణించడానికి వీలులేకుండా వివిధ విధాల నవ్వులు, కేరింతాలు, ఏడుపులు, అంతలోనే పాటలు, దీనాలాపాలు, ప్రార్థనలు, ప్రమాణాలు, పక్కనున్న వారిపై ఉమ్మివేయడం; వీటినన్నిటిని మించినది అతివాగుడు పేలాపన.

రోగి పై విధంగా అరుస్తూ పక్కమీద వివిధరీతులుగా మెలి తిరిగిపోతాడు. సంధియొక్క ఉద్రుతాన్ననుసరించి అడ్డంగాను, నిలువుగాను తిరిగిపోతాడు. ఒకప్పుడు బంతిలా చుట్టజెట్టుకు పోతాడు. చూచే వాళ్ళకు ఒకవిధంగా జాలి, మరోవిధంగా భయాందోళనలు కలుగ చేస్తూ ఒళ్ళు హూనం చేసుకుంటాడు రోగి. ఒకప్పుడు కాళ్ళు-చేతులు బిగతంతాడు, అంతలో తలగడ అదిరేటట్లు తలఎత్తి కుదేస్తాడు. రోగికి గజదృష్టిలా వస్తువులన్నీ పెద్దవిగాను, నిలువుగా ఉన్నట్లు గోచరిస్తాయి. కొందరికి ద్వయదృష్టి; అంటే ఒకేవస్తువు రెండుగా కనుపించడం. నోరంతా పచ్చి పుండులా వుంటుంది; కొంతసేపటికి నాలుక బిరబిగుసుకు పోతుంది. కొందరికి నాలుకకు పాక్షికవాతం వచ్చి కదలిక మెదలిక ఉండదు.

విరోచనమైతే బట్టలో నల్లగా కుళ్ళువాసనతో అవుతుంది. సాధారణంగా మలమూత్రాలు బంధిస్తాయి. కంటిపాపలు కదలక స్తంభిస్తాయి. చూపు, వినికిడి తగ్గిపోతాయి. క్రమంగా మాట పడి పోయి స్నానం చేసినట్లు చమట్లు పట్టేస్తాయి. నాడి లాక్కుపోతుంది. సకాలంలో "స్ట్రామోనియం" యివ్వకపోతే మృత్యుదేవత రోగి జీవితాన్ని ముగింపు చేస్తుంది.

'ప్రైమోనియం'లో భీకరమగు అతివాగుడు బలవత్తరమగు గుర్తింపులక్షణం (నేమ్).

4. సంధిలో ముఖ్యంగా వాడదగిన మూడు మందులను తెలుపుచు వాటిని పోల్చి వ్రాయుము.

1. బెల్లడోనా 2. హాయాస్మస్ 3. ప్రైమోనియం

'హాయాస్మస్'లో రోగి మగతగా వుంటాడు. ఒకప్పుడు సంధి యెక్కువగా ఉన్నా అంతలోనే ఉధృతం తగ్గుతుంది. సంధి ఒకేలా ఉండక హెచ్చుతగ్గులుగా ఉంటుంది. విస్తారంగా వుండేది మగత.

'బెల్లడోనా'లో రక్తం విస్తారం సిరస్సుకు పోడవడంచే చాల ఉద్రితంగా వుంటుంది సంధి. కణతలు ఉబ్బి అదురుతుంటాయి. సిరస్సు కాలిపోతూ కాళ్ళు-చేతులు చల్లగా వుంటాయి.

"ప్రైమోనియం"లో తల అదిరిపోతూవుంటుంది. సంధి భీకరం ఎక్కువ. ఇందులో రోగి వాగేటట్లు మరేయితర మందులోను వాగడు. విపరీతమగు పేలాపన - వాగుడు. రోగి వివిధరీతులుగా మెలితిరిగి పోతాడు.

"హాయోశ్యమస్" రోగికి కొంకర్లు ఉంటాయి. సంధిలో ఇవి అవి గిల్లుతాడు. సంధి లేనప్పుడు మగతలో వడివుంటాడు. కదలిక, మెదలికా ఉండదు.

'బెల్లు'లో రోగికి కళ్ళుమూస్తే భయానక దృశ్యాలు గోచరించడంచే భయంచే పక్కలోనుండి లేచిపోవడానికి ప్రయత్నిస్తాడు. ముఖ్యంగా నిద్రనుంచి లేచాక పక్కమీాదనుండి దూకడానికి ప్రయత్నిస్తాడు.

రోగి పారిపోవాలని ప్రయత్నించడం ఈ మూడు మందులకూ కూడ వుంది.

'హయోస్యమస్'లో కొద్ది జ్వరం; సంధీ అంతమాత్రంగానే వుంటుంది.

"స్ట్రెమోనియం"లో జ్వరం ఎక్కువగావుండి సంధి కూడ విపరీతమే.

"బెల్లు"లో జ్వరం విపరీతం, సంధికూడ ఎక్కువే.

సంధి విషయంలో 'బెల్లు' 'హయోస్యమస్' 'స్ట్రెమోనియం' లకు ఉధృతంలో మధ్యస్థంగా ఉంటుంది. జ్వరతీవ్రంలో 'బెల్లడోనా'ది ప్రథమస్థానం.

ప్రతిమూలనుంచీ ఏవో వస్తువులు లేస్తోన్నట్లు కనుపిస్తాయి. అనేకరకములగు జంతువులు, అడవి మృగాలు, విషజంతువులు లేచి నట్లు కనుపించి రోగికి భయం వేస్తుంది. రోగి పిల్లవాడైతే ప్రక్కన వున్న తల్లినిచూస్తూ "అమ్మా" అని భయంతో "కెవ్వున" కేక వేస్తాడు. కళ్ళు తెరచిపెట్టుకుంటాయి; పాపలుమాత్రం ఆడవు. రోగికి వెల్తురుండాలి. 'వెలుగుపిచ్చి' రోగి వెలుగులో ఉండాలంటాడు.

'స్ట్రెమోనియం' రోగి దెయ్యాలను, భూతాలను, దేవతలను దేవతాకన్యలను, వివిధరకాల జంతువులను, చచ్చిపోయినవాళ్ళను, పితృదేవతలను చూస్తాడు తన భావంలో. ఇది నిజంకాదని తెలును కాని చీకట్లో యదార్థమని భావిస్తాడు.

6. ఉన్మాదంలో 'స్ట్రెమోనియం'కు ప్రధాన సూచక లక్షణములేమి ?

భయానక చేష్టలు; ఒతివాగుడు; నవ్వుతాడు, ఆడుతాడు; నాట్యం చేస్తాడు; పాడుతాడు; ఆఖరుకు ఏడుస్తాడు కూడాను. తిడు

తాడు, కొడుతాడు; అందుబాట్లో ఉంటే కరుస్తాడు. బట్టలు చించు కుంటాడు; దొరికితే ఎదుటివాళ్ళవికూడా చింపేస్తాడు.

మదపిచ్చ : బట్టవిప్పి జననేంద్రియం చూపిస్తుంది; మానాభి మానాలు, మానపత్వం మంటకలిసిపోతాయి రోగికి.

ఉన్మాదం ఉద్రేకవుపశాంతులతో వుంటుంది. ఒకమారు వుద్రేకంలో చేసినచేష్టలు రెండోమారు వుద్రేక సమయంలో చేసేచేష్టలకు సంబంధం వుండదు. ఒకప్పుడు విచారం; ఒకప్పుడు రుద్రరూపం దాల్చి ఘాతక కృత్యాలకు దిగుతాడు. చూడ్డానికి "బెల్లడోనా" రోగిలా వుంటాడు. కాని రోగి చరిత్ర సరిపడదు. ఉద్భృతంలో 'బెల్లా ఒకసారి వుపశాంతి చేసినా రెండవదఫా వచ్చినప్పుడిస్తే పనిచేయదు.

ఒకప్పుడు మత పిచ్చ; మరొకప్పుడు మదపిచ్చ.

7. "స్ట్రెమోనియం"కుగల మానసిక ఉత్ప్రేక్షణలేమి ?

తాను చాల ఆజానుబాహుణ్ణని, స్థూలకాయుణ్ణని, బలవంతు ణ్ణని ఉత్ప్రేక్షభావం. తనభుజమే చాలపెద్దదని, భుజశక్తిఅపారమని భావం. ఒకప్పుడు అందరిమీదా రెట్టింపుమనిషినని, అందరివలెకాక తనకు మూడుకాళ్ళున్నాయని విపరీత ఉత్ప్రేక్షాభావం ఉంటుంది.

8. వింతభావాలుగల ఆరుమందులనువ్రాసి వాటి వింతలక్షణములను కూడ వ్రాయుము.

(1) తనతోపాటు తన పరుపుపై ఎవరోఉన్నట్లు భావం – 'పెట్రోలియం'.

(2) తాను మరణించినట్లు తనకు బంధువులు దహనాదిసంస్కారము చేయుటకు ప్రయత్నిస్తున్నారనేభావం – "లాకెసిస్".

(3) తనశరీర భాగాలు గాజుతయారని, అవిపగిలిపోతాయేమో నని భావం – "తూజా".

(4) తాను గర్భవతినని కొద్దిరోజులలో ప్రసవిస్తుంది అనే భావం – విరాట్రిం–ఆల్బ.

(5) తాను చాల చిన్న పిల్లననేభావం – 'సికూ్యటా–వి'.

(6) తాను ముక్కముక్కలై పక్కపై విదజల్లబడినట్లు, భావించి వాటిని పోగుచేసుకునేందుకు ప్రయత్నం – 'బాప్టీషియా'.

'స్ట్రామోనియం'లో తాను పొడుగుపాటివాణ్ణని అందరికన్నా పెద్దింపుమనిషిని అనేభావం.

9. స్ట్రామోనియంకుగల విలక్షణ సర్గికలక్షణములేమి ?

(అ) పెక్కు వ్యాధులలో బాధలేమియు ఉండవు.

(ఆ) ప్రస్వప్రవాతప్పకుండగానే అవయవాలు కొంకర్లుపోతాయి.

(ఇ) కాంతివంతమగు వెలుతురు, మెరిసే వస్తువులు (అద్దం–మొదలైనవి). చూస్తే మళ్ళాకొంకర్లువస్తాయి (బెల్లు).

(ఈ) ఒళ్ళంతాబిగుసుకొని వుంటుంది (సికూ్యటా, కుప్రం, ఓపియం).

(ఉ) మితిమీరిన నరాల వుద్రేకం.

(ఊ) చాలపొడుగైనవాణ్ణి – పెద్దమనిషిని అనేభావం.

(ఋ) ఎక్కువ వెలుతురులో వుపశాంతి (చీకటికావాలి–కోనియం. పోస్ఫ, సేంగ్యు).

(ౠ) నిద్రవల్ల వ్యాధిలక్షణాలు ప్రకోపిస్తాయి.

(ఌ) మెరిసే వస్తువులుచూస్తే వుద్రేకం.

(ఊ) తాకితే వుద్రేకం.

(ఎ) నీరంటే భయం. ద్రవపదార్థాలయందు అహితవు.

10. పిచ్చికుక్క కరిస్తే వచ్చే 'హైడ్రోఫోబియం' అనే వ్యాధిలో స్ట్రామోనియం వాడవలసిన లక్షణాలేమి ?

నీటిపారుదల లేక ప్రవాహంయొక్క శబ్దం చెవినిపడితే భయం. ఆవస్థా, ఆరాటం కలుగుతాయి. నీరు త్రాగేటప్పుడు పులమారుతుంది. నోటివెంట రక్తయుక్తమగు నుచ్చులు (ఆరుమ్; సికేల్).

మెరిసేవస్తువుకంటబడితే విపరీతంగా వాగుడు, సంధి, కొంకర్లు సంభవిస్తాయి. గొంతు బిగుసుకుపోతున్నట్లు ఈడ్పులు – కేకలు వెయ్యడం.

11. పిల్లలకు 'స్ట్రామోనియం' వాడదగు లక్షణాలేమి ?

పొంగు, ఆటలమ్మ, మసూచికం – మొదలగు చర్మగతఅంటు రోగాలలో చర్మంపై పొక్కులు సరిగా తేలకపోతే వుష్ణంతగిలి ముఖం ఎరుపెక్కి స్థిమితంలేక యిటు-అటు దొర్లాడడం సహజం. నిద్రనుంచి లేచి ఝడుసుకున్నవాళ్ళలా ఆడుస్తుంది. ఎవరినీ గుర్తుపట్టలేదు. కాళ్ళు-చేతులు కొంకర్లుపోతాయి. ఈస్థితిలో 'స్ట్రామోనియం' పొక్కులను తేల్చి వుద్రుతం తగ్గించి రోగిని తెరిపికి తెస్తుంది.

12. విషసర్పి (Erysipelas) కి "స్ట్రామోనియం" వాడదగు స్థితిఏమి?

విషసర్పిలో మెదడుచెడినచో 'స్ట్రామోనియం' వాడాలి. లక్షణములన్నీ "రూస్టాక్సు"ను పోలివుంటాయి. మెదడుకు సంబంధించిన లక్షణాలుమాత్రం అదనంగా వుంటాయి. సంధి, ఆరాటం, ఝడుసుకున్నట్లు అరుపు – ఇవి 'స్ట్రామోనియం'కు అదనం. ఒకవిష

యంవుంది – 'స్ట్రెమోనియం'లో జ్వరంవుండదు; పున్నా లెఖలో నిదికాదు (జ్ఞాపకముంచుకోవలసిన విషయం).

13. స్ట్రెమోనియం వాడదగు మదపిచ్చి లక్షణాలేమి ?

"స్ట్రెమోనియం" నిస్సందేహంగా మదపిచ్చను రెచ్చగొడుతుంది. స్వాభావికంగా స్త్రీకి సిగ్గు, లజ్జ, బిడియం వుంటుంది. కాని ఈరోగి నేడు శృంగారగాథలు వెల్లడించడం. శృంగారగీతాలు పెద్ద మనుష్యులఎదుట సిగ్గువిడచిపాడ్డం, తరచు పురుషసంపర్కంకోసం వుబలాటం చూపడం వగైరాచేష్టలతో విపరీతమార్పును ప్రదర్శిస్తుంది. లజ్జాభయాలుపోతాయి. "కామాతురాణాం నభయం, నలజ్జ" అన్న విషయం ఈరోగిలో దృఢపడుతుంది. 'స్ట్రెమోనియం'రోగిలో సాధారణంగా ఈలాటి విపరీతపరిణామాలు నెలసరికిముందుగా వృద్ధి విస్తాయి. ఈలాటిస్త్రీలలో 'స్ట్రెమోనియం' అమోఘంగా పని చేస్తుంది.

నెలసరి విస్తారంగాఅవుతుంది. ఇట్టిమదవతులు గొడ్డువాసన వేస్తూవుంటారు. సాధారణంగా చిత్తకార్తిలో మృగాలుమద మెక్కుచ్చాళించేవాసన కొడుతుంటారు ఈస్త్రీలు.

14. 'స్ట్రెమోనియం' (దత్తూరా) విషానికి సాధారణ విరుగుడేమి ?

నిమ్మరసం తరచు యిస్తూండడమే.

15. ఉబ్బసదగ్గులో "స్ట్రెమోనియం" వాడదగు అవస్థలేమి ?

నరాల దుర్బలత్వంచే అంకురించే వుబ్బసానికి వాడాలి. హఠాత్తుగా మాటపడిపోతుంది. ఊపిరాడదు, ముఖంకంచె నల్లబడుతుంది. ఛాతీ అడ్డంగా బిగబడుతుంది. రోగి శ్వాస ఆడక గిజగిజ కొట్టుకుంటాడు. ఈఅవస్థలో 'స్ట్రెమోనియం' రోగికి అమృతతుల్యం.

16. మూత్రవిసర్జనలో "స్ట్రామోనియం" గుర్తింపు లక్షణమేమి ?

మూత్రం అణగిపోతుంది (Suppression) ముఖ్యంగా సన్నిపాత జ్వరాలలో మూత్రం అణగినప్పుడు అమోఘంగా పనిచేస్తుంది.

17. స్ట్రామోనియం సాధారణంగా కలుగజేసే లక్షణములేమి ?

భయంకరమగు సంధి; విపరీతమగు పేలాపన. ముఖ్యంగా ఉన్మాదంలో విపరీతమైన వాగుడు, కేకలు. భయంకరమగు ఉద్రేకము. ఇవి 'స్ట్రామోనియం'లో ప్రధాన లక్షణాలు.

వెలుతురును, సహచరిని వాంఛిస్తాడు రోగి. ఒంటరిగా వుండలేడు. చీకటంటే భయం. భీతావహమగు మనోభావాలు. ముఖం ఎఱ్ఱగా కంది కాళ్ళు-చేతులు చల్లగావుంటాయి. నత్తి; కష్టంగాగాని మాట తెమిలిరాదు. తలగడనుండీ తల ఎత్తడం తడవుగా వమన మవుతుంది. స్పృహ తప్పకుండా కొంకర్లు. నీటి మెరుపుగాని, అద్దం మెరుపుగాని కంటబడితే కొంకర్లు మళ్ళా వస్తాయి. చాల వ్యాధుల్లో బాధ ఏమియూ వుండదు. ఇది దీని సహజలక్షణం, మత్తుగా వుంటాడు గాని నిద్ర పట్టదు. స్రావాలు (మూత్రం, వగైరాలు) వెలువడవు. గుఱ్ఱుపెడుతూ సోషిస్తాడు. అవయవాలు అదురుతాయి. చర్మవ్యాధులు అణగారి పోవడంచే సంభవించే దుర్గుణాలకు మంచి మందు. 'స్ట్రామోనియం' ఇస్తే వ్యాధి చర్మగతమై రోగి కోలుకుంటాడు. పాలు అమితంగా స్రవిస్తాయి. ఎడమ తుంటిలో కురుపు వేసి అమితంగా బాధపెడుతుంది. 'ద్వయదృష్టి' ఒకటే వస్తువు రెండుగా అనడం. విపరీతంగా ఎక్కిళ్ళొస్తాయి. నోరు ఎండిపోయినా నీరు త్రాగే వాంఛవుండదు. (పల్స్). నడినెత్తిని మంచికల గుంటలోనుంచి ధనాధింపు. వస్తువులు పెద్దవిగా కనుపిస్తాయి. (గజదృష్టి). వస్తువులన్నీ నల్లగా అన్తాయి. జిడ్డుచమటలు. ముక్కాలి వెలుతురున్న దీపం దగ్గర పెచ్చునిగదిలో,

సంఘుంమధ్య వుంటే కాస్త ఉపశమనం. ఒంటరిగావున్నా, చీకటిలో వున్నా, మెరిసే వస్తువులు చూసినా, ప్రవాహధ్వని విన్నా, నిద్ర పోయి లేచినా. ఎవరేనా తాకినా వ్యాధి లక్షణాలు హెచ్చుతాయి

"నడినెత్తిని ధనారింపు" అనే "స్ట్రామోనియం"కు గల లక్షణాన్ని విద్యార్థుల మనస్సుకు పట్టేటందుకు స్వీయానుభవ మొకటి వివరిస్తాను.

స్థానికంగా పోలిటెక్నిక్ పాఠశాలలో చదువుచున్న 22 సం॥ల వయస్సుగల యువకుడు గత 6 మాసాలనుండీ వున్న నడినెత్తిని గల నొప్పి-బాధకు నా సలహా నిమిత్తం వచ్చాడు. 15 రోజులకు పైగా కె. జి. ఆస్పత్రిలో వున్నాడు. కాని ప్రయోజనం శూన్యం. అనేక మంది వైద్యులచే లెక్కలేనన్ని యింజక్షన్‌లను చేయించుకున్నాడు. మామూలు గచ్చాకు, పుచ్చాకు వైద్యాలు పూర్తి చేసేడు. ఏదియు ప్రయోజనకారి కాకపోయింది. ఒక వైద్యుడు ఇది కళ్ళవ్యాధి అని భ్రమించి రు. 30/-లు ఖర్చుపెట్టించి కళ్లద్దాలు కొనిపించాడు. కాని యువకుడు చదువు దగ్ధమైపోయినందుకు బెంగటిల్లాడు. ఎల్లాగయినా నివారించమని లేకుంటే తన జీవితం నిరర్ధకమని అనేకవిధాల ప్రాధేయపడి బ్రతిమాలాడు నన్ను. అతను ప్రభుత్వ భృతితో విద్యాభ్యాసం చేస్తున్న హరిజన యువకుడు. వాని వ్యాధిచరిత్ర అంతయు వ్రాసుకున్నాను. నిద్రనుంచి లేచేసరికి హెచ్చుతుందని చెప్పుటచే 'లెకెసిస్' యిచ్చాను; ఉపకరించలేదు. వారం రోజులు గడిచాక మాటల సందర్భములో తనకు 'తామర' వున్నట్లు పైన మందురాస్తే అది పోయినట్లు అది పోయిన 15 రో. లకు నడినెత్తి బాధ ప్రారంభించినట్లు చెప్పగా 'స్ట్రామోనియం' 200 పొటెన్సీలో 2 మాత్రలు యిచ్చి రాత్రి ఒకటి మరునాటి ఉదయం ఒకటి వేసుకోమన్నాను. తిరిగి నెల రోజులదాకా ఆ ధనారింపు బాధ లేదు. నెల గడవాక మరల వచ్చి

నది. "స్ట్రామోనియం"నే 1000 పొటెన్సీలో యివ్వగా తరువాత 15 రోజులకు తామర పూర్వంలాగా పైకి పొటకరించింది. ఆ తామరకు ఏదైనా యివ్వమంటే వారం వారం వేసుకోమని పాల పంచదార యిచ్చాను. 3 మాసాలు పోయాక తలనొప్పి, తామరకూడా పోయాయని చెప్పి ఎంతో సంతోషపడ్డాడు.

# 133. సల్ఫర్ (Sulphur)

(మకుటాయమానమగు ఏంటీసోరిక్)

## 1. "సల్ఫర్" చేయు సాధారణకార్యమేమి ?

హానిమాను మహాశయులు నిర్వచించిన ఏంటీసోరిక్ మందులలో అగ్రిగణ్యమైనది. ఇది పలువిధములుగా పనిచేయును. దీని పరిభావము అన్ని అవయవములందు ప్రసరించును. ప్రధానముగా చర్మముపై దీనిపరిభావము మెండు. వేడి, మంట, దురద; ఇవిప్రధానముగా కలుగులక్షణములు. ఈరోగి వేడిని యేమాత్రముకూడ భరించలేడు. పడుపు వేడివలన వ్యాధిలక్షణములన్నియు ప్రకోపిస్తాయి.

శరీరమందలి ప్రతి అవయవముపైనను, కోశముపైనను ఇది పనిచేయును. కాలికముగా సిరలకు ఉద్రిక్తత కలిగించును. స్రావములన్నియు ఒరుపును, మంటను పుట్టించును. వాటి ముఖద్వారములన్నియు ఎఱ్ఱగానుండును. జీర్ణశక్తినిపోగొట్టును. కాలికవ్యాధులకిది నిరూపణూనమగుమందు. చర్మవ్యాధులను అణగారచేయుటకు ఫలితముగావచ్చు పెక్కు భయంకరవ్యాధులకు పెట్టిందిపేరు. అట్టివ్యాధులను తిరిగి చర్మగతముచేసి ఆంతరంగిక పారిశుద్ధ్యతను చేకూర్చును. నీరంటేకిట్టదు; భీతి. వంటిమెంట శగలు, పొగలు. చర్మముపై మెంట్రు

కలు బిరుసుగావుంటాయి. నవరంధ్రముల ముఖద్వారములు ఎఱ్ఱగా దొండపండులా ఉంటాయి. సరిగా పగలు 11 గంటలకు పొట్టలోదిం చుకుపోతున్నట్లుంటుంది. కోడికునుకు. పిల్లికునుకు 'సల్ఫరు'కు ప్రత్యేక నైసర్గికలక్షణం. నిలబడివుండలేడు. నిలబడివుండుటకు చాలకష్టపడు తాడు. 'సల్ఫర్' రోగులు కంపుకొడుతూ చూచుటకు మురికిఓడుతూ అసహ్యంగావుంటారు. చర్మంపై అంతటా కురుపులో, గజ్జివుండి బరుక్కుంటూవుంటారు. నీళ్లోసుకోడమన్నా, వొళ్ళుకడుక్కోడమన్నా సుతరాం కిట్టదు, అందుకొప్పుకోడు. నీళ్ళుపోస్తే పిల్లలైతే ఏడుస్తారు.

తరుణవ్యాధులలో అన్నిలక్షణాలు గమనించి రోగియొక్క వ్యాధికి తగినమందిస్తే అది కించిత్తుకూడ పనిచేయనిచో "సల్ఫర్" ఇస్తే అవరోధంగాఉన్న "సోరా" అనేదాన్ని తొలగించి మందు పని చేసేటట్లు శరీరంలో చైతన్యాన్ని కలిగిస్తుంది.

స్రావాలన్నీ దుర్వాసన; పెదవులు ఎఱ్ఱగా దొండపండులా ఉంటాయి. ఇది 'సల్ఫరు'లో మరోప్రముఖలక్షణం. ముఖంకంది ఉంటుంది.

అవయవాలక్షీణత, ఉదరపొట్ట 'సల్ఫరు' సూచకలక్షణం.

కాలికవ్యాధుల ప్రారంభములోను, తరుణవ్యాధుల అంత్యం లోను సాధారణంగా ఉపయోగపడే మేటిమందు 'సల్ఫర్'.

2. "సల్ఫర్" రోగియొక్క స్వరూపలక్షణాలేమి ?

'సల్ఫర్' రోగులు బక్కచిక్కి జింహ్వాచాపల్యం, చపలత్వం కలిగి అగ్నిమాంద్యతతోవుంటారు. సన్నగా, పొడుగ్గా భుజాలువంగి వుంటాయి. చామనఛాయగల వర్ఛస్సు. ముక్కోపం. చర్మం యావ త్తూమురికోడుతూ సమీపిస్తే దుర్వాసనకొడుతూను. మురికిచేతులను

కట్టుబట్టనే తుడుచుకుంటాడు. చొక్కా-చేతులు జేబురుమాలులా ముఖం తుడుచుకునేందుకు ఉపయోగిస్తాడు. దానితోనే జోళ్ళుతుడుస్తాడు. శుభ్రితనేది 'సల్ఫర్' రోగికి దూరంగావుంటుంది. నీరుపేరు చెప్పినా, స్నానంచెయ్యమన్నాభయం. కంపుకొడుతున్నా స్నానం చెయ్యడు. పిల్లలుబక్క-చిక్కి తెరిపిలేకుండా చిల్లరతిళ్ళు తింటూ మురికి కారుకుంటూవుంటారు. నీళ్ళుపొయ్యబోతే గోలచేస్తాడు, పోసుకోడు, పొయ్యనియ్యడు. సల్ఫర్ పిల్లాడికి నీళ్ళుపొయ్యడం బ్రహ్మాప్రళయం. వెన్నుపూసలో బలంలేక ఒంగివుంటుంది. 'సల్ఫర్' రోగి వట్టి స్వార్థపరుడు. "నాదైశ్వర్యం, నాదారోగ్యం, నాకుధనం, నీకుఋణం" అనేపద్ధతిలో ఉంటాడు; ఎదుటివాళ్ళగొడవ ఏమాత్రము పట్టించుకోడు. ఏమాత్రంవాసన కిట్టదు; అతిసున్నితం; కాని ఆలాటి కంపుకొట్టేవే తింటాడు; ఆరోగిలో యిదోవింతలక్షణం. తనకంపు తనకిష్టమేకాని ఎదరివారికంపుమాత్రంకిట్టదు. "సల్ఫరు" రోగిలా మురికోడుతున్నరోగి మరోమందులో కనుపించడు. "సల్ఫర్" రోగి మురికిబట్టల వేదాంతి అన్నారుపెద్దలు.

8. "సల్ఫరు"కుగల పదునారు నైసర్గికలక్షణములను వ్రాయుము.

(1) అశుభ్రంగా మురికి ఓడుతూవుంటాడు.

(2) స్నానం చెయ్యడమంటే కంటకంగా వుంటుంది.

(3) పగలు 11 గంటలకు పొట్టలోదించుకుపోతున్నట్లుంటుంది; కడుపులోమంట; ఏదైనాతినాలి.

(4) దుర్వాసనకిట్టదుకాని వాసనవేసే వస్తువులే తింటాడు.

(5) స్రావాలన్నీకంపు, ఒరుపు. నవద్వారాలు ఎఱ్ఱగావుంటాయి. పెదవులు లక్క-పిడతల్లావుంటాయి ఎఱ్ఱగా.

(6) స్రావాలన్నీ స్రవించేటప్పుడు అవి తగిలినచోట మంట, ఒరుపు.

(7) పిల్లిలా మాగన్ను నిద్ర.

(8) సిరస్సుపై వేడి; అరిచేతులు, పాదాలు మంటలు.

(9) చైతన్యశక్తిలోపించి రోగలక్షణాలకు సారూప్యలక్షణాలు గల మందిస్తే కొంచెంకూడా పనిచేయనప్పుడు 'సల్ఫరు' యిస్తే వ్యాధి సారూప్యంగలమందు పనిచేస్తుంది.

(10) గూనివానిలా భుజాలు ఒంచినడుస్తాడు.

(11) దాహం తాగడం ఎక్కువ, అన్నంతినడం తక్కువ.

(12) ఉదయాన్నే నిద్రనుండిలేచే అతిసారవిరోచనాలు.

(13) రాత్రిసమయం వ్యాధిలక్షణాలు ఉద్రేకిస్తాయి.

(14) చల్లగాలిలో వుండాలని, మధురపదార్థాలు తినాలని కోర్కె.

(15) పాలు, మాంసము అంటే అసహ్యం, ఏవగింపు

(16) ఎక్కడో ఓచోట స్థలంచూచుకొని లేచినిలబడాలి, నిలబడ్డమంటే ప్రాణగండం.

భోజనానంతరం, నిద్రానంతరం, స్నానానంతరం, నిలబడ్డప్పుడూ రోగియొక్క బాధలన్నియు హెచ్చుతాయి.

4. 'సల్ఫరు'కుగల మానసికలక్షణములేమి?

కోపం ముక్కుమీదుంటుంది. ఒక చెవినుగు. గోకుకోవడం. నముకోవడం. మురికివోడే చింపిరిగుడ్డలు వేసుకోడం. మాసిన గడ్డం.

కంప్రగొట్టేబళ్ళు; ఈఅవకరాలుగల మెట్టవేదాంతి. వ్యర్థజీవితం మతపిచ్చి; మతసంబంధమగు ఆవేదన, విచారం. చింపిరిగుడ్డలుధరించి మేలైన పట్టుబట్టలుకట్టినట్లు భ్రమిస్తాడు. ముక్తినిగురించిబెంగ. తన మోక్షప్రాప్తికి దిగులు. "ఇతరులేమైతే నాకెందుకు" అనే స్వార్థజీవి. వట్టి కృతఘ్నుడు. విశ్వాసరహితుడు. ఓమూల కూర్చుని గోళ్ళుగిల్లు కుంటూ 'భగవంతుణ్ణెవరు సృష్టించారు'అని అద్యంతాలులేని నిరుపయోగము. నిరర్థకము, నిస్సారము, పరిష్కరించశక్యముకానట్టియు వితండ వింతజిజ్ఞాసలో మునిగి తేల్తుంటాడు. పనంటే పరమబద్ధకం; విధాయక మైన పనినికూడ తప్పించుకు తిరుగుతాడు. వస్తువులను చక్కగాసర్దు కోక అల్లరిగా పారేస్తాడు. శుభ్రతన్నా, క్రమబద్ధతన్నా అతగాడికి సుతరాంగిట్టదు. నూతన విషయాలను పరిశోధింపగల మేధావి. మన సుకు తట్టినవిషయాన్ని విరామంలేకుండా ఆలోచిస్తూనేవుంటాడు. మనస్సునుండి దాన్నిమళ్ళించడు. వెర్రిఆనందం, అవకతవకతృప్తి, వింతగర్వం. తాను వలచిన కురూపి రంభ. తాను మునిగినకుళ్ళు గుంట గంగానది. తానుకట్టిన చింపిగుడ్డ పట్టుపీతాంబరం. కాసుకు గతిలేకపోయినా లక్షాధికారిననేగర్వం. నీరంటేభీతి. నీళ్లోసుకుంటే రొంప. అధైర్యం మనిషి; ఓపికనూన్యం. అంతలో ఏడుస్తాడు. మాట తడబడుతుంది. చెప్పదలచినప్పుడు అవుసరమగుమాటలు స్ఫురణకు రావు. మందమతి. జ్ఞాపకశక్తి నసిస్తుంది.

5. 'సల్ఫర్'కు గల సిరోలక్షణాలేమి ?

కూర్చుంటే తల తిరుగుతుంది. నుదురు బరువు. తలలో వెలితిగా నున్నట్టు భావం. నడినెత్తి ఎల్లప్పుడూ వేడిగానే వుంటుంది. (గ్రైటిస్, నేట్రమూర్). కణతలు నొక్కుతున్నట్లుండి మెదడు బిగ లాగుచున్నట్లు భారం. కదిలినా మెదిలినా ఉదయంపూట తల బ్రిద్దలు

కొడుతున్నట్లు నొప్పిగా వుంటుంది. వారానికి లేక రెండు వారాలకు ఒకరోజున వచ్చే తలనొప్పికి వాడవలసిన మందు "సల్ఫర్".

పుర్రె పొడిఆరి కాలిపోతూ వుంటుంది; అమితంగా దురద; గోకితే దురద ఉపశాంతిస్తుంది గాని విపరీతంగా మంట లేస్తుంది. కడిగినా తలకు స్నానం చేసినా పుర్రెపై కురుపులు హెచ్చుతాయి. తల తడిపితే విపరీతముగు మంట పుడుతుంది. వసుపురంగు పక్కు కట్టే కురుపులు పుర్రెపై లేవడంకూడ సహజం. కొందరికి విపరీతముగు చుండ్రు పుట్టి వెంట్రుకలు ఊడిపోతాయి.

6. "సల్ఫర్" యొక్క స్రావముల నైసర్గిక మెట్టిది ?

కళ్ళు, ముక్కు, చెవులు వగైరా నవద్వారములలో దేనినుండియైనను స్రవించుస్రావము మంట, ఒరుపు కలిగిస్తుంది. మలమూత్రాలు మండుతాయి. ఏ అవయంగుండా స్రావం వెడుతుంటే అచ్చటి అను త్వచలన్నియు ఒరిసి మండుతాయి. ఈ మంట సల్ఫర్‌కు ప్రత్యేక నైజలక్షణం.

7. విషసర్పి (Erysipelas) లో 'సల్ఫరు' వాడదగు లక్షణాలేమి ?

సాధారణంగా "సల్ఫరు"కు విషసర్పి ముఖముయొక్క కుడి భాగంలో కుడి చెవియందు ప్రారంభించి ఆచెవి వాస్తుంది. క్రమంగా ఆ వాపు నెమ్మదిగా పాకుతుంది. వాపు ఊదారంగుగా వుంటుంది. రోగిని ఎంతతోమి స్నానం చేయించినా మురికివాసన కొడుతూనే వుంటాడు. శరీరం ఎండిపోయి ముడుతలుపడి వుంటుంది. ఉద్బృతమగు జ్వరము, వాపుతో ప్రశయంగా వచ్చే విష సర్పికి "సల్ఫర్" ఉపయోగపడదు. ప్రథమంగా ముఖముయొక్క కుడి వెంపున చెవి సమీపంలో కమిలినట్లు ఎఱ్ఱని బొబ్బ లేస్తుంది. దానికి కొద్దిదూరంలో

మరొకటి లేస్తుంది. తరువాత యింకొకటి, ఈలా అనేకం లేచి అన్నీ ఒకటైపోతాయి ఒక వారం రోజులలో. క్రిమంగా విసర్పి ఉద్భృతమై రోగి సృహతప్పే స్థితిలోకి వస్తాడు. ఆ స్థితిలో 'సల్ఫరు' చేసే పని అద్భుతం. తాపీగా ప్రారంభించి క్రమంగా వృద్ధిచెంది ఉద్భృత పరిస్థితులకు దారితీస్తుంది విసర్పి 'సల్ఫర్'లో.

8. రక్త ప్రసరణలో "సల్ఫర్" వేగల మార్పులు ఏమి ?

ఇది సిరల సంబంధమగు (Venous Circulation) రక్త పరిసరణపై పనిచేస్తుంది. కొన్ని స్థానిక భాగాలలో రక్తం పేరుకోవడం ఇందలి ప్రముఖ లక్షణాలలో ఒకటి. అందుచే యీమందుకు పుట్టే మంటలు చెప్ప నలవికానివి. నడినెత్తి మంట, కళ్ళు మంట, ముఖం మంట, నాలుక మంట, ఆసనం మంట, మూత్రివాహిని మంట, మర్మస్థానాలు మంట, కాళ్ళు - చేతులు మంట, చర్మం యావత్తూ మంట, గోకితే మంట. శగలు-పొగలు. పాదాలు మంటగావుండి యీ రోగి చల్లగాలికని ఆ పాదాలు పరుపు తప్పించి వుంచుతాడు. ఇందు యిదో సూచకలక్షణం.

సిరస్సుకు రక్తం విస్తారం ప్రసరించినప్పుడు చెవిలో హోరు పుడుతుంది 'సల్ఫరు' రోగిలో. ముఖం కంది ఆనుబయట ఉద్రేకించి వెచ్చని గదిలో వుపశమిస్తుంది. ఇదొక ప్రత్యేక లక్షణం.

ఒంగి వుంటే బాధ ప్రకోపిస్తుంది. 'సల్ఫరులో' (ఫెర్రింగ్టన్).

ముఖానికి సిరస్సుకు రక్తం మిక్కిలిగా ప్రసరించడంచే శగలు, పొగలుగా వుంటుంది ముఖం. ఇందలి శగలు (Flushing) హృదయ సమీపంలో ప్రారంభిస్తుంది. ఇది 'సల్ఫరు' లక్షణం. ఈలాటి శగలే ఉదరంలోగాని, తుంటిలోని ప్రారంభిస్తే 'ఫోస్ఫరస్'ను సూచిస్తాయి.

(కెంటు). అకస్మాత్తుగా రక్తం సిరస్సుకు పాడిచి గుండెదడ, ఆయాసం, గాలి తగలకపోతే ఉక్కిరిబిక్కిరి కావడం వుంటే 'సల్ఫరు' తక్షణం వాడాలి. ఈలాటి పరిస్థితి రాత్రికాలంలో సంభవిస్తే 'సల్ఫరు' వాడుటకు మరీ మంచితరుణం.

9. 'సల్ఫరు'కు వైరుధ్య లక్షణం కలది 'ఆర్సెనిక్' అని కెంటు అంటారు. ఆ సంపర్కమేమి ?

శుభ్రతనుగూర్చి చెప్పినప్పుడు డా॥ కెంటు "సలఫర్' 'ఆర్సెనిక్'కు కేవలం వ్యతిరేకమన్నారు. "సలఫరు" రోగి మురికి ఓడుకుంటూ చాల అసహ్యంగా వుంటాడు. "ఆర్సు" రోగి చాల పరిశుభ్రంగా వుంటాడు, "ఆర్సు, సల్ఫర్ లు" ఈ రెండు విషయాలలో ఉత్తర ధృవము, దక్షిణ ధృవములలా వుంటారు. 'ఆర్సెనిక్' రోగి బట్ట మాయనివ్వడు. దుస్తులు సర్వదా పరిశుభ్రంగా వుండాలి. గదిలోని వస్తువులల్నియు నియమిత స్థానాల్లోనే వుండాలి. చెత్తా, చదారం ఏ మాత్రం వుండడం సహించడు. చిత్రపటాలను వరుసక్రమంలో అందంగా వ్రేలాడగడుతాడు. సర్వాన్నీ కూడా అందంగా క్రమబద్ధంగా పరిశుభ్రంగా వుంచుతాడు. అందుకనే 'ఆర్సు' రోగిని "బంగారు పిడి గల చేకఱ్ఱ రోగి" "The gold headed cane patient" అని అనుభవజ్ఞులన్నారు. "సల్ఫరు" రోగిని 'మురికి గుడ్డల వేదాంతి' అన్నారు పెద్దలు. (హెూజ్జింగు)

10. రోగిలో చైతన్యం లోపించినప్పుడు వాడే మందులు ఏవో విపులీకరించుము.

రోగ సూచకమగు మందు రోగికి పనిచేయనప్పుడు 'సల్ఫర్' రోగికి చైతన్యం చేకూర్చి రోగసారూప్యమగు మందును వాడి రోగ

మును నివారించుటకు సహకరించును. సాధారణంగా కాలిక వ్యాధు లలో 'సోరా' అవరోధంగాఉండి మందు చేయుపనిని నిరోధించును. 'సల్ఫర్' ప్రధానమగు 'ఏంటిసోరిక్' మందు అగుటచే ఆసోరాను నసింపజేసి అవరోధాన్ని తొలగిస్తుంది. అప్పుడు రోగనారూప్యమగు ఔషధమునువాడితే వ్యాధి సంపూర్ణముగా నివారణమవుతుంది. 'సోరా' యొక్క చరిత్రను శాస్త్రాంశాలను (వ్రాసేటప్పుడు సాకల్యంగా చర్చిస్తాను.

రోగిలో చైతన్యం కలుగజేయుటకు "కుప్రం, కేప్సికం, ఓపియం, లరాసరస్, కార్బొవెజిటాబిలస్, ఏంబ్రాగ్రిసియా, వెలీరియం" అను నవి ఉపయోగకరమగు మందులు. 'కుప్రం' కొంకర్లకు, 'లరాసిరస్' ఊపిరితిత్తులకు సంబంధించు వ్యాధులలోను, "వెలీరియం, ఏంబ్రాగ్రి సియా"లు నరముల దుర్బలత్వంలోను. 'కార్బొవెజ్జి' ఉదరసంబంధ మగు వ్యాధులలో రోగియొక్క కాళ్ళు-చేతులు చల్లబడి కృంగిపోయే సమయాన్ని, మగతగాఉన్నప్పుడు 'ఓపియం' ఊబకాయులకు 'కేప్సి కం' వాడితే రోగిలో చైతన్యంకలిగి సారూప్యౌషధము తప్పకపని చేయును; రోగి క్రమముగా కోలుకొనును.

11. ఆర్ద్రకాలం (ముట్లుడిగేకాలం)లో సెగలను, పొగలను తప్పించే కొన్ని మందులను పేర్కొనుము.

"లెకసిస్, సల్ఫర్, ఏసిడ్-సల్ఫ్, ఎమిల్-నిట్, కాలీ-బిచ్రొ, సాంగ్యునేరియా".

12. ఉదయం 11 గంటలకు నీరసం, నిస్సత్తువలను కలిగించుమందు లేవి ?

"ఫోస్ఫరస్, సల్ఫర్, హైడ్రాస్టిస్, ఎసఫటోడియా, జింకం".

13. "సల్ఫరు" కలుగజేయు జ్వరముల స్వభావమేమి ?

"రక్తంలో మార్పును కలిగించే సూచనలు 'సల్ఫరు'లో అంతగా కనుపించవు. అందుచే ప్రధానంగా విషజ్వరాలలోను, సన్నిపాత జ్వరాలలోను యిది వాడదగు సూచనలు కనుపించవు" (ఫేరింగ్టన్).

విషుప్రజ్వరాలలోను దీర్ఘజ్వరాలలోను ఇది సూచింపబడుతుంది. సాధారణంగా జ్వరఉద్వృతంలో 'ఎకనైట్' వాడిన తరువాత శేషించిన లక్షణాల నివారణకు 'సల్ఫరు' వాడాలి. 'ఎకనైటు' వాడిన తరువాతకూడ ఒళ్ళువేడిగానుండి శరీరం పొడారి బిరబిరలాడుచున్నప్పుడు, రోగిలోని చైతన్యశక్తి లోపించడంచే 'సోరా' అవరోధము వలన రోగియొక్క సాదృశ్యౌషధమగు 'ఎకనైట్' వాడినను చమటలుపట్టక, జ్వరం దిగజారక, జ్వరంవిడవకుండా వుండినప్పుడు క్రమంగా రోగి మగత, కునికిపాట్లకులోనై సన్నిపాత జ్వరంలోనికి దిగేసూచనలున్నప్పుడు 'సల్ఫరు' నిరుపమానంగా పనిచేస్తుంది. అంటే సన్నిపాత జ్వరంయొక్క ప్రథమావస్థలో 'సల్ఫరు' చేయుపని అద్భుతం. విషజ్వరాలలోకూడా ప్రథమావస్థలో రోగిలక్షణాలు యితరమందులను ఇదమిద్ధంగా నిరూపించనప్పుడు 'సల్ఫర్' వాడవచ్చును (కెంటు). ఒకవేళ 'సల్ఫర్' వాడ్డంలో పొరబడినా సంభవించే ప్రమాదమేదియు లేదు. జ్వర ఉద్రుతాన్ని తగ్గించి చికిత్సప్రారంభించడానికి మంచి అవకాశం చేకూర్చి వ్యాధియొక్క పునాదికిపోయి చికిత్స సులభ సాధ్యంచేస్తుంది (కెంటు). సూతికాజ్వరంలో మైల, మావి వెడలక చలికుదుపు, విస్తారం జ్వరం, నఖసిఖపర్యంతరం సీటిఆవిరిలా వెచ్చని చమటలుపోస్తాయి. శరీరంలోనుంచి ఆవిరిపోస్తోందా అని అనుపిస్తుంది. ఉదరం పచ్చిగావుండి రోగి వెలవెలబోతూ వుంటుంది. ఆస్థితిలో 'సల్ఫరు' యిస్తే రోగపునాదిని పెకలిస్తుంది. అదిగాక పాదాలుమంట,

కడుపులో నెప్పిగావుండి ఆకలిగావుంటుంది. రాత్రి వ్యాధిప్రకోపిస్తుంది. నీరసం, నిస్సత్తువలతో నవనాళ్ళూ కృంగిపోతూన్నట్లనిపిస్తుంది. ప్రధానంగా వంటినుండి ఆవిరివస్తున్నట్లు శగలు-పొగలు ఒక దానివెంట మరొకటి కెరటాల్లా తెరలు తెరలుగా వస్తూన్నప్పుడు వెంటనే "సల్ఫరు" వాడాలి (కెంటు).

శస్త్రచికిత్స తర్వాతవచ్చే జ్వరాలలోకూడా సల్ఫరు పని చేస్తుంది. ప్రధానంగా ఆవిరిలాటి చమటలు, శగలు వున్నప్పుడు సల్ఫరు వాడాలి.

14. సూతికాజ్వరాల్లో ఉపకరించు మందులేవి ? సూచికలక్షణములతో వ్రాయుము.

'సల్ఫర్, లైకోపోడియం, పైరోజిన్, ఫెర్రం, పల్సు'.

సల్ఫర్ : మైల సరిగా వెడలక చలి, కుదుపు, విపరీతమగు జ్వరమువచ్చినప్పుడు, ముఖ్యంగా నీటి ఆవిరిలాటి వెచ్చనిచమట్లుపోసి వంటివెంట విరామంలేకుండా శగలు – పొగలువస్తున్నప్పుడు 'సల్ఫరు' యిస్తే రోగాన్ని వేళ్ళతో పెకలిస్తుంది.

"లైకొపోడియం" : జ్వరము, వెచ్చని చెమట్లుమాత్రమే కాకుండా కుదుపు ఒకదానివెంటమరొకటి పోట్లు,పోట్లలావస్తూన్నప్పుడు ఆ జ్వరాన్ని నివారించు ఏకైకమందు "లైకోపోడియం' ఇదిఆంతర్యము నకుపోయి వ్యాధిమూలాన్నే నివారిస్తుంది.

"పైరోజిన్" : వొళ్ళు తెలియని విపరీతమగు జ్వరం. నాడి గమనానికి ఉష్ణంయొక్క తీవ్రతకు సంబంధంఉండదు. కొద్ది చలి, కొద్దిపాటి కుదుపు ఒకదానితో ఒకటి మిశ్రమించి విడవకుండా ఉంటాయి. ఆస్థితిలో 'పైరోజిన్' వెంటనేవాడాలి.

"ఫెర్రం" : శరీరంకంది ఉదాగా వుంటుంది. ఒళ్ళు యావత్తూ చల్లని చెమట్లుపడతాయి. చలి, కుదుపు విడచి విడచి వస్తాయి. చలి సమయంలో దాహముంటుంది. మరే యితరఅవస్థలోను దాహముండదు. చలిలో ముఖంకంది జేగురుముద్దలా వుంటుంది. ఈ లక్షణాలు ఒక్క 'ఫెర్రం'కుతప్ప ఏయితర ఔషధానికీ లేవు. అట్టిస్థితిలో 'ఫెర్రమే' శరణ్యాం.

"పల్సాటిల్లా" : శరీరంయొక్క ఒకవెంపు వెచ్చన రెండవ వెంపు చల్లన. రోగి వణుకుపుగొట్టు, జ్వరంతో గజ-గజ వణికిపోతుంది. నరాల ఉద్రిక్తత. ఆరాటం. ఈలాటిస్థితిలో 'పల్సాటిల్లా' విషజ్వరం అంకురించకుండా నివారిస్తుంది.

15. విషమశీతం (Pneumonia)లో "సల్ఫర్" వాడదగు స్థితిని విస్పష్టముగా వర్ణింపుము.

ప్రథమావస్థలో "బ్రియోనియా, ఎకనైట్'లు వాడినా న్యుమోనియావ్యాధి తగ్గక ద్వితీయావస్థ అనగా శ్లేష్మం అంకురించేస్థితి (హెపటైజేషన్) ప్రారంభంలో వ్యాధిప్రవేశం కొద్దిపాటిగావుండి ఎక్కువకాలంనుంచి బాధకరంగా నున్నప్పుడు "సల్ఫర్" దివ్యంగాపని చేస్తుంది ప్రథమంగా.

ద్వితీయంగా 'సల్ఫరు' డబుల్ న్యుమోనియాలో ఊపిరితిత్తుల అధిక భాగం వ్యాధిగ్రస్తమై ఊపిరితిత్తులలో శ్లేష్మం విస్తారం చేరి రోగం ఘనీభవిస్తూ ఏమందిచ్చినా వ్యాధిగమనాన్ని అరికట్టలేనిస్థితిలో రోగి మృత్యుద్వారానికి పురోగమిస్తూ అకస్మాత్తుగా ఒకరాత్రి 2 లేక 3 గంటల మధ్య రోగి నిస్సత్తువతో కృంగిపోతూ పెదవులు ఎండి, లోనికి పిగలాక్కుపోయి ఒళ్ళు చలువలుగమ్మి రోగి ఆరాటపడే స్థితిలో

ఒక్క మోతాదు 'ఆర్సినికం – ఆల్బం' యివ్వకపోతే రోగి మరణించడం తథ్యం. గుర్తుంచుకోవలసిన విషయం. "ఆర్సినిక్" తాత్కాలికంగా రోగిని అప్పటి స్థితినుండి రక్షిస్తుంది. వాపును సమూలంగా 'ఆక్సు' నివారించలేదు. రోగికి తాత్కాలికంగా రోగాన్ని ఢీకొనే చైతన్యశక్తిని యిస్తుంది. రోగికి చైతన్యం, కావలసిన వేడియిచ్చి మనో స్థైర్యాన్ని, జీవశక్తిని యిస్తుంది. కాని యిదివాడిన 24 గంటలలో రోగానికి సరిపడినమందు వాడకున్నచో రోగి మరణిస్తాడు. ఈలాటి సమయాల్లో తాత్కాలిక ఔషధంపై ఆధారపడి జాప్యంచేయదగదు. రోగి తెప్పరిల్లి చైతన్యవంతుడైనప్పుడు వెంటనే 'ఆక్సు'ను అనుసరించే 'సల్ఫరు' వాడాలి. ఇదిరోగిని రక్షిస్తుంది. 24 గంటలలో తనకు స్వస్థత చేకూరుతోందని రోగిఅంటాడు (ఫోస్ఫరస్) ఈలా పైరెండు క్లిష్టస్థితులయందు న్యుమోనియావ్యాధిలో 'సల్ఫరు' అమోఘమగు మందు.

16. 'సల్ఫరు' వాడడంలో తీసుకోనవలసిన జాగ్రత్తలేమి ?

'సైలీషియాను'వలెనే "సల్ఫరు"నుకూడ ప్రధానావయవములు ముఖ్యంగా ఊపిరితిత్తులు చెడినప్పుడువాడుట అపాయకరము. బాగా ముదిరిపోయిన క్షయవ్యాధిలో దీనిని వాడకూడదు, చాల అపాయకరము. క్షయయొక్క అంత్యావస్థలో ఉదయంవేళ అయ్యే అతిసార విరోచినాలను సల్ఫరుయిచ్చి నిలుపుదలచేయకూడదు. రాత్రిపూట క్షయరోగికిపోసేచమటలు. తాపం 'సల్ఫరు' సూచకములైనను ఎన్నటికీ ఆలక్షణములను "సల్ఫరు"తో తగ్గించప్రయత్నించకు (వాస్తవంగా సల్ఫరును సూచించులక్షణాలుండవు).

17. క్షయవ్యాధిలో 'సల్ఫరు' సూచింపబడు సమయమేది ?

శ్వాసకోశములలో క్షయ అంకురించిన ప్రథమావస్థయందు మాత్రము "సల్ఫరు" సూచకలక్షణములుండవచ్చును.

శరీరం కాలిపోతూవుంటుంది. గాలి ఎంత సీతలంగా వున్నా కిటికీలను తెరచివుంచాలి. తరచు వంటినుంచి శగలు, పొగలు లేస్తాయి. కడుపులో వెల్తిగావుంటుంది. నడినెత్తి వెచ్చగా వుంటుంది. పాదాలు మాత్రం చల్లగావుంటాయి. ఏమాత్రం ఎత్తు ప్రదేశము ఎక్కినా గుండె కొట్టుకుంటుంది. ఆయాసం, రొమ్ము సమీపంనుంచి వెనుక తట్టుకు పోటు, బాధ. ఇట్టి లక్షణాలుగల ప్రథమావస్థలో పెద్ద పొటెన్సీలో ఒకటి రెండు మోతాదులు "సల్ఫరు" యిచ్చి తరువాత పరిణామాలను నిరీక్షించాలి. చాల సందర్భాలలో వ్యాధి నివారణ అవుతుంది. కాని ప్రతివారికి నివారణ కాగల నమ్మకంలేదు. 'సల్ఫరు' ను క్షయయొక్క ప్రథమావస్థలోనైనా తరచు వాడరాదు. వాడితే దేన్ని నివారించాలని ప్రయత్నించామో అది ఘనీభవించి దుష్పరిణామాలకు దారితీస్తుంది.

18. ఉదయం అతిసార విరోచనాలను కలుగజేసే మందులను వ్రాసి వాటి సూచక లక్షణములను వ్రాయుము.

"సల్ఫర్, బ్రియోనియా, నేట్రం-సల్ఫ్, రుమెక్స్, పోడో ఫిల్లం, ఫోస్ఫరస్, డయాస్కోరియా.

సల్ఫర్ : రోగిని విరోచనమే పక్కనుంచి లేవదీస్తుంది. విరోచనం రీతి తరచు మారుతూంటుంది. (పల్సా)

బ్రియోనియా : రోగి లేచి కదిల్తే విరోచనాలు ప్రారంభిస్తాయి.

నేట్రం సల్ఫ్ : ఉదయం లేచి పచార్లుచేస్తే విరోచనాలు ప్రారంభిస్తాయి. విరోచనంతో గాలికూడ పోతుంది.

రుమేక్స్ : 'సల్ఫరు' లానే పక్కనుండి లేవగొడుతుంది. విరోచనానుమానం. ఇందు సాధారణంగా రొంప, పడిశం తగ్గిన తరువాత వస్తాయి విరోచనాలు. దీని నైసర్గికమగు దగ్గు వుండడం గమనించాలి.

పోడోఫిల్లం ; రంగు మార్పులో 'సల్ఫరు' మలాన్ని పోలి వుంటుంది. ఉదయం పక్కనుంచి లేవకముందే ఉబ్బుకొస్తుంది. అనుమానం. ఇందులో విరోచనాలు రోజంతా అవుతాయి. ఇందలి విరోచనాలు సల్ఫరు' లా ఉదయాన్నిమాత్రమే కాకుండా మిట్ట మధ్యాహ్నం ఎక్కువగా అవడం కద్దు.

ఫాస్ఫరస్ : ఉదయాన్నే అవుతాయి. కాని విరోచనాలు ఏమాత్రం బాధలేకుండా అవుతాయి.

డయాస్కోరియా : ఉదయాన్నే అవుతాయి విరోచనాలు; దీనికి నులినొప్పి విస్తారంగా వుంటుంది.

19. పురుష మర్మాంగములో సల్ఫరు ఎట్టి మార్పులను చేయును ?

రోగి పలురకముల జఠర బాధలతో తీసుకుంటూ నీరసంగాను, నిస్సత్తువగాను వుంటాడు. కొన్ని సమయాలలో శోషవచ్చినట్లుంటుంది. వంటినుండి శెగలు వస్తుంటాయి. నడినెత్తి కాలిపోతూ పాదాలు మాత్రం చల్లగావుంటాయి. రాత్రి సమయంలో తెలియకుండా యింద్రియ స్ఖలనం అయి మరునాటి వుదయం చాల నీరసపడుతాడు. వీర్యం చాల పల చబడి నీరులా వుంటుంది. వీర్యంలోని పటుత్వం పూర్తిగా నశిస్తుంది. వీర్యానికుండవలసిన లక్షణాలేమియు వుండవు;

నామమాత్రంగా నీరులా వుంటుంది. పురుషాంగం బిగి తగ్గి ముకుళించుకొని వుంటుంది. వృషణాలు పట్టుచెడి వేళ్ళాడిపోతుంటాయి. పురుషాంగం చల్లగావుండి లేపనం అంతగా వుండదు. సంభోగప్రయత్నం జరుగుతుండగానే వీర్యస్ఖలన మయిపోతుంది. నడుం పట్టుచెడి నొప్పిగా వుంటుంది. రోగి లేచి నిలువుగా నిలబడలేడు. రోగిలో ఉత్సాహం లేక దిగులుగా వుంటాడు.

20. కంటిలక్షణాలు ఏవి 'సల్ఫరు'ను సూచిస్తాయి ?

శైత్యం ఎప్పుడు చేసినా కళ్ళబాధతో అంత్యమవుతుంది. కళ్ళనుండి రసి, పుసులు కారుతాయి. రెప్పలు వాచి మొద్దెక్కుతాయి. రెప్పలు కంటిలోనికి గాని, బైటకుగాని విరుచుకొని వుంటాయి రెప్పలపై వెంట్రుకలు ఊడిపోతాయి. కంటిముందు నల్లని ఈగలు ఎగురుతున్నట్లు అనుపిస్తుంది. కళ్ళు అమితమగు మంట, ఒరుపు, సూర్యకాంతిని ఏమాత్రం చూడలేరు. వెలుతురు గిట్టదు. యువతులకు వచ్చు కంటి మసగలకు, హ్రస్వదృష్టికి పనిచేస్తుంది. దీపపు కాంతి చుట్టునా రంగు వలయాలు; కళ్ళు పడగనివ్వడు.

21. 'సల్ఫర్'కు గల నాసికా లక్షణములేమి ?

తరచుపొడిపడిశభారంతో బాధపడుతాడు. ముక్కు వెంట నిర్నిమిత్తంగా రక్తంపడుతుంది. ముక్కుఆరి పక్కులుకడుతాయి. ముక్కులు దిబ్బడవేస్తాయి. ముక్కులు దురద, ఒరుపు, మంట. పండిన పడిశవాసనకొడుతూవుంటుంది ముక్కుముందర. వాసన తెలియదు; ముక్కుపై ఎండుగజ్జి.

22. "సల్ఫర్" నివారణచేయు చెవి ఋగ్మతలేవి ?

చెవిలోపోటు. చెముడు. చెవి దురద, ఒరుపు. చెవినుండి చీము. ఎడమచెవి పోటు, ఎరుపు. చెవిలో రకరకాల ధ్వనులు

పురుతూ క్రమంగా వినికిడిజ్ఞానం నశిస్తుంది. సల్ఫరులో వ్యాధులు మధ్యచెవికి సంబంధించి వుంటాయి.

23. నోరు, గొంతుగలలోకలుగు ఏలక్షణాలు 'సల్ఫరు' సూచికములు?

పళ్ళు కదుల్తుంటాయి. పనుకుదుళ్ళయందలికండ సిథిలమై రక్తం స్రవిస్తూమంటగావుంటుంది. నాలుక, నోరు దుర్వాసన. ఫాలిం తల నాలుకప్రాతకిది దివ్యౌషధము. పెదిమలు ఎఱ్ఱగా దొండపండులా ఉంటాయి. రక్తంచిమ్ముతూ ప్రత్యేకం ఏదో ఒకపంటినుండి అదురు పుడుతుంది. నాలుక తెల్లగానుండి కొన, అంచులు ఎఱ్ఱగావుంటాయి. గొంతుకలో వెంట్రుకవున్నట్లు భావం; దానిచే యేమియుతోచకుండా పోతుంది.

24. ఉదరవ్యాధులలో "సల్ఫరు"ను సూచించు లక్షణాలేమి ?

ఉదయం నోరుచేదు; వాసనలతోకూడిన త్రేన్పులు. కొద్దిగా తిన్నా కడుపునిండినట్లుంటుంది. ఉదయం 11 గంటలకు కడుపులో వెలితిగావున్నట్లుంటుంది. ఆకలిగాఉండి ఆసమయంలో ఏదైనా తిన వలసివస్తుంది. తీపియందు హితవు; తింటే పడదు. పుల్లత్రేన్పులు, గుండెలోమంట. రాత్రిళ్ళు ఆకలేస్తుంది; లేచిఏమైనాతినాలి; లేకుంటే నిద్రపట్టదు. అతిదాహం. ఆహారంరుచి ఉప్పగావుంటుంది. (కార్బో-వెజ్; చైనా; సిపియా) కడుపులోమంట, లోని అవయవాలుపచ్చిగా, తీపుగా వుంటాయి. కడుపులో జీవజంతువేదో కదులుతున్నట్లుంటుంది (క్రోకస్, సెబడిల్లా, తూజా).

25. "సల్ఫరు"కుగల అతిసార లక్షణములేమి ?

ఉదయాన్ని బాధలేకుండా విరోచనాలు అవుతాయి. పక్క-నుండి లేవడానికికూడ వ్యవధివుండదు. (రుమేక్సు, బాధతో ఉదయం

విరోచినాలు-ఎలోస్). తరచు విరోచినంతంగు మారుతూవుంటుంది. అజీర్తి విరోచినాలు. భుజించిన ఆహారం అరగక విరోచనం తుక్కు తుక్కులా అవుతుంది. రోగిని పక్కనుండి విరోచనమే లేవదీస్తుంది. రోగికి చాలసేపటివరకూ మలంవాసన కొడుతూనేవుంటుంది. ఆసనం పచ్చిగా, ఒరిసి వుంటుంది.

26. "సల్ఫరు"చే కుదర్చబడు మూత్రలక్షణములేవి ?

తరచు మూత్రం ఉబ్బుకొనివస్తుంది. మూత్రవిసర్జన సమయంలో మూత్రవాహినిలో మంట, ఒరుపు.

27. 'సల్ఫర్' చే కుదరు ప్రధానమగు చర్మవ్యాధులేవి ?

"సల్ఫరు"కు చర్మవ్యాధులు, అంతర్గత ఋగ్మతలు సాధారణంగా ఒకటివిడచి మరొకటి అంకురించుచుండును. అన్ని చర్మవ్యాధులు కడగినచో ప్రకోపించును. కురుపును ఎంతఎక్కువగా గోకితే అంతయెక్కువగా దురద, మంట హెచ్చుతాయి. చర్మము గరిగా, పెళుసుగావుండి, ఆట్లమ్మపొక్కులవంటి గుండ్రని చిడుముపుడుతుంది. చర్మముయొక్క ముడతలలో ఒరిసి పచ్చిగావుంటుంది. "సల్ఫరు"రోగియొక్క చర్మము త్వరితముగా చీముపట్టి రసికాచుచుండును. సూది గుచ్చుకొన్నను పుండులా తయారవుతుంది (హిపార్-సల్ఫ).

28. ఒకపుటకు మించకుండా "సల్ఫరు" యొక్క ప్రధానలక్షణములను వ్రాయుము.

ఇది ఏంటిసోరిక్ మందులలో అగ్రగణ్యమైనది. పెక్కు సోరా వ్యాధులను నివారించగల అత్యుత్తమమగుమందు. ఒక్క-చిక్కి-మరికి ఓడుతూ, వాసనకొట్టుకుంటూవున్న చర్మవ్యాధులతో నిరంతరం బాధపడేవారికి వాడనగు లోతైనమందు.

నఖసిఖపర్యంతం చిడుము, దురద, తెరిపిలేకుండా బరకాలి; బరికితే మంట. ఒళ్ళుమంటలు స్థానికంగాను, యావత్తుశరీరానికికూడ వుంటాయి. ముఖ్యంగా పాదాలుమంటచే పైకి చల్లతనానికి పక్క తప్పించిపెట్టాలి. నవరంధ్రాలు ఎఱ్ఱగా రక్తంచిమ్ముతున్నట్లుంటాయి.

నీరసంగాను, నిస్సత్తువగాను వుంటాడు. నంటినుండి శగలు, పొగలు లేస్తాయి. పగలు 11 గంటలకు చమట్లు, నిస్త్రాణ. కడుపులో కాలితిగా ఉన్నట్లు గాబారా–ఆకలి. ఆకడుపులోదడ, ఆసమయంలో తింటేనేగాని తగ్గదు. పిల్లలు స్నానమంటే ఏడుస్తారు. శరీరం తోమ నివ్వరు. కొన్ని స్థానికభాగాలలో రక్తంపేరుకొనుట యిందలిప్రత్యేక లక్షణం. గుండెలోనొప్పి వెనుకకు వీపులోకి పోతుంది.

చిడుము, కురుపులు, గజ్జి యీ మొదలగు చర్మవ్యాధులు మందుల పై పూతలవలన అణచిపెట్టుటచే కలిగే అనర్థకాలకు,వ్యాధులకు దివ్యమగుమందు. అట్టివారికి 'సల్ఫరు' యిస్తే వ్యాధిచర్మగతమై అంతరంగికముగా ఆరోగ్యం చేకూరుతుంది.

దీని స్రావాలన్నియు ఒరుపు, మంటకలుగజేస్తాయి. ముఖ్యంగా రాత్రివేళ ఊపిరాడక ఉక్కిరిబిక్కిరై తలుపులు, కిటికీలు తెరచి ఉంచుతాడు చల్లగాలి నిమిత్తం.

తెల్లారకుండగానే విరోచనాలు పక్కనుండి లేపుతాయి. బాధ ఏమాత్రంకూడవుండదు. ప్రేగులు నిస్సత్తువుచే తమలోచేరినమలాన్ని నిలుపుకొనుటకు శక్తిహీనమై విసర్జననిమిత్తము తొందరచేస్తాయి.

నడినెత్తినివేడి, పాదాలుచల్లన, తరచు శరీరంనుండి శగలు లేవడం.

ఈరోగి నిలబడివుండలేడు; నిలబడ్డానికి చాలకష్టపడుతాడు. అతిజాగ్రత్తగాపెంచిన సాయూహ్వోషధం పనిచేయనప్పుడు "సల్ఫరు"

వాడాలి. రోగిలో చైతన్యాన్ని కలుగజేసి మందులు పనిచేయుటకుగల అవరోధాలను నివారిస్తుంది. రోగి నివారణకు సహకరిస్తుంది.

నెలసరి త్వరితముగాను, ఎక్కువగాను, చాలకాలమువరకు విడువకుండాను నాన్పుడుగా అవుతుంది. గతసారి గర్భస్రావంఅయినది మొదలు బట్టఅవడంతగ్గక రోగి కోలుకోనకపోతే "అమావాస్యనాడు ఒక్కమోతాదు సల్ఫరుయిస్తే సంపూర్ణారోగ్యం చేకూరుతుంది". (లిప్పీ)

కురుపులు : తట్లలా శరీరంలో అక్కడక్కడ పలుతావుల్లో బయలుదేరుతాయి. కురుపుమానితే తిరిగి పక్కనే కొత్తకురుపులేస్తుంది. సుఖంకలిగించేకలలు; కూనిరాగాలు తీసుకుంటూ నిద్రనుండి లేస్తారు. నాలుక తెల్లగా పాచితోవుంటుంది; కొనమాత్రంఎరుపు. ఆకలి అమితం. తిండితినడంతక్కువ, నీళ్ళుత్రాగడం ఎక్కువ. తీపి తిండంహితవు; కాని తింటేపడదు. పాలు. మాంసంఅంటే వెలపరం, అహితవు. కడుపులో పిండమున్నట్లు కదలిక. అతిసారం. మలబద్ధం; ఒకటివిడచి మరొకటి.

సంభోగానంతరం మూత్రవాహినిలో మంట, చురుకు. వారానికిగాని, రెండు వారాలకుగాని ఒకసారి వచ్చే తలనొప్పికి వాడాలి. పురుషాంగములు పట్లుతప్పి, పుంసత్వం బిగిచెడి చల్లగా ఉంటాయి. చైతన్యం వుండదు. కోడి కునుకు; ఆ కునుకులోకూడ అతి వాగుడు; స్నానం చేసినా, ఉదయం 11 గంటలకు, వేడిగానుండు గదిలోను, పాలు త్రాగుటచేతను వ్యాధి లక్షణాలు హెచ్చుతాయి. కదిలినా, కుడితట్టున పరున్నా, చల్లనిగాలిలోవున్నా బాధలు తగ్గును.

"కాల్కేరియా-కార్బ్"ను 'సల్ఫరు'నకు ముందుగా ఎన్నడును వాడరాదు.

సాధారణంగా కాలిక వ్యాధులలో యీ క్రింది వరుసలలో వాడాలి.

"సల్ఫర్, కాల్కేరియా-కార్బ, లైకోపోడియం"

'సల్ఫర్, సారసపరిల్లా, సెపియా'.

చింపిరి గుడ్డలు, మాసిన గడ్డం, మురికికారే శరీరం కలిగి దగ్గరకుపోతే పాడుకంపుకొట్టే స్వార్థపరుడు "సల్ఫర్" రోగి. నూతన విషయాలను పరిశోధించగల మేధావి. కాని తనకుగాని, లోకానికిగాని ఏ మాత్రంకూడ వుపయోగపడని మెట్టవేదాంతి 'సల్ఫర్' రోగి.

## 134. సల్ఫ్యూరిక్-యాసిడ్ (Sulphuric - Acid)

(వంటి - సోరిక్)

1. 'సల్ఫ్యూరిక్-యాసిడ్'కు గల ప్రధాన సూచక లక్షణములేమి ?

అంతర్గతమగు దీని ప్రధాన సూచకలక్షణము. ఇది స్వకీయ లక్షణము (Subjective symptom). అనగా యీ వణకు రోగికిమాత్రమే తెలుస్తుంది, కాని యీ వణకు పై వారికి గోచరించదు. 'సల్ఫ్యూరిక్-యాసిడ్'లో నరముల నిస్సత్తువచే లోలోపలనే వణకు వుడుతుంది.

2. "సల్ఫ్యూరిక్ – యాసిడ్'చే కలిగే అరడజను భావాలను (Sensations) ను పేర్కొనుము.

(1) పైకి కనుపించని అంతర్గత వణకు, శరీరమందు అన్ని అవయవములు వణకుతున్నట్లు భావము.

(2) మెదడు వదులుగానుండి నుదురులోపల ఇటు – అటు దొరలుచున్నట్లు భావన.

(3) పుర్రెలోనికి ఒక గసిగ దిగగొట్టినట్లు భావన.

(4) ముఖముపై కోడి గ్రుడ్డులోని తెల్లని సొన పూసినట్లు భావన.

(5) ఉదరం జవజవలాడుచూ వ్రేలాడుచున్నట్లు భావన.

(6) మలవిసర్జనం తరువాత ఉదరం దించుకుపోతున్నట్లు భావం.

3. పిల్లలకుగల ఎట్టి జబ్బుతలకు 'సల్ఫ్యూరిక్-యాసిడ్' వాడాలి ?

పిల్లలు చిక్కిపోవుటకు, నాలుక పూతలకు దివ్యమగు మందు. అజీర్ణంచే త్రాగినపాలు, తినిన అన్నం అరక్క పులుపెక్కి పుల్లని వాంతులు అవుతాయి. వాంతులు మాత్రమేకాక పిల్లలను ఎంతగా తోమి స్నానము చేయించినను పుల్లని వాసన కొడుతుంటారు. నోరు పూసి, అనుగుదల నశించి పిల్లలు రోజురోజు చిక్కిపోతారు.

4. 'సల్ఫ్యూరిక్-యాసిడ్'కుగల మానసికలక్షణములేమి ?

మానసికంగాను, శరీరకంగాను నీరసం, నిస్సత్తువ, దడ. అందుచే అమితంగా విచారం; విరామంలేని ఏడుపు. ఎంత ఓదార్చినా ఊరుకోరు. చిన్న విషయాలలోకూడ విసుగు, కోపం, త్వరితంగా ఆహారం తీసుకోలేరు; పనిలోకూడ మాంద్యతే. ఇతరులు ఎంత ఉపచారం చేసినా ఈ రోగికి తృప్తి అనేది వుండదు. ఈరోగి నోటిమాట బైట పడేసరికి అట్లా చేసెయ్యాలి, లేకుంటే కోపం. ఈరోగికి జవాబు చెప్పడానికి మనస్కరించదు.

5. సల్ఫ్యూరిక్-యాసిడ్ వాడనగు గొంతులక్షణములేమి ?

గొంతుగయొక్క అమత్వచ ఒరుస్తుంది. గొంతుగలో తెల్లని పొరలా వుంటుంది. చూడ్డానికి గొంతుగలో వెల్ల వేసినట్లుంటుంది.

కొండనాలుక నీటిబుగ్గలా వుంటుంది. గొంతుగలో పాకి పెద్దదైపోయే వుండు. గొంతుగ నొప్పి, గుటక వేస్తే ప్రాణంపోయే బాధ. తాగిన వన్నీ ముక్కులోనుండి బైటకొస్తాయి. తరచుగా పులమారుతుంది.

6. సల్ఫ్యూరిక్-యాసిడ్‌కు సంబంధించిన ఇతరలక్షణములేమి ?

బ్రాంది తాగాలని, పళ్ళు తినాలని ఉంటుంది రోగికి. కాఫీ వాసన గిట్టదు. కాలికంగా గుండెల్లో మంటగా వుంటుంది. పులితేన్పులు, పుల్లని వాంతులు, ఉదరం చల్లగానుండి ఒడిలి వేళ్ళాడుతూ వుంటుంది. చల్లని నీరు తాగినవెంటనే వమనమవుతుంది. విరోచనాలు అయినవెంటనే నీరసం, నిస్త్రాణ; ఒకటే వణకు. విరోచనం మంట, ఒరుపు. ఆసనమంతా మండుతుంది. ఒరిసి బాధగా వుంటుంది. తిండిలో ఏమాత్రం వ్యత్యాసం వచ్చినా విరోచనాలు అవుతాయి. ముఖ్యంగా కాయలు, పండ్లు తింటే విపరీతంగా విరోచనాలు అవుతాయి.

7. ఏఏ స్త్రీరుగ్మతలకు "సల్ఫ్యూరిక్ యాసిడ్" పనిచేస్తుంది ?

నిర్ణీతసమయానికి ముందుగానే ఋతువు స్రవించడం ప్రారంభించి అమితంగా అవుతుంది. స్రావం పలుచగా ఎక్కువరంగుగా అవుతుంది. బహిష్టుకు ముందుగాను, తరువాత "నయిటుమేరు" అనగా నిద్రలో కంగారుగా కెరి కేకలు పెడుతుంది.

కుసుమ పాలలా తెల్లగాఅవుతుంది. ఆస్రావం తగిలినచోటల్లా ఒరుస్తుంది. ఒకప్పుడు కోడిగుడ్డుయొక్క తెల్లని సొనలాఉంటుంది. యోనిలో విపరీతమురద అమితఋతుస్రావంతో కూడిన వంధ్యత్వాన్ని నివారిస్తుంది. స్త్రీలకు ముట్లుడిగేకాలంలో సంభవించేవ్యాధులకు దివ్యౌషధము. ఒళ్ళంతా సెగలు పొగలు రావడం. నీరసం, నిస్సత్తువ.

ఒణికిపోతున్నట్లుభావం. వేగిరపాటు. నిదానం కొంచెంకూడాలేకుండా ఒడిదుడుకుగా పనులుచెయ్యడం. రక్తస్రావం. మలబద్ధం. విరోచనం అయ్యేటప్పుడు కునికిపాట్లు. ఈలాటి పెక్కులక్షణాలు స్త్రీల ఆర్తవ కాలంలోవుంటే 'సల్ఫ్యూరిక్-యాసిడ్' నిరుపమానమగుమందు.

8. పది పంక్తులలో 'సల్ఫ్యూరిక్-యాసిడ్' కలుగజేయు సాధారణ లక్షణములను తెల్పుము.

మితిలేని తొందరపాటు. నిదానం లవలేశంకూడావుండదు. అన్ని పనులూ అనుకున్నది తడవుగా కావాలి (అర్జంటం-నిట్రు). నొప్పి నింపాదిగా క్రమంగా హెచ్చి ఆకస్మాత్తుగా అంతవిపరీతపునొప్పియు తగ్గిపోతుంది. ఈలా నొప్పితరచువస్తుంది (పల్సు). దీనిబాధలు మొద్దు పనిముట్టుతో నొక్కుచున్నట్లుంటుంది. వృద్ధులకు ఏమాత్రం దెబ్బ తగిలినా వుండయి నలుపెక్కి ఏనాటికిమానదు. పిల్లవానిని ఎంతతోమినా పులుసువాసనకొడుతూనేవుంటాడు. (హిపార్, మెగ్నీషియాకార్బ్, రిహూం)

ముఖంపై కోడిగుడ్డుసొనవ్రాస్తే ఆరిపోయినప్పటివలె బిరబిరలాడుతూవుంటుంది. కపాలంలో మెదడువదులై కదలుచున్నట్లుభావం.

నోటిపూత : పెదవులు, నాలుక, దవుడలు, నోరు యావత్తూ పూస్తాయి. పనుయిగుళ్లనుండి రక్తస్రావం, పళ్ళువిపరీతంగాబాధ; నోరుదుర్వాసన; ఏమియుతినలేడు. తుదకు జావకూడా త్రాగలేనిస్థితి; గుండెల్లోమంట. వులితేన్పులు, పళ్ళుకూడ పులుపెక్కుతాయి, పైకి కనుపించని అంతరంగిక ఒణుకు, దడ.

రక్తంపేరుకొని, కదుములుకట్టి నల్లనిమచ్చలవుతాయి. అలాటి నల్లమచ్చలను యీమందు మాపేస్తుంది. ఎర్రగాకంది దురదలున్నప్పుడు దీనినివాడాలి, నవద్వారాలనుండి నల్లనిరక్తం స్రవిస్తుంది.

దెబ్బతగులుటచేతగాని, ఎత్తునుండి పడిపోవుటచేతగాని, మెద మునుతగిలేదెబ్బలకు. మస్తిష్క ఘాతకాలకు దివ్యమగు మందు. మెడ యొక్క కుడివెంపున పెద్దకురుపు లేలుతుంది (కెంటు). ఒళ్ళు చలువలు కమ్ముతాయి. ఒకవంతు 'సల్ఫ్యూరిక్ యాసిడ్'ను 3 వంతులు ఆల్క హాలులో కలిపి రోజుకు మూడుసార్లు 15 చుక్కలు పుచ్చుకొన్నచో తాగుడుయందు భ్రాంతిపోతుంది (హెర్రింగు).

వ్రాత వ్రాయునప్పుడు వేళ్ళు అదురుతాయి. ఎక్కిళ్ళు. కాఫీవాసన గిట్టదు.

స్త్రీలకు ముట్లుడుగుకాలంలో ఒంటినుండి శగలు, పొగలు (ఎమిల్, గ్రాఫైటిస్, సెపియా).

తినినతరువాత, నిద్రపోయేటప్పుడు, ముట్లు ఉడిగిపోయే సమయంలోను, వ్యాధిలక్షణాలు హెచ్చుతాయి.

బాధగలవైపు తిరిగిపరున్నప్పుడు, వెచ్చనిపానీయాలు సేవించుట చేతను, చేతులు తలతట్టుపెట్టుటవల్లనూ బాధలుతగ్గుతాయి. దెబ్బలు తగిలినప్పుడు 'ఆర్నికా' వల్లనయంకాకపోతే ఇది పనిచేస్తుంది.

## 135. సింఫేటం (Symphatum)

1. 'సింఫేటం'నుగూర్చియు దాని సాధారణలక్షణములను గూర్చియు వ్రాయుము.

దీనిని సాధారణంగా 'కంప్రె-నిట్ బోన్' అని పిలుస్తారు. దీని వేళ్ళయందు స్ఫటికాకారముగ ఒక పదార్థముండును, అది తెగిన భాగములు త్వరితముగా మా ంప ఉపకరించును. ఉదరములోను,

ప్రేగులలోను పుట్టెడిపుండ్లను పోనార్చుటకు లోనికి వాడనగును. జఠరశూలలు నివారించును. ఆసనము ఉలారముగానుండిన దీనిని పైకి వ్రాయవలయును.

చిరియెముకలు, నాళ్లు, పెద్దఎముకలపై పొరలకు దెబ్బలుతగిలి, విరిగినా, చిట్లినా దీనిని వాడాలి. కీళ్ళలోని బాధలకు బాగుగా పని చేయును. మోకాలులోపుట్టు, తీపు, పోటు లను నివారించును.

పెద్దయెముకలనంటిన పుండ్లుపడినప్పుడు. ఎముకలు విరిగి తిరిగి త్వరితముగా అతుకుకొననప్పుడు, శస్త్రచికిత్సలో కాళ్ళుకొట్టివేయుటచే కలుగు పుండుమాననప్పుడు, శల్యగతమగుపుండ్లు, కురుపులు, పెద్దఎముకలందలి ఆటు-పోటునకు బాగుగాపనిచేయును.

2. "సింఫేటం" కంటికి ఎప్పుడు మందు ?

కంటిపై దెబ్బలుతగిలినప్పుడు, కంటిలోఏదైనా గుచ్చుకొని నప్పుడు, కంటిపై గుద్దినప్పుడు, ఘాతకములచే కళ్లు అదిరినప్పుడు దీనికి సాటివచ్చుమందు లేదు.

కంటిగుడ్డుకు ఏదైనా దెబ్బతగిలినప్పుడు, అదురుతగిలినప్పుడు, కంటిపై గుద్దినప్పుడు బాగుగాపనిచేయును. పసిపాపలు కేరింతాలు కొట్టునప్పుడు శిశువు తల్లికంటిపై పిడికిడితో గ్రుద్దినప్పుడు వాచి తీపు పుట్టినచో దీనినిమించు మందు లేదు (గుడ్డుచుట్టునగల కండరము దెబ్బ తిన్నచో ఆర్నికా).

3. "సింఫేటం"యొక్క సాధారణ నైసర్గికలక్షణములేమి ?

ఎముకలు విరిగినప్పుడు వెంటనే ప్రారంభించివిడువకుండాతరచు వాడనగుమందు (కాల్కేరియా-ఫాస్). విరిగిన ఎముకలు త్వరితముగా అతుగుకొననప్పుడు ఇదిచేయుపని అద్వితీయము. విరిగినఎముకలను

అతుగుటకు, గుచ్చుచున్నట్లుండు ఎముకలయందలి నొప్పులుపోగొట్టు టకు 'కేలస్సు'ను తయారుచేయుటలోను 'సింఫేటం'ను మించినమందు వేరొకటి లేదు.

ఎముక విరిగినచోట ఆటు, పోటు (హైపరికం)కు ఉపకరిస్తుంది. గుద్దుటవలన కన్ను, కనుగుడ్డులలో కలుగువాపు, ఆటు, పోటులకు పని చేయును.

పెద్దఎముకలను కొట్టివేసినప్పుడు వాడదగుమందు. శల్యగతమగు కురుపులకు పెట్టింది పేరు. దవుడఎముకవాచి కలిగించునొప్పిని, బాధను, తగ్గించును.

ముచికలగుంటలో బాధ, మోకాలునొప్పి, మున్నితమగు ఎము కలకు, నరములకు, నాడులకు దెబ్బలుతగిలినప్పుడు కలుగు పోటు-ఆటు లనుతగ్గించును. ముంగాలి పెద్దఎముకకు దెబ్బతగిలినప్పుడు 'ఆర్నికా' వాడినతరువాత దీని అగత్యముకలుగును.

## 136. సిఫిలినం (Syphilinum)

### (Nosode) నోసోడ్.

1. 'సిఫిలినం' యొక్క సాధారణ ప్రభావమేమి ?

సవాయివ్యాధి కారణమగు సవాయిపుండుయందలి రసి, చీము నుండి తయారుకాబడిన ఒకమందు. ఇట్లు వ్యాధికారకములనుండి తయారుకాబడిన ఔషధములను 'నోసోడ్సు' అంటారు.

సవాయివ్యాధి సకాలములో నివారణయగుటకు శాస్త్రయుక్త మగు మందుతీసికొనక పైపూతలతోను, పట్టీలతోను, తాత్కాలిక

ఫలితములనిచ్చు సూదిపోట్లతోను వ్యాధిని అణచిపెట్టుటచే చర్మగత మగువ్యాధి అంతర్ముఖమై పెక్కు భయంకరవ్యాధులకు మూలమగు టయేగాక వంశానుక్రమమై బిడ్డ తదనంతరం ఈ పాపఫలితమును అనుభవించు తత్వమును సవాయితత్వము లేక సిఫిలిటిక్ తత్వము అని అంటారు.

ఇట్లు సవాయివ్యాధిని అణచిపెట్టుటచే కలిగే పెక్కు బుగ్మతలకు ముఖ్యంగా గొంతుగ, చర్మములకు సంబంధించు పెక్కు కాలిక వ్యాధులకు పనిచేయు ఔషధరాజము "సిఫిలినం." ఉదయమున అమితమగు నిస్త్రాణ, నీరసము, నిస్సత్తువ, ఒకకీలునుండి మరొకకీలుకు తరచుగామారు కీళ్ళవాతము. సూర్యాస్తమయములో ప్రారంభించి తిరిగి సూర్యోదయమయ్యేవరకు ఉండునొప్పులకు 'సిఫిలినం' దివ్యమగుమందు దీనిబాధలు క్రమముగా హెచ్చి క్రమముగానే తగ్గును. నోటియందు, ముక్కుయందు, మర్మావయవములందు, చర్మముపైననూ పుండ్లు ఒకదానివెనుక మరొకటిపుట్టే శగగెడ్డలు. వెంట్రుకలూడిపోతాయి. సీతకాలమందు సీతగాలికి, వేసవికాలమందలి వేడికి ప్రకోపించు వ్యాధులను నివారించు మందు 'సిఫిలినం'.

"సవాయి" వ్యాధిసోకిన రెండు మూడు వారాలలో అంగముపై పొక్కులేచి క్రమముగా విశాలమగు మొత్తపర్పడి దానిపై పుండు కూడ వృద్ధిచెందుతుంది. దీనివలన విపరీతమగు పోటు, బాధ కలిగి దానినుండి క్రమముగా చీము, రసి స్రవిస్తుంది. దీనివలన రోగిపడే బాధ వర్ణనాతీతము. ఈపుండు ఈలాచర్మగతమై యుండునంతకాలము రోగి తత్వములో మార్పేమియుగలుగదు. కాని ఈ సవాయిపుండును పైపూతలతోను, కట్లతోను, ఇంజక్షనులతోను అణగారచేసే యెడల వ్యాధి అంతర్గతమై వేళ్ళుబారి దానివత్తిడిచే అవయవాలు నిర్మా

లింపబడుతాయి. ఎముకలు, గ్రంధులు, అమత్వచలు, నాళ్లు, నరాలు రక్తం మొదలుగాగల పెక్కు శరీరభాగాల్లో వినాశనకరమగు చెప్పలేనన్ని పరిణామాలకు దారితీస్తుంది. ఈలాటి వ్యాధులను వ్యక్తపరిచే తత్వాలను "సిఫిలిటిక్" తత్వాలు అంటారు. అట్టి తత్వసంభంధమగు వ్యాధులను ఎదుర్కొనగలమందు "సిఫిలినం".

2. 'సిఫిలినం'కుగల మానసిక లక్షణములేమి ?

జ్ఞాపకశక్తి నశిస్తుంది. తనవ్యాధికి పూర్వంజరిగిన విషయాలన్నీ జ్ఞప్తికివస్తాయి, ముఖాలు, పేర్లు, తేదీలు, విషయాలు, స్థలాలు, పుస్తకముల పేర్లు, మరచిపోతాడు. జ్ఞాపకముఉండవు. ఏమాత్రం గణితం కూడ కట్టలేడు. తనవ్యాధి కుదరదనేనిరాశ. స్నేహితులయెడల నిర్లక్ష్యం. పనిచేయుటకుకూడ హెచ్చరికగాని, వికాసంగాని ఉండదు. రాత్రిపడుతోందంటే భయం. మాటలు, చేతలు మొరటుగాఉంటాయి. మానవత్వమును కోల్పోయి సవబు, సందర్భాలు లేకుండా తనకు తోచినదానిని చేసితీరుతాడు.

3. "సిఫిలినం" వాడనగు సిరోలక్షణములేమి ?

విపరీతమగు తలపోటు. ఒక కణతనుండి వేరొక కణతకు, ఒక చెవినుండి వేరొక చెవికి, ఒక కంటినుండి వెనుక ముచ్చిలిగుంటకు పొడిచేపోట్లను నివారిస్తుంది. 'సిఫిలినం' తలనొప్పి ఒక కణతనుండి వేరొక కణతకు పొడుస్తూ మధ్యగా నడినెత్తికి పొడుస్తూ తల్లక్రిందులుగా 'T' అనే అక్షరాన్ని పోలివుంటుంది బాధ. తలనొప్పి సాయంకాలం 4 గంటలకు ప్రారంభించి క్రమముగా అర్ధరాత్రి వేళకు విపరీతంగా హెచ్చి క్రమంగా సూర్యోదయానికి తగ్గుతుంది.

4. "సిఫిలినం" నివారించు కంటి ఋగ్మతలేమి ?

కంటి కండరాలకు పాక్షికవాతం పోడచూపుట యీ మందు కొక లక్షణం. మెల్లచూపు, ద్వంద్వదృష్టి అంటే ఒకవస్తువు రెండుగా కనుపిస్తుంది. దృష్టినాడి క్షీణిస్తుంది. హ్రస్వదృష్టి - దగ్గరచూపు. కండ్లకలక, కంటిలో పుండు, ఎడమ కంట్లో కుక్కగొడుగు (Fungus) వంటి మొలకలు. రాత్రికాలం భరించ శక్యంగానంత అమిత బాధ. విపరీతమగు కంటికలక; ఆటు, పోటు; రెప్పలువాపు; కంటివెంట నీరు. వెలుతురును చూడలేరు. ఒక వస్తువుక్రింద మరొక వస్తువు వున్నట్లు గోచరిస్తుంది.

5. ముక్కుకు వచ్చు ఎట్టి ఋగ్మతలకు 'సిఫిలినం' వాడాలి ?

ముక్కునుండి పసుపు లేక ఆకుపచ్చని స్రావం. ఈ స్రావం భరించరాని వాసన. సవాయివంశ చరిత్రగల పిల్లలయొక్క నాసికా సంబంధమగు ఋగ్మతలకు ముఖ్యముగా పనిచేయును. నాసికా శల్యములు సిథిలమై ముక్కు తప్పడైనప్పుడు వాడనగుమందు. ముక్కులో కొయికండలు. ముక్కులో పుండై ముక్కు సిథిలమగుటకు వాడనగును.

6. "సిఫిలినం" పనిచేయగల ముఖకవళికలేమి?

ముఖములో పోట్లు; ముఖములో ఒకవైపు పాక్షికవాతము. ముఖముపై రాగిరంగు మచ్చలు, మొటిమలు, గడ్డముపై సవాయి పొక్కులు లేస్తాయి. పెదవులు పగిలి పుళ్ళు పడుతాయి. పెదవులపైనను, ముక్కు కోణాలపైనను స వా యి సంబంధమగు పుండ్లు లేస్తాయి. ముక్కుయొక్క ఒక భాగం పుండయి తినేస్తుంది.

7. స్త్రీల ఏయే రుగ్మతలకు 'సిఫిలినం' వాడాలి ?

గర్భాశయ ముఖద్వారమందు పుండు. యోనిలో పుట్టు కణుపులవంటి మొలకలను నివారించును. పసుపు, ఆకుపచ్చ మిశ్రమ ఛాయలో విపరీతమగు కుసుమ వెడలుటకు "సిఫిలినం" అత్యుత్తమమగు మందు. కుసుమస్రావము మోకాళ్ళవెంట స్రవిస్తూ కట్టుబట్టలను తడుపునంత అమితముగా నుండును (ఎల్యూమినం). సంభోగ సమయములో పురుషుని వీర్యం స్ఖలించేటప్పుడు పిండాశయములో విపరీతమగు కోతబాధ. ఋతుసమయానికి పూర్వము గొంతుగ బొంగురుపోతుంది.

8. 'సిఫిలినం' యొక్క ప్రధాననైసర్గిక లక్షణములను వ్రాయుము.

సూర్యాస్తమయంనుంచి సూర్యోదయం వరకు నొప్పులు, బాధలు బాధిస్తాయి. బాధలు క్రమంగా హెచ్చి క్రమంగా తగ్గుతాయి; బాధలు ఒకచోటనుండి వేరొకచోటకు మారుతాయి. రోగలక్షణాలన్ని రాత్రిళ్ళు ప్రకోపిస్తాయి. కురుపులు, మొటిమలు – రాగిరంగు మచ్చలు – తడిపితే ఊదాగా మారుతాయి.

శరీరం యావత్తూ కృశిస్తుంది. (ఎబ్రాటినం, అయిడీన్). గుండెలలో పోటు వెనుకకు పొడుస్తుంది; ముఖ్యంగా రాత్రి ఉద్రేకిస్తుంది. జ్ఞాపకశక్తి లోపిస్తుంది. ఊరు పేర్లు, మనిషి పేర్లు, పుస్తకముల పేర్లు జ్ఞప్తికిరావు, గణితమంటే తలనొప్పి; ఉదయం లేచేసరికల్లా నీరసం, నిస్సత్తువ. అమితంగా స్రవించే కుసుమ – కాళ్ళవెంట స్రవిస్తూ కట్టుగుడ్డలను తడుపుతుంది. తలనొప్పి ఒక కణతనుండి రెండో కణతకు పొడుస్తుంది. నొప్పివలన నిద్ర పట్టదు. తల వెంట్రుకలు ఊడిపోతాయి.

కండ్లకలక, రెప్పల వాపు, నిద్రలో కళ్ళు అంటుకుంటాయి. రాత్రి విపరీతమగు పోటు. చల్లని నీటితో కడిగితే బాధ తగ్గుతుంది.

ద్వయదృష్టి – వస్తువుక్రింద మరొకవస్తువు ఉన్నట్లు కనుపిస్తుంది. పళ్ళ చిగుళ్ళలోని భాగములు సిధిలమవుతాయి. వేళ్ళ తరబడి మలబద్ధం. ఆసనము దుర్మాంసముతో పూడిపోయినట్లనుపిస్తుంది. ఎనీమా చేసే సమయంలో, గర్భవేదన సమయంలో పడేటంత బాధపడుతాడు. ఆస నం, ఆసనకండరం చిట్లుతాయి. ఆసనకండరం జారుతుంది.

భుజముల కీళ్ళలో నొప్పులు; చేతులు నిలువుగా ఎత్తలేడు. సమశీతోష్ణకాలో రాత్రి బాధ హెచ్చు. కురుపులు, శగగెడ్డలు, ఒకటి తగ్గితే మరొకటి వేస్తాయి. "సిఫిలినం" రోగి తరచు చేతులు కడుగుతాడు.

# 137. టేరెంట్యులా క్యుబెన్సిస్
## (Tarantula – Cubensis)

1. "టేరెంట్యులా క్యుబెన్సిస్" అననేమి ?

ఇది "అరబిమిడా" అనగా సాలీడు జాతికి చెందిన ఒక మందు. దీనిని సాధారణముగా "క్యుబాస్" సాలీడు అంటారు. ముదురు బూడిద రంగు వర్ణముగల క్యూబా దేశపు పెద్దరకపు సాలీడు.

2. సారూప్య వైద్యమునందు వాడుకలోగల కొన్ని సాలీడుకు సంబంధించిన మందులను తెలుపుము.

1. టేరెంట్యులా క్యుబెన్సిస్ – రోమములతోనుండు క్యుబా దేశపు సాలీడు.

2. టేరెంట్యులా (హిస్పానికా) ఇది స్పెయిన్ దేశపు సాలీడు. బ్రతికివున్న సాలీడుతోనే యీ మందును తయారుచేయుదురు.

3. మైగేల్ : క్యూబాదేశపు నల్లటి సాలిపురుగు.

4. తెరిడియాన్ : వెస్టు - ఇండీసుకు చెందిన నారింజ రంగు. సాలీడు.

5. ఆస్నియాపైడేమా : మధ్యవరగణాలు ముఖ్యంగా కెంటుకీ, టెనస్సీలకు చెందిన చార్లుగల సాలీడు.

6. ఆర్నీసి నెన్షియా : తెల్ల సాలిపురుగు.

3. సాలిపురుగు విషముయొక్క సాధారణ నైసర్గిక లక్షణములను గూర్చి తెలుపుము.

సాలిపురుగు కుడితే సాధారణంగా ఒళ్లు చల్లబడ్డం, బాధలు విడచి, విడచి ఒకేకాలంలో రావడం ఉంటుంది. దీనివని రెండువిధాలుగా ఉంటుంది. ప్రథమంగా రక్తం విషపూరితమవడం, ద్వితీయంగా నరసంబంధమగు నిస్సత్తువ. విస్తారంగా నాడీసంబంధమగు వ్యాధులు సంభవిస్తాయి. ముఖ్యంగా బెట్టువాతం (Choree) అపస్మారము (Hysteria) మొదలగువ్యాధులు అంకురిస్తాయి.

ఆదుర్దా, ఆరాటం, వణకు, ఆందోళన, నరాల నిస్సత్తువా మొదలగులక్షణాలు ముఖ్యంగా దీని విషంవలన పుడుతాయి. పాఠకుల మనస్సుకు పట్టేందుకు ఒక స్వీయానుభవమును వ్రాస్తున్నాను.

1942 సం॥రం మే నెలలో ఎండమండిపోయే మిట్ట మధ్యాహ్నం 2 గంటలకు ఒక షావుకారువచ్చి తన పద్ధెనిమిదిమాసాల పిల్లవాని శరీరమంతా ఒణికిపోతోందని, కిండి ఉండి మూత్రిని వెక్కిరించునట్లు తిప్పుతున్నాడని, చేతులో ఉండడంలేదని ఖంగారుగా చెబుతూ ఒక్క మారువచ్చి చూడమని సన్నక్రోవాడు. ఒక గంటక్రితమే భోజనంచేసి పరుండుటచే బద్ధకంగాఉండి ఒ గంటలో వచ్చిచూస్తాను నీవు వెళ్ళిపో

అని చెప్పి పడుకున్నారు. పది నిమిషాలకల్లా వాళ్ళ అబ్బాయి వచ్చి శిశువు చల్లబడిపోతున్నాడు, ఇంట్లో కంగారుపడుతున్నారు, వెంటనే డాక్టరుగారిని తీసుకురమ్మని పంపించారని వాకిట్లో నాకోసం కూర్చున్న తండ్రితో చెప్పాడు. ఆ సాహుకారు కంగారుపడుతూ నన్ను వెంటనే రమ్మని ప్రాధేయపడ్డాడు. "మీ యింట్లో అంతా నిర్లక్ష్యం. కాగేపాలపై మూత ఉంచాలని ఎన్నోసార్లు చెప్పాను. పాలల్లో ఏ సాలీడో పడి ఉంటుంద"ని చెబుతూ ఆ మందుపెట్టెలో పడి ఆ సాహుకారు వెంట రోగిని చూడ్డానికి వెళ్లాను. వెళుతూనే పాలగిన్నె తెమ్మని చూడగా అడుగున తెల్లకట్లకొండి సాలీడు ముద్దఅయి ఉంది. ఆ సాహుకారు పిల్లను చంపేశారు అంటూ ఆడవారిపై విరుచుకుపడ్డాడు. శిశువుకుగల అప్పటి లక్షణాలనుబట్టి "మైగేల్" 30వ పొటెన్సీలో ఆ మూతి కొంకర్లు వణుకు పోయేదాకా అరగంట, అరగంటకు అయిదుసార్లు వాడమని యిచ్చాను. క్రమంగా మరునాటి ఉదయానికి శిశువు తెప్పరిల్లింది.

4. "టెరెంట్యులా క్యూబెన్సిస్" చేయు సాధారణ కృషిఏమి?

1. అసలైన రాచకురుపును (Carbuncle) పుట్టించును. రాచకురుపుపై దీని ప్రభావము అద్వితీయము.

2. ఇందలి వాపులు నీలిరంగుగానుండి అగ్గిమంటలతో భరించరాని పోటుగా వుంటుంది. అమితముగా నిస్త్రాణ.

3. మరణవేదనను నివారిస్తుంది. తుది ఘడియలలో యిది ఒక మోతాదు యిస్తే బాధలేకుండా మరణిస్తాడు.

4. జననేంద్రియములందలి ఉబ్బరమును రూపుమాపుతుంది.

5. గజ్జలయందలి గ్రంథుల వాపుతో కూడిన 'ప్లేగు' వ్యాధిని నివారిస్తుంది. ఆ వ్యాధి దండయాత్రకాలంలో నివారణ ఔషధంగా పని చేస్తుంది.

6. రక్తదోషాలకు, విష యుక్తతలకు పెట్టింది పేరు.

5. రాచపుండులో 'పేరెంట్యులా - క్యూబెన్సిస్' వాడే లక్షణాలేమి ?

అమితముగా నిస్త్రాణ; అతిసార విరోచనాలు. జ్వరం విడచి విడచి వస్తూ సాయంకాలం తీవ్రమౌతున్నప్పుడు దీన్ని వాడాలి. అగిడి మంటలూ, పోటు; బాధ భరించరానిదిగానున్నప్పుడు వాడాలి. 'పెరెంట్యులా – క్యూబెన్సిస్' అప్పుడు యిచ్చే చేయు మేలు అసమానమైనది, మరువరానిది.

6. "పేరెంట్యులా - క్యూబెన్సిస్" కలుగజేయు సాధారణ లక్షణము లేమి ?

అన్ని విషమస్థితులలోను కలుగు నీరస, నిస్త్రాణలకు వాడనగు అమూల్యమగు మందు. (ఆర్స్, పైరోజన్, బేప్టీషియా, లెకసిస్, కాలీ ఫాస్) రోగగ్రస్తమగు తావులు నీలివర్ణంలో ఉండి అగ్గిడిమంటలు, భరించరానిపోట్లు - కుట్టుచున్నట్లుంటాయి పోట్లు. రాత్రిళ్ళు తరబడి గోకుచుట్టువల్ల పోటు, మంటచే స్థిమితము లేక రోగి యిల్లు కలియ తిరుగుతాడు.

అసలైన రాచపుండు, ముచికలగుంటలోపుట్టి ఆటు, పోటు, అగిడిమంటలతో అల్లాడిపోతూ నీరసం, నిస్త్రాణలతో సొమ్మసిల్లి పోతాడు రోగి

గజ్జలలో అడ్డగ్రలు (Buboes) ఉబ్బి, కమిలి, ఊదావర్ణంలో ఉండి చాల కాలంగా రసిఓడుతూ మానకుండా వుంటాయి. (కార్బో ఏనిమలిస్; లెకెసిస్). అగిడిమంటలు భరించరాని బాధ.

మర్మావయవములలో ఉలారం (క్రోటన్–టిగ్; గ్రఫైటిస్; పెట్రోలియం) గ్రంథుల వాపుతో కూడిన 'ప్లేగు' రోగి శీఘ్రంగా

నిస్త్రాణ చెందుతాడు. (ఆర్స్, ఫాస్ఫరస్, ఎగ్నీషియా, లెకెసిస్, ఓపి యం. రూస్-టాక్స్). మూత్రం బిగబడుతుంది.

అన్నహితవు పోతుంది; కాని ఉదయాన్నే చద్దిఅన్నంతింటాడు. ఎక్కిళ్ళు.

మరణవేదన పాలుగాకుండా నివారించు నిరుపమానమగు మందు. దగ్గుచే నిద్దురపట్టదు. చుట్ట కాలిస్తే ఉపశమనంగా వుంటుంది. వ్యాధిలక్షణాలన్నీ రాత్రివేళ ప్రకోపిస్తాయి.

## 138. టేరెంట్యులా - హిస్పానియా (Tarentula Hispania)

1. "టేరెంట్యులా-హిస్పానియా" అననేమి ?

ఇది స్పెయిన్ దేశమందలి సాలిపురుగు విషము. రోమములుగల పెద్ద విషపూరిత సాలెపురుగు. ఇది ఉష్ణప్రాంతమందు ముఖ్యముగా దక్షిణ అమెరికాలో ఇవి విస్తారముగానుండును. జీవముతో గల పురుగును సమూలమునుండి యీ మందును తయారుచేయుదురు. ఇందలి లక్షణములన్నియు ఇది కుట్టుటచే కలుగు లక్షణములనుండి సేకరింపబడినవి.

2. 'టేరెంట్యులా - హిస్పానికా' కుట్టు విషముచేకలుగు లక్షణములేమి ?

కుట్టినతావులో కంది, ఉబ్బి ఊదాగామారి పరిసర గ్రంథులు వాచును. నల్లని పేరిన రక్తము ముక్కునుండి స్రవించును. అట్టి రక్త

స్రావము బాధలను తగ్గించును; రక్తము సిరస్సుకువిస్తారము పొందుచు చుండుటచే కణతలలో ధనాకించును. ముఖముపాలి బూడిదవర్ణముగా నుండును. గుటక వేయుట కష్టమగును. మంట, విదాహం; ఎంత నీరు త్రాగినా తృప్తివుండదు. మలం నల్లగానుండి వాసన గుబాళిస్తుంది. మూత్రి విసర్జన కష్టముగా అగును. నరాల దుర్బలత్వం. అపస్మారం (Hysteria). తరచు చేతులు ఆడిస్తూవుంటుంది. మాధుర్యమగు సంగీతం విపరీతమగు ఉద్రేకహేతువు. అమితంగా ఆరాటం; నిమిత్తంలేని గాబరా.

3. విడచి విడచి వచ్చే మన్యంజ్వరంలో 'పేరెంట్యులా-హెస్పానికా' ను నిరూపించే లక్షణాలేమి ?

మన్యం జ్వరాలలో అవయవాలకు స్థిమితం వుండదు. ఎముకలతో సహా నొప్పిగా వుంటాయి. కుడుతోన్నట్టు పోట్లు. ఆరాటం, గాబరా. సాధారణంగా జ్వరం సాయంకాలం అంకురించి తెల్లవార్లు కాచిపోస్తుంది. ఇందలి వింతలక్షణమొకటుంది. చమటలు మాత్రము పొయ్యవు. ఇది దీని ప్రత్యేకత.

4. "పేరెంట్యులా - హెస్పానికా"ను నిరూపింపనగు అపస్మారలక్షణములేమి ?

నిద్రలో లేచిపోయి నడుస్తుంది; అమితకోపం; రోషం; శృంగార చేష్టలు; మన్మధ బాధలు; సంగీతంచే ఉద్రేకం. అలసటొచ్చి సొమ్మసిల్లి కింద పడిపోయేవరకు పాడుతుంది. నక్కజిత్తులు, విధ్వంసకాండ. ప్రశ్నకు జవాబుండదు; పలకదు. ఉలకదు. ఉద్రేకంతో పాడుతుంది. నృత్యం చేస్తుంది. తుదకు ఏడుస్తుంది. దెయ్యాలను, భూతాలను, విషజంతువులను, క్రిములను చూస్తుంది. రోగాన్ని నటిస్తుంది. శోష

పోతుంది; సొమ్మసిల్లి పడిపోతుంది. ఎవరూ చూడకపోతే ఆమెకు అపస్మారమేరాదు. ఎవరేనా చూస్తేనే వస్తుంది రోగం. చూచామూ ఆమె కొంకర్లు పోతుంది. రోగులులేని రోగమన్నట్లు నటిస్తారు. రోగం వుందనికూడా భావిస్తారు. ముఖ్యంగా ముదురు ఆకుపచ్చ, ఎరుపు, నలుపురంగులను ఈ రోగులు చూడకూడదు. జుట్టు పీక్కుంటుంది; తల బాదుకొంటుంది. పిచ్చిలో తన్ను తాను బాదుకుంటుంది. తన్ను కాచి యున్న దాసదాసీజనాన్ని బాదుతుంది. మిత్రులను, బంధువులను బాదుతుంది, కొడుతుంది. విపరీతమగు రాక్షసకృత్యాలు చేయుట యీ మందుకు నైజం, కట్టు బట్టలు చింపుకుంటుంది. ఓదారిస్తే "ఘొల్లుఘొల్లు"న ఏడుస్తుంది. తనమాట కాదంటే వస్తుంది తాడి ప్రమాణం కోపం. దానితో ప్రళయతాండవం చేస్తుంది "టెరెంటులా-హెస్పానికా" రోగి.

5. మలబద్ధంలో "టెరెంట్యులా-హెస్పానికా"కు సూచక లక్షణాలేమి?

ఇందు మలబద్ధంలో భయావహమైన బాధ. విసుగులేకుండా యిటు - అటు కలియత్రొక్కుతాడు. స్థిమితం ఉండదు. ఆందోళన. తలగడపై తలతో రుద్దుతూ ఇటు - అటు దొర్లుతాడు. విరోచనాను మానం వుండదు. ఆసనంలో పోటు, మంట తీపు. పొట్టలో విపరీతమగు పోట్లు. కష్టంమీదగాని మలవిసర్జన కాదు.

6. ఎట్టి హృద్రోగములకు "టెరెంట్యులా-హెస్పానియా" వాడాలి?

గుండె దడ, నాడి వక్రగతిగా వుంటుంది. గుండెలలో దడ, వణుకు, ధ్వనులు వుంటాయి. గుండెలలో అమితంగా ఆరాటం, ఆందోళన; దానితో గుండెదడ. భయంవేసి గుండె నిలచిపోయేటట్లు వుంటుంది; రోగికి అంతులేని చల్లగాలి కావాలి. గుండె తిరుగబడినట్లు, నలిగిపోయినట్లు, పిసుక్కుపోతున్నట్లు ఉంటుంది. గుండెనొప్పి.

7. "బెలెంట్యూలా - హిస్పానియా" యొక్క సాధారణమైన లక్షణాలు ఏమి ?

అమితమగు గాభరా; ఆరాటం; గుండెలలో గాభరా. రంగులను చూస్తే భయం, సిగ్గుభిడియాలుండవు. పారిపోవాలని వుంటుంది. ఆడాలని, క్రిందకు పైకి గెంతాలని వుంటుంది. సంగీతమంటే ఉద్రేకం.

కాలు, చెయ్యి, నడుం. మెడలను సర్వదా కదుపుతూ వుంటుంది. ఒక్క క్షణంకూడా వాటిని స్థిమితంగా వుంచదు - వుంచ లేదు. మాంసం ఊడి పడిపోతోందా అన్నట్లుంటుంది, ఇందలి చిక్కడం చూస్తే. ఆరుబయట వుంటేను, ఒళ్ళు పడితేను బాధలు తగ్గుతాయి. మంటలు దీని ప్రత్యేక స్వాభావికలక్షణం. ఆసనం, పాదాలు, అరికాళ్ళు మంట, గర్భాశయం మంట.

నిద్రలో లేచి నడుస్తాడు. (కాలి - బ్రో). నక్కజిత్తులు; ఘాతకుడు, శృంగార చేష్టలు, మదనతాపం, మన్మధబాధలు, ఉద్రేకం; పిచ్చిలో భయానక కృత్యాలు. ఉద్రేకంవస్తే ఆటలు, పాటలు, గెంతడం, తుదకు ఏడవడం. రోగమున్నట్లు నటన. ఎవరేనాచూస్తే రోగం వస్తుంది; చూడకపోతే రోగమే వుండదు. అంతానటనే. ఓదారిస్తే ఏడుస్తుంది. తన మాట కాదంటే కోపం. తరచుగా తల అదురుతుంది. విసుగులేకుండా తల అటు - యిటు త్రిప్పుతుంది.

కుడి కన్ను మసగ, పోటు, దురద, ఇసుక పడ్డట్టు బాధ. కుడి కన్ను, కుడిచెవి, కుడిమూత్రపిండం, గొంతుగ కుడిభాగం రోగగ్రస్తమై బాధకరంగా వుంటాయి.

భీతావహమగు మలబద్ధం. మలం ఊడిపడడానికి బ్రహ్మ ప్రళయమవుతుంది. మూత్రంలో నుసరు వుంటుంది.

స్త్రీ పురుషుల యిరువురకుకూడ అమిత సంభోగేచ్ఛ. అమిత మగు కామోద్రేకం.

కెలసరి త్వరగాను, విస్తారంగాను అవుతుంది. చేతులెత్తితే గుండెలలో భారం. గుండె బాధచే ఎడమతట్టు పడుకోలేడు. భయం వేసినవానివలె గుండె ఆగి ఆగి కొట్టుకుంటుంది. కురుపులు, వ్రణాలు, రాచపుళ్లు – వీపుమీద రెండు భుజాలమధ్యను పుడుతాయి.

నీరసం, నిస్సత్తువ, తిమ్మిరలు, ఆరాటం – యివి సర్వదా రోగిని ఆశ్రయించి వుంటాయి.

ఎడమవైపు పైభాగంలోను, కుడివైపు క్రింది భాగంలోను తిమ్మిర్లు (కెంటు). తాడలు కట్టిపెట్టినట్లు బాధ, పోటు; కుడిచెయ్యి, ఎడమకాలుకు పాక్షికవాతం; పట్లు తప్పుతాయి.

రాత్రిళ్లు విపరీతంగా దగ్గు. చుట్టకాలిస్తే తగ్గుతుంది. (కెంటు). వేలు మునుకొనలు అతిసున్నితంగా వుంటాయి (ఏలెన్).

కదిలినా, చప్పుడైనా, ఋతుకాలంలోను రోగలక్షణాలు ప్రకోపించి పాడినా, ఒళ్ళు మర్దనా చేసినా, చుట్టకాల్చినా లక్షణాలు శాంతిస్తాయి.

ఆర్సు దీనికి సహచరి.

## 139. టెరిబింతినా (Terebinthina)

1. 'టెరిబింతిన' ప్రయోగమువలన సాధారణముగా కలుగు మార్పు లేమి ?

అనుత్వచలమునకు అందు ముఖ్యముగా మూత్రవాహిని నుండి రక్తమును స్రవింపజేయును. మూత్రలక్షణములు, పొట్ట ఉబ్బుట

(Tympanites) ముఖ్యంగా గమనించవలసిన మార్పులు. మూత్రపిండములు వాచి రక్తస్రావమగును. రక్తము నల్లగా దుర్వాసన వేయుచు పొగచూరినట్లు బ్రాంఖైరంగులో వుంటుంది, మూత్రంలో శ్వేతధాతువు (Albumen) పోతుంది. శరీరం నీరుపడుతుంది. మగత, కొన్ని సమయాలలో మూత్రనాళహీని మూసుకుపోతుంది. 'కోమా' మగత. చితకకుండా వుండు చలిపొక్కులు. దీని ప్రభావం ముఖ్యంగా మూత్రపిండాలపైన, మూత్రకోశాలపైన ఉండును. నాలుక ఎరుపుగా, నునుపుగా మెరుస్తూ వుంటుంది.

2. "టెరిబింతినా"కు మూత్రకోశ సంబంధమగు లక్షణములు ఏమి?

మూత్రపిండముల స్థావరము నొప్పి; పిండములలో మంట. మూత్రపిండములనుండి మూత్రకోశమునకు వెడలు నాడులగుండా నొప్పి. మూత్రవిసర్జన కాలంలో మంట. మూత్రము బిగబట్టి వెడలును. మూత్రములో శ్వేతధాతువులుండును. మూత్రము నల్లగా పొగ చూరినట్లు రక్తముతో కూడియుండును. "కేంథారిస్, కోపైవా, సైలీసియం"లందలి మూత్రమువలెనే ఉదారంగు పుష్పవాసన వేయుచుండును. తేమ ప్రదేశమందు చిరకాలముండుటచే మూత్రావయవములు చెడి, వాచి అందుండి రక్తము చెముర్చును. ఈ మూత్రి లక్షణములున్నచో బుగ్మతయొక్క పేరుతో నిమిత్తం లేకుండా యీ మందు అద్భుతముగా నివారించును.

3. మూత్రలక్షణములలో 'టెరిబింతినా'కు సహాయ్యమగు యితర మందులు ఏవి?

"కేంథారిస్, కేనబిస్ - సటీవా, బెరిబెరిస్" ఈ నాలుగు ఔషధములు 'ఆల్బ్యూమినేరియా' శ్వేతధాతువర్జియము నందలి ప్రథమావస్థలో పనిచేసి శరీరమందలి శ్వేతధాతువును మూత్రముగుండా

అగుటను అష్టగించును. కొనువాతపరలో 'మెర్క్యురి' వాడాలి. ఇందు "కేంథరిస్. కెనబిస్ – సటివా"ల వలె మూత్రము పడుతుంది. విసర్జన సమయంలో 'బెరిబెరిస్'కు మంట వుండదు

4. రక్తస్రావంలో "టెరిబింథినా" వాడే లక్షణములు ఏమి?

రక్తస్రావాలను అదుపుచేయుటలో నిరుపమానమగు మందు. మూత్రంతో రక్తం స్రవిస్తుంది (Haematuria). ఉమ్మిలో రక్తముపడుతుంది (Haemoptysis). ప్రేగులనుంచి రక్తం స్రవిస్తుంది. ముఖ్యంగా సన్నిపాత జ్వరాల్లో ఇవే రక్తస్రావాన్ని అరికట్టడంలో ఎన్నదగిన మందు. ముఖ్యంగా నాలుక నున్నగా, ఎఱ్ఱగా, మెరుస్తూ ఉండడం గమనించాలి. ఇది యీ మందుకు స్వాభావిక గుర్తింపు లక్షణం (క్రొటాలస్, పైరొజన్). పొట్ట డోలులా వుబ్బి ఉండడం దీనికి మరొక ప్రముఖలక్షణం (Tympanites).

ఈ పై రెండులక్షణాలు సాధారణంగా సన్నిపాత (Typhoid) జ్వరాలలో ఉంటాయి. అలా వున్నప్పుడు "టెరిబింథినా" వాడితే అద్భుతంగా పనిచేసి రోగాన్ని మళ్ళిస్తుంది (నేష్).

5. 'టెరిబింథినా' సంబంధమగు క్రిమి లక్షణాలు ఏమి?

క్రిములకు స్థానభ్రష్టత్వం కలుగచేస్తుంది. "టెరిబింథినా" రాత్రులందు పిల్లలు ఉలిక్కిపడి లేస్తారు. ముక్కు రంధ్రాలలో దురదచే వ్రేళ్ళుపెట్టి కెలుక్కుంటారు, నిద్రలో పళ్ళు కొరుకుతారు; తలగడపై ఇలు, అటు వాస్తారు. పొడిదగ్గు, క్రిమిసంబంధమగు యిలాంటి లక్షణాలుంటే 'టెరిబింథినా'ను వాడినచో క్రిములను పోగొట్టుటేగాక వాటికి స్థానమును లేకుండచేసి వీటివలన కలుగు కొంకర్లను, ఈడ్పులను రాకుండజేయును.

పెద్దవారికి నోటి దుర్వాసన, ఆసనం దురద క్రిములవలన కలిగినచో 'పెరిబింతినా' వాడాలి. ఈ లక్షణాలకు మూలమగు క్రిములను పోగొట్టి స్వస్థతను చేకూరుస్తుంది.

6. 'పెరిబింతినా'ను వాడదగు నాలుక లక్షణములు ఏమి ?

నాలుక నునుపుగా మెరుస్తూ ఎఱ్ఱగావుండి, నాలుకపై 'పేపిలీ' అనగా సన్నని మొటిమలవలె అనుపిస్తుంది. (పైరోజన్) అక్కడక్కడ నాలుకపై పొర ఊడిపోయి బాధ.

7. ఎట్టి ఉదరవ్యాధులకు 'పెరిబింతినా' వాడాలి ?

పొట్ట విపరీతంగా ఉబ్బుతుంది. విరోచనాలు ఆకుపచ్చగా, నీళ్ళలా రక్తంకలిసి దుర్వాసనతో అవుతాయి. గాలి పోయేముందు పొట్టలో పోట్లుగావుండి మలవిసర్జనానంతరము తగ్గుతాయి. క్రిములు:- అన్నిరకముల క్రిములను పోగొట్టుటేకాకుండా ఇక పుట్టుటకు స్థావరం లేకుండా చేస్తుంది. ప్రేగులలోనుండి అయే రక్తస్రావాన్ని తగ్గించుటలో దీన్ని ముందు చెప్పాలి. జలోదరం విరోచనానంతరం నిస్త్రాణ. సోమ రావడం కలదు. కలరా విరోచనాలకు, దానిలో అయే రక్తస్రావాలకు నిరుపమానమగు మందు.

8. "పెరిబింతినా"కు గల సాధారణ లక్షణములేమి ?

మూత్రం పోసేటప్పుడు మంట. మూత్రం పొగచూరినట్లు నల్లగాను, ఎర్రగాను, బూడిదరంగుగాను అవుతుంది. నాలుక నున్నగా ఎఱ్ఱగా ప్రకాశవంతముగా ఉంటుంది. నవద్వారాల నుండి రక్తస్రావాలు. ముఖ్యంగా మూత్రపిండాలు, మూత్రాశయం చెడుటవలన సంభవిస్తుంది. మూత్రం ఒకవిధమగు ఊదాపుష్పాల (Violets)

వాసన కొడుతుంది. పొట్ట అమితంగా ఉబ్బి, డోలులా వుంటుంది. తాకనివ్వడు (కోల్చికం).

విరోచనాలు ఆకుపచ్చగా నీటివలె రక్తమిశ్రమంగా వుంటాయి. ఆసనం మంట, విరోచనానంతరం రోగి సొమ్మపోతాడు.

క్రిములు : నోరు వాసన; ముక్కు దురద. పాచిపళ్ళు. ఈ లక్షణాలున్నప్పుడు క్రిమి నివారణమునకు దివ్యమగు మందు.

మూత్రంలో రక్తం. మూత్రంలో కాఫీపొడి లాంటి గసి. మూత్రం పొగమాదిరిగ్గుంటుంది. శ్వేతధాతు వర్జనమునకు పెట్టింది పేరు. మూత్రకోశం, మూత్రపిండాలు, ప్రేగులు, ఊపిరితిత్తులు, గర్భాశయం ఇవి వాచినప్పుడు అందుండి రక్తము స్రవించినప్పుడు వాడాలి. మూత్రపిండాలు చెడి ఒంటికి నీరు చూపినప్పుడు వాడేమందు 'టెరిబింతినా'. తేమ నేలలో నివసించుటచే రక్తయుక్తమగు మూత్రములో విపరీతంగా శ్వేతధాతువు పోతుంది.

మూత్రద్వారం, మూత్రపిండాలు, మూత్రకోశాలలో విపరీతముగా మంట, పోటు.

ప్రేగులలో పుండ్లువడి. ప్రేగులనుండి రక్తము స్రవిస్తుంది. మూత్రద్వారం మూతపడడం మూత్రం విడచి విడచి వెళ్ళుటకు, ఆగిపోవుటకు దివ్యౌషధం. తరచు మూత్రానుమానం; నిద్రలో మూత్రం విసర్జించడం.

నాలుక పూత, అసహ్యమగు తేన్పులు. ఛాతీలో ఎదురు ఎముక పొడుగునా మంట (ఫాస్ఫరస్).

మన్యం జ్వరం రాకుండా ఆపుతుంది. దీని ద్రావకం ఒకచుక్క ఆముదంలో వేసి పడితే ప్రేగులలోని క్రిములు చచ్చిపడుతాయి. తేమ

వలనా, సీతలంచేత మూత్రం విసర్జించేటప్పుడు ఇందలి బాధలన్నియు ప్రకోపిస్తాయి. కదలినా నడుస్తున్నా ఉపశమిస్తాయి.

## 140. తూజా (Thuja)

1. తూజా అనగానేమి ?

తూజాను "Tree of life" జీవితవృక్షంఅని పిలుస్తారు. తూజా "కోనిఫరు" లేక "పైన్సు" అనే కుటుంబానికి చెందింది. గ్రీసు దేశములో సుగంధముగల ఈచెట్టు బెరడును దేవతావిగ్రహములకు ధూపము వేయుదురు. హిందువులకు "తులసి" చెట్టులా గ్రీసు దేసీయులకు "తూజా" చాల పవిత్రమగు చెట్టు. దేవతా కార్యములలో భక్తిపూర్వకముగా దీనిని ఉపయోగింతురు. ఇది చాల అందమగుచెట్టు. సుగంధాన్ని వెదజల్లుతుంది. దీనిద్రావకము హారతికర్పూరము, కర్పూర తైలముల వాసన గుబాళిస్తుంది.

హానిమన్ మహాశయులు 'తూజా' యొక్క అమోఘలక్షణాలను గ్రహించి లోకమునకు వెల్లడించిన మహోపకారి. శరీరమునుండి జంతువిషమును తొలగించుటకు 'తూజా' నిరుపమానమగుమందు. టీకాలువేయుటచేకలుగు దుర్గుణములకు, శగవ్యాధిజీర్ణించుటచేవచ్చు అనర్థకములకు 'తూజా' నిరుపమానమగుమందు. సైకోటిక్ తత్వములను ఎదుర్కొను మకుటాయమానమగుమందు. ఒక్కొక్కమియాజం కొన్నికొన్నిరకములవ్యాధులకు స్థావరాన్ని కల్పిస్తుంది. శగవ్యాధిని తాత్కాలికపుమందులవలన అణగారజేయుటవలన ఆవ్యాధిగ్రవేళ్ళు బారి పెక్కు అవయవముల విధులనిర్వహణమునకు అవరోధములు కలుగ

జేయుటచేగాని అవయవముల రూపములో మార్పు తెచ్చిగాని పెక్కు రుగ్మతలకు తోడ్పడియును.

[ఈ గ్రంథకర్త పెక్కుసంవత్సరములనుండి ఫైలేరియాజ్వరము వచ్చుటకుగల హేతువునుగూర్చియు, రోగనివారణ విధానమును గూర్చియు పరిశోధనజరుపుచున్నారు. సైకోటిక్ తత్త్వముగలవారు మాత్రము యీవ్యాధికి గురియగుదురని ఒక నిర్ణయమునకువచ్చి మానవులయందలి యీతత్త్వమును రూపుమాపినచో యీవ్యాధిపోవుననియు అంకురించుటకూడ జరుగదనియు వీరి అభిప్రాయము. ఫైలేరియా ప్రాంతమందు నివసించువారి శరీరములోని యీమియాజమును పూర్తిగా తొలగించిన అట్టివారు యీవ్యాధిబారినుండి రక్షింపబడుదురు. ఈతత్త్వమును తొలగించుటెట్లు? అనునదే ప్రస్తుతసమస్య. దీనినిగూర్చి యింతవరకు జరిపినపరిశోధననుగూర్చి కేంద్రప్రభుత్వ ఆరోగ్యశాఖకు ఒకవ్యాసముగా పంపియున్నారు ప్రస్తుతము ప్రభుత్వపర్యవేక్షణమున కృషిజరుగుచున్నదని తెలుపుచున్నాము. ఈవైద్యవిధానమును వ్రాయునప్పుడు దీని విషయమును సాకల్యముగా విశదీకరింపబడును.]

2. అదిని "తూజా" కనుగొనుట యెట్లు జరిగెనో వ్రాయుము ?

ఒకయువకుడగు విద్యార్థి ఒకనాటిసాయంకాలము హానిమన్ మహాశయులయొద్దకువచ్చి తనకుగల మూత్రవ్యాధినిగూర్చి సంప్రతించెను. మూత్రముపోయునపుడు మంట; మూత్రవాహినినుండి జిగటతో కూడిన స్రావము. మూత్రావయవముయొక్క ముందు భాగము నీటిబుగ్గవలెవాపు; దురదతో కూడిన నూకలకూడువంటి మొటిమలు. ఈలక్షణములను పరిశీలించి ఆవిద్యార్థికి శగవ్యాధితగిలినట్లు హానిమన్‌గారు ఆరోపించిరేగాని ఆవిద్యార్థిమాత్రము ఆ ఆరోపణ

మును అంగీకరించలేదు. వానికెట్టిమందునూయివ్వక మూడురోజుల తరువాత మరల కనుపించమని విద్యార్థిని పంపివేసిరి. మూడు రోజుల తరువాత విద్యార్థి బాధలన్నియుతగ్గిపోవుటనుగమనించి హానిమన్ మహాశయులు చకితులైరి. ఆవిద్యార్థి తాను కొన్నిరోజులక్రితము ఒక తోటలో తిరుగుచుండగా ఒక అందమగుచెట్టుయొక్క ఆకులు మంచి సువాసనవేయుచుండుటచే వానిని నమిలిమ్రింగితిననియు ఆ తరువాత ఒకటి రెండురోజులకు యీబాధ సంభవించినదనియు తెలిపెను. హానిమన్‌గారు ఆ ఆకులను సంగ్రహించి పరిశోధనలను జరిపిరి. అదియే "థూజా". అప్పుడు దాని అమూల్యమగు వుపయోగము లోకమునకు వెల్లడించిరి.

3. థూజాయొక్క మూలికావిషయములు ఎచ్చట చూడనగును ?

హానిమన్ రచించిన "మెటీరియా మెడికాప్యూరా"లోను, మెటకాఫ్‌గారి సారూపృప్రూవింగ్సులోను, ఉత్తరఅమెరికా హోమియోపతి జర్నల్ వాల్యూం 25 లోను థూజాయొక్కసంగ్రహప్రూవింగ్స్ చూడనగును.

4. 'థూజా' యొక్క నాడీమండల లక్షణములలోని వింతలుఏమి ?

రోగిలో నిర్దిష్టమగు కొన్ని మనోభావాలుంటాయి, ముఖ్యంగా ఒక అపరిచితవ్యక్తి తన ప్రక్కనఉన్నట్లు, శరీరము ఆత్మ విడిపోయినట్లు, తనశరీరం ముఖ్యంగా అవయవాలన్నీ గాజుతో తయారుకాబడినట్లు ఏమాత్రం అజాగ్రత్తగానున్నా అవి పగిలిపోగలవని, తనపొట్టలో యేదో ఒక జీవజంతువు కదలుచున్నదని, తానొకమహాశక్తియొక్క స్వాధీనములోనున్నానని మొదలగు వింత విపరీతభావాలు కలుగుతుంటాయి.

పిచ్చిలో స్త్రీలు ఎవ్వరినీ తన సమీపానికి రానివ్వరు. తన్ను తాకనివ్వరు. కారణం తాను గాజుతో తయారయ్యాననే భావము వలన ఎవరైనా తాకితే పగిలిపోతానని భీతి (నేష్). మధురమగు గానం వింటే కాళ్ళనొప్పులు వస్తవి.

5. తూజా యొక్క ప్రధానమగు సాధారణ ప్రభావమేమి ?

చర్మముపైనను, మూత్రావయవములపైననూ దీని ప్రధాన ప్రాభవము గోచరించును. ఇది పిటియూటరి ప్రకోపచలనమును కలిగించి అందలి స్రావములలో మార్పును కలిగించును. శరీరముపై మొటిమలు, పులిపిరికాయలు, కాలిఫ్లవర్ లాటి మొలకలుపుట్టుట సంభవించును.

6. తూజా పనిచేయు ప్రత్యేక స్థానమేమి ?

శరీరములో జంతువిషము ప్రవేశించియున్నప్పుడు తూజా చేయు పని నిరుపమానము. పాము, ఎలుక, పిల్లి యీ మొదలగు విషజంతువులు ఏనాడో కాటు వేసి దాని బాధలేవియు కనుపించక వింత విపరీత వ్యాధులచే బాధపడుచున్న రోగి చరిత్రను శ్రద్ధతో గమనించి తూజా నిచ్చిన ఆ విషప్రాబల్యము క్షీణించి రోగికి స్వస్థత చేకూరును.

టీకాలు వేసినతరువాత వచ్చే వ్యాధులకు యిది దివ్యమగు మందు. ముఖ్యంగా టీకాలు వేసినతరువాత అయ్యే అతిసార విరోచనాలకు దీని వుపయోగము అత్యంతము.

[గ్రంథకర్త సైలీషియాను వ్రాయునప్పుడు టీకాలు వేసిన అనంతరం కలిగిన అతిసారవిరోచనములు తూజాతో ఏవిధముగా నివారణచేసినది తమ స్వీయానుభవమున వెల్లడించియున్నారు.]

7. డా॥ బోనింగుహాసన్‌గారికి తమ రోగియొక్క ప్రాణరక్షణకు సహాయపడిన తూజాయొక్క వింతలక్షణమేమి ?

సాధారణముగా ఏరోగికైనను లేక ఏమందుకైనను బట్టకప్పి యుంటే చమటపట్టుట సహజం. కాని 'తూజా' రోగికి బట్టకప్పని భాగములకు చమటపట్టుట సహజం. యిది దీని ప్రత్యేక అసహజ లక్షణం.

8. టీకాలువేయుటచే కలుగు దుర్లక్షణాలను నివారించుటకు వాడు 2 ముఖ్యమగు మందులను వ్రాసి అవి వాడదగిన సమయములు వ్రాయుము.

1. సైలీషియా. 2. తూజా.

టీకాలపొక్కులు లోతుగానుండి, అతిసారవిరోచనములు, విపరీతమగు జ్వరము ఉన్నప్పుడు వాడనగు దివ్యౌషధము "తూజా". యిది యీలక్షణముకే అనగా గుంటలు లోతుగాపడు స్వభావముండుటచే డా॥ బోనింగుహాజన్‌గారు మసూచికములో వాడనగుమందు అని సూచించిరి. కుండలు పగిలి రసి ఓడునపుడు తూజా ఒకమోతాదు మసూచికములో రోగికియిచ్చిన గుంటలుపడక మచ్చలు ఏర్పడక త్వరితముగా మానును.

సైలీషియా : టీకాలువేయుటచేకలుగు పైలక్షణములకు గాక శేషించిన లక్షణములన్నిటికి పనిచేయును.

[వైద్యవిధానము వాడుకనప్పుడు టీకాలువేయుటచే కలుగు పెక్కింటి రుగ్మతలు వాటిని సైలీషియా తూజా మొదలగు మందుల

చేత ఎట్లు నివారించినదియు పెక్కుమంది వైద్యుల అనుభవములను వివరించుటకు ప్రయత్నింతును.]

9. "హైడ్రోజినాయిడ్" తత్త్వమనగానేమి ? ఆతత్త్వమునుండి ముక్తి కలిగించు మందులేవి ?

ప్రపంచమంతా ప్రఖ్యాతిజెందియుండిన సుప్రసిద్ధ సారూప్యవైద్యులు డా॥ గ్రిమగాల్ మహాశయులుచే యీతత్త్వము నిరూపింపబడినది. కోశములన్నిటిలోను విస్తారము జలముచేరు తత్త్వము కలవారిని "హైడ్రోజినాయిడ్" తత్త్వమువారని నిర్వచించిరి. అట్టిరోగులు తేమ వలనను, వర్షములో తడియుటచేతను రోగలక్షణములన్నియు ప్రకోపించి పెక్కుబాధలకు లోనగుదురు. వీరికి నీరు యేరూపములోను పడదు. ఇట్టివారిలో సెగరోగము (Gonorrhoea)నకు సంబంధించువిషయము విపరీతపరిణామాలకు త్రోవతీయును అని వీరు సెలవిచ్చియున్నారు.

"తూజా" నేట్రంసల్ఫ్, తెన్నియాడయాడినం"లు ప్రధానమగు హైడ్రోజినాయిడ్ తత్త్వములుకల మందులు.

10. మెడోరినంగల మానసికలక్షణములేమి ?

ఈరోగికి తొందరఎక్కువ. నిదానమే ఉండదు; తొందరగా మాట్లాడుతాడు; విసురుగా నడుస్తాడు; విసుగు, కోపం తొందరగా వస్తాయి.

తాను గాజుతయారని, చాలపెళుసుగా ఉన్నానని, యీహేతువుచే విరిగిపోతానేమోఅనే భీతిచే కదలడానికి వప్పుకోడు. అందరికంటే తాను రెట్టింపు. మూడురెట్లు వున్నానని తాను ముక్కలై నలువెంపులా పడిపోయానని యేదో వింతభ్రాంతిలోపడి ఊహించు

గుంటాడు. తాను పగిలిపోతాననే భయమేకాని గాజుముక్కలా మెరుస్తున్నాననే తలంపుఉండదు. థూజారోగికి అల్పవిషయాలకుకూడ విపరీతంగా కోపంవస్తుంది.

11. థూజాకుగల నరాలబాధ, ప్రత్యేకమైన సిరోలక్షణాలు ఏమి?

చిన్న చిన్న ప్రత్యేకభాగాలలో నరాలసంబంధమగు బాధ ఉంటుంది. ఒకమేకు తలలో ముఖ్యంగా కణతలనుండి నుదుటియందు సిరస్సుకు పక్కలను, నడినెత్తిని కొట్టినట్లు బాధ. బల్లెములతో పొడుస్తున్నట్లు విపరీతమగు బాధతో తోచక రోగి పడుకొనిఉంటాడు. సిరస్సులో వాతసంబంధమగు నొప్పులు విపరీతంగా తేమగాలిచే కలుగుతాయి; లేక ఉన్ననొప్పులు హెచ్చుతాయి.

12. శగరోగంలో థూజా వాడవలసిన తరుణమేమి ?

శగరోగంలో స్రావము పలుచగాను, ఆకుపచ్చగాను వెడలునప్పుడు, మూత్రము విసర్జించునప్పుడు విపరీతమగు మంటఉన్నప్పుడు థూజా ఉపయోగపడును. మూత్రవాహినిగుండా కొద్దిపాటిమూత్రపుచుక్కలు పడినభావము కలుగును. గనేరియా లేక శగ శరీరమందు జీర్ణించిన ద్వితీయ, తృతీయావస్థలలోకూడ పనిచేయును; పులిపిరికాయలు, మొటిమలు, కాలీఫ్లవర్‌లోని మొలకలవంటి మొలకలు బైలుదేరునప్పుడు ఇది నిరుపమానమగుమందు. ఈమొలకలు సాధారణముగా మర్మావయవములయందు, ఆసనమునందు, పురుషాంగము యొక్క లోపలిభాగములోను, అమత్వాచలపైనను, ముక్కుపోటుల వెలుపల, కంటిదిగువునా మొలచినచో థూజాను వాడవలెను. పులిపిరికాయలు విత్తులవలె లేక గింజలవలె మొలచును. స్త్రీయొక్కజననావయవము ముఖద్వారమందు కాలీఫవరులోని మొలకలను పోలిన

...లు కలుపుట్టుట దీనికి సహజము. కొందరికి యీ మొలకలు తేమగా ...నీ, ... మత్యాసనలతో కూడిన ద్రవము చముర్చుటకలదు. కొన్ని ...చేపలలో జననావయవములలో పుండ్లుండి వంచలు గట్టిపడి ...భాగము పశుపురంగుగానుండుట తూజాకు స్వభావలక్షణము. ...తుకలగుంటలుపడి చీముతో నిండియుండును. జననావయవము ...చేశవాసనగల చమటపోయును. తొడల లోభాగము ఎఱ్ఱగా ఒరిసి ...ను. వృషణములు వాచి కమకకొట్టినట్లు పోటుగానుండును. ముఖ ...జీర్ణించుటచే స్త్రీల జననావయవములలో కుక్కగొడుగుల ... మొలకలు, కాలీఫ్లవర్ లోని మొలకలవంటి మొటిమలుపుట్టును. చిక్కని ఆకుపచ్చగల కుసుమస్రావము; పురుషులయందలి మేహ తెలుపు (...)వలె నుండును; ఎన్నటికినీతగ్గదు. శగవ్యాధి నూదిమందుల ...ని యితరప్రక్రియలవలనగాని అణచిపెట్టబడి వ్యాధి అంతర్ము ...త్వము మారుటచేపుట్టు అనేకవ్యాధులను తూజా చర్మగతము ... నివారించును. ముఖ్యముగా కీళ్ళనొప్పులు, ప్రోస్టేటుగ్రంథి వాచుట మొదలగువ్యాధులకు ముఖ్యహేతువు శగ జీర్ణించి అంత రంగికముగానుండుటయే. రోమములు మృదుత్వముకోల్పోయి చిరు ...ను. తలకు విస్తారము చుండ్రుపట్టును. వెండ్రుకలకొనలు చీల్లును. ...లు, కొయ్యగండలు పుట్టును. చెవివాచి చీముకారును. కంటి ...కు మొటిమలు ఒకటివిడచి వేరొకటి బయులుదేరి బాధగా ...ను. పంటి ఉపరిభాగము గట్టిగానున్ననూ మొదళ్ళుగుల్ల బారి ...లగును. నాలుకపైన, గొంతుగయుందు రక్తనాళములువాచి ...గానుండును. ఉదరమందలి పేగులు అరచుట, కడుపులోపిండము ...చున్నట్లుండి కడుపుపై ఏదోఒకభాగం ఎత్తుగాఉన్నట్లు అనుపిం ...ము సహజము. నల్లని ఉండలను వెలువరించే మలబద్ధము. మల బద్ధములో పెద్దకుదపలుగా మలం వెడలును. గొట్టముతో కొట్టినట్లు

ఉదయమున అతిసారవిరోచనాలు. ఆసనంపగిలి మొలకలు పెరుగుతాయి. స్త్రీల ఎడమఅండాశయంలో బాధ. ఉబ్బసం; గోళ్లుగొగ్గిలుగా వచ్చి చిట్లుతాయి. మొలకలనుండి రక్తం స్రవిస్తుంది. దగ్గు పగలు మాత్రం వస్తుంది. కళ్ళి నిలువవున్న జున్నులావుంటుంది. ఈ మొదలగు పెక్కులక్షణాలతో కూడిన సైకోటిక్ తత్వమును తూజా రూపుమాపును.

13. తూజారోగికి ఎట్టిచమటలు పట్టును ?

బట్ట కప్పుకొనిన తావున మాత్రము చమటలుపట్టక కప్పుకొనని భాగములకుమాత్రము చమటలు పట్టును. తలకుతప్ప మిగిలిన అన్ని భాగములకు చమటలు పట్టును. (వ్యతిరేకం – సైలీషియా) నిద్రా సమయములో చమటలుపట్టి మేలుకున్న వెంటనే చమటలు నిలచిపోవును. (వ్యతిరేకము – శాంబుకస్) రాత్రి పులుపువాసన వేయు చమటలు పట్టును. మర్మావయవమునకు మాత్రం తేనెవాసన వేయు చమటలుపట్టును;

టీకాలు వేసినప్పటినుండియు అయే కాలికవిరోచనములకు పెట్టిందిపేరు. ప్రాతఃకాలమున గొట్టముతో కొట్టినట్లు వాయువుతో కూడిన విరోచనములకు ముఖ్యమగు మందు. ఉదయం కడుపులో "గురుగ్రి-గురుగ్రి" అనే శబ్దములతో కాఫీ, చద్దిఅన్నము, క్రొవ్వు పదార్థములు , ఉల్లి మొదలగునవి సేవించుటచే – అయ్యే నీళ్ళవిరోచనములకు పనిచేయును. ఇట్టి అతిసార విరోచనములవలన రోగి శల్యగతుడై నిస్త్రాణగా ఉన్నప్పుడు వాడదగు దివ్యమగుమందు తూజా.

చేతులపై కొమ్ములవంటి మొలకలు మొలచుటకు, పులిపిరికాయలు రెండుగా చిట్లుటకు, కాలీఫ్లవరువంటి మొలకలకు, పొట్టపై

బూడిదరంగుగల మొటిమలు, పులిపిరికాయలు లేచుటకు. పొట్టపై లేచు బూడిదరంగు మచ్చలకు, ఛాతీకిచుట్టూనా పళ్ళికలుగా లేచుటకు, బొబ్బలవలె లేచు కురుపులకు. గుండ్రని మచ్చలుపడుటకు తూజాను వాడాలి. ముఖం జిడ్డుజిడ్డుగా నిగారింపుగా ఉండడం తూజాకుగల ఒక ప్రముఖలక్షణం.

హానిమన్‌గారి పరిశీలనము - ఏంటీసైకోటిక్ మందు. ముఖం జిడ్డుఓడుతూ మెరుస్తూఉంటుంది. శరీరమందలి పలుతావులలో పులిపిరి కాయలు. విభిన్నరకములగు కొమ్మువంటి గట్టిమొలకలు, కాలీఫ్లవరు లోని మొలకలనుపోలు మొలకలు గడ్డలు, పళ్ళికలు లేచుట దీని నైసర్గిక చర్మగత లక్షణాలు.

టీకాలు వేయుటచే సంభవించు దుష్ఫలితాలు ముఖ్యంగా విపరీతమగు జ్వరం, లేక అతిసార విరోచనములు దీనితో తగ్గును. గనేరియా అణచిపెట్టుటచేతను, లేక అసంపూర్తిగా నివారణఅగుటవలనను పుట్టే పెక్కు భయంకరవ్యాధులను నివారించు మేటిమందు. విపరీతమగు నిర్దిష్టభావాలు, కడుపులో జలచరాలు చలిస్తున్నట్లు, తనప్రక్కన ఎవరో కూర్చున్నట్లు, తాను గాజుతో తయారైనట్లు, అందుచే తనను ఎవరైనా తాకితే విరిగిపోతానేమో అనే భీతితో తనను ఎవ్వరు తాకకుండ జాగ్రత్తపడ్డం మొదలగు వింత విపరీత భావాలు తూజారోగికి ఉంటాయి. కళ్లుమూస్తే ఒళ్ళు తిరుగుతుంది (లకేసిస్, తెరిడి). తలలోను, నుదురులోను, నడినెత్తిని మేకులుకొట్టినట్లు ఉండే తలనొప్పి.

కంట్లకలక. రెప్పలపై మొటిమలు. రాత్రి కంట్లు అంటుకొనుట, రెప్పలపై మొలకలు "స్టయిస్" ఈ కంటి వ్యాధులకు 'తూజా'ను వాడాలి. చెవినుండి కాలికమగు చీము, కుళ్ళిన మాంసపు నీటివంటి

స్రావము వెడలును. చెవియందు మొలకలు మొలచి రక్తం కారును. నాలుకమీద, గొంతుగలోను ఊదా రక్తనాళములు ఉబుకును. పంటి మొదళ్ళు తినివేయబడి గుల్లబారును; తేనీరు త్రాగుటచేవచ్చు పంటి పోటుకు 'తూజా' దివ్యమగు మందు. కడుపులో పిండం తిరుగుచున్నట్లు భావం. పేగులు అరచుటకు, పొట్టలో జలచరములు కొట్టుకొను చున్నట్లుండుటకు 'తూజా'ను వాడాలి. స్త్రీల ఎడమ పిండాశయము నొప్పి. చిక్కగానుండు ఆకుపచ్చగు కుసుమ - వీనికి 'తూజా' దివ్యమగు మందు.

మలబద్ధం; ఆసనమందు విపరీతమగు బాధచే విరోచన ప్రయత్నం విరమించుకుంటారు. మలం వచ్చి వచ్చి వెనుకకు పోతుంది. మూలశంక; ఆసనం పగిలి బాధగా వుంటుంది. ఉదయం అతిసార విరోచనాలు గొట్టంతో కొట్టినట్లు అవుతాయి. విరోచనంతో విస్తారంగా గాలి పోతుంది.

భగం అతిసున్నితంగా వుండుటచే సంభోగానికి ఆటంకం కల్గుతుంది. చర్మం చాల మురికిగా వుంటుంది. అనేక తావులలో తెల్లగాను, బూడిదరంగుగాను మచ్చలు పడుతాయి.

కీళ్ళనొప్పులు, ప్రోస్ట్రయిటీస్, నపుంసకత్వం, ఉబ్బసం, షైలేరియా జ్వరం యీ మొదలగు తత్వమునుమార్చి అగత్యమగు వ్యాధులను నిర్మూలిస్తుంది.

పిప్పిగోళ్ళు; గోళ్ళు పగులుతాయి.

పక్కవేడి; రాత్రిసమయము. తేయాకు, చుట్ట, రాత్రి పగలు కూడ 3 గంటలవేళ, తేమచేత వ్యాధిలక్షణాలన్ని హెచ్చుతాయి. మూడవ మాసంలో అయ్యే గర్భస్రావానికి వాడవలసిన మందు.

# 141. ట్యూబర్ కులినం (Tuber Culinum)

(నోసోడ్)

(ఏంటిసోరిక్, ఏంటిసైకోటిక్, ఏంటిసిఫిలిటిక్)

1. "ట్యూబర్ కులినం" యొక్క ప్రధానసూచకమేమి ?

తరచు వ్యాధిలక్షణాలు మారుతాయి. వ్యాధి ఒక కేంద్రాన్నుంచి మరో కేంద్రానికి మారుతుంది. దీని బాధలు ఉద్బృత్తిగా అకస్మాత్తుగా పొడచూపి అంతలోనే తిరిగి అకస్మాత్తుగా పోతాయి.

సూక్ష్మంగా రొంపపడుతుంది. ఎలా పడుతుందో ఎందుకు పడుతుందో, ఎప్పుడు పడుతుందో, ఎక్కడనుంచి వచ్చిపడుతుందో బోధపడదు. చలిగాలి వీచింది తడవుగా రొంపపడుతుంది.

త్వరితంలో స్పష్టంగా గోచరించేటట్లు కృషించిపోతాడు. (ఎబ్రొటినం, కాల్కేరియా--కా; కోనియం, అయోడియం, నేట్రం-మూర్)

ఈ పై మూడులక్షణాలు దీని ప్రధానసూచికాలు.

2. ట్యూబర్కులినంయొక్క సాధారణ మానసిక లక్షణములేమి ?

వ్యాధి నివారణకాదనే అధైర్యం. కాని మృత్యుభయంమాత్రం ఉండదు. ఎంతమాత్రంకూడ మానసికశ్రమను మనస్సు అంగీకరించదు. సాయంకాలంనుండి అర్ధరాత్రివరకు ఆరాటంగాను, గాబరాగాను ఉంటుంది. జ్వరంలో గాబరా, అతివాగుడు, పేలాపన. రోగికి జీవితమంటే విసుగ్గావుంటుంది.

మనస్సునిలకడగావుండదు. పుద్దేశాలు క్షణక్షణం మారుతుంటాయి. రోగలక్షణాలలోకూడ నిలకడవుండదు. స్థలంమార్పు

శారీరకమార్పు, వ్యాధిగుణాలలో మార్పు సహజం. రాత్రిళ్ళు అంతు లేని ఆలోచనాపరంపరలు. అర్థంపర్థంలేని ఆలోచనలు ఒకదాని తరు వాత ఒకొకటి అంతులేకుండా తట్టుతాయి. అంతా నూతనంగా ఉండాలి; పాతడాక్టరు పనికిరాడు; వున్నవూరునుండి లేచిపోవాలి; పాతవస్తువులను మార్చెయ్యాలి. ఈవూరు ఆవూరు వెళ్ళాలని ఉం టుంది. నిలకడవుండదు. కాని అన్నిటియందూకూడ సమబుద్ధిఉండడం యీమందుకు ప్రత్యేకలక్షణం.

3. ట్యూబర్కులినంయొక్క విడుపుజ్వరం స్వభావమేమి ?

దీనిజ్వరం మొండి, బండ. తత్వమును మార్చేమందులు కూడా జ్వరాన్ని పూర్తిగా మాన్పలేవు. జ్వరం తిరిగి తిరిగి వస్తూ వుంటుంది. ఇట్లు తరచుతిరగబెట్టే విడుపుజ్వరాలు కుదర్చడంలో ట్యూబర్కులినంది అగ్రస్థానం. కొద్దిపాటిగాలిపోకినా, చిన్న మానసిక శ్రమ చేసినా, కాస్త మితిమీరి భుజించినా జ్వరంతిరుగబెట్టడం విధా యకం. రాత్రి 7 గంటలకు చలి. కాళ్ళు చేతులు లాగుతాయి స్థిమి తంగా పడుకున్నప్పుడు. ఒకప్పుడు సాయంకాలం 5 గం॥లకు చలి, దాహం. చలివచ్చుటకుముందు, చలిసమయంలోను దగ్గు. జ్వరంలో వమనము అవుతుంది. అన్నిఅవస్థలలోను దుప్పటి కప్పుకోవాలి. చలిలో శరీరం వేడిగావుంటుంది. తరచు తిరుగబెట్టేజ్వరం. జ్వరం వచ్చేముందు అవయవాలలో పీకడం, లాగడం. కొందరికి రాత్రి 11 గంటలకు చలివస్తుంది. చలి, కుదుపు; జ్వరం, చమటలు; ఈ అన్ని స్థితులలోను రోగి కప్పుకునేవుంటాడు. ఏమాత్రం దుప్పటితొలగినా యీపై మూడు అవస్థలు చాల ప్రకోపిస్తాయి ట్యూబర్కులినం రోగికి.

4. పెన్సిలినం లేక ట్యూబర్‌కులినం ఉపయోగించడంలో డా. బర్నెట్టు గారి అభిప్రాయమేమి ?

క్షయ అంకురమున్న రోగులు, మాతాపితలు క్షయచే మరణించిన రోగులు సాధారణంగా జీవశక్తిలోపించి చాల దుర్బలంగా ఉంటారు. వంశపారంపర్యా వచ్చే స్వభావంగల వ్యాధివారినివదలి పెట్టదు. అట్టివారు సర్వదా నిస్సత్తువుతో అలసిపోయివుంటారు. సూక్ష్మంగా వ్యాధికి గురిఅవుతారు. పాలిపోయి నీరసంగా నరాల పటుత్వంతప్పి వుంటారు. ఇట్టిలక్షణాలకు ట్యూబర్‌కులినం ఎన్నదగిన మందు. బర్నెట్టు యిట్టిలక్షణాలుఉన్నప్పుడు ఏఆలోచనా అక్కర లేకుండా పరిపాటిగా యీమందువాడేవారు. ఇట్టి తత్వాన్ని వారు (Consumptiveness) క్షయతత్వము అని అన్నారు.

వంశంలో క్షయవ్యాధివుంటే, వంశానుక్రమంగా యీవ్యాధితో బాధపడే కుటుంబానికిచెందిన పిల్లలకు యువకులకు చాలకాలం వ్యవధిలో ట్యూబర్‌కులినం 10 ఎమ్. 50 ఎమ్. సి – యమ్. పొటెన్సీలు ప్రతి ఒక పొటెన్సీని రెండుమోతాదులుయిస్తే, వారీవ్యాధిబారినుండి రక్షింపబడి యీవ్యాధిని ఎదుర్కొనుటకు చాలినంత చైతన్యశక్తిగల వారవుతారు. ఇది ఎడినోయిడ్సుఅనే క్షయసంబంధమగు గ్రంధులను నివారిస్తుంది (కెంటు).

5. ట్యూబర్‌కులినం నివారించగల తలనొప్పి ఎట్టిది ?

ఇది కాలికస్వభావముకలిగి భరించశక్యం కానంత విపరీతంగా వుంటుంది. క్రమంతప్పకుండా వారానికో లేక రెండువారాలకో ఒక మాటు వస్తూవుంటుంది తలనొప్పి. సాదృశ్యలక్షణాలైతే యీలాటి తలనొప్పిని ట్యూబర్‌కులినం నివారిస్తుంది. ఒకప్పుడు తలనొప్పితగ్గి రోగి

చిక్కిపోవడం, బలహీనంగావుండడం, క్షీణించడంకూడకలదు. అట్టి వారికి ట్యుబర్కులినం అమోఘముగుమందు (కెంటు).

తలనొప్పి కుడికంటిపై పుట్టి ముచిగలగుంటకు పాకుతుంది. 'తలపోటు, తలచుట్టునా ఇనుపతీగతో బిగించినట్లుంటుంది." (గ్రైడింగు సింటంసునుండి) తలనొప్పిలో మనస్థిమితం ఉండదు. విసుగుదల, కోపం. నిద్దురలో అరుస్తాడు.

"తో బుట్టువు క్షయతో మరణించడంచే అంకురించే వ్యాధులను నివారిస్తుంది." అన్న బర్నెట్టుగారు తెలిపిన హాంశముపై ఆధారపడిన ఒక చికిత్స:—

నర్సాపురంలో స్థానిక కలెక్టరు కచేరీలో గుమాస్తాగాపనిచేయు చున్న ఒక నడివయస్సు యువకుడు 1933 సం॥రంలో తనకు ఆందోళ నను కలిగిస్తున్న తనభార్యయొక్క అనారోగ్యస్థితినిగూర్చి సంప్రతించడానికి వచ్చాడు. అప్పటికే ఆమె పెక్కుమంది సంతానమును కన్నది. భర్త ఆమెస్థితిని చెపుతూ ఆమెకు మన్యజ్వరమనిచెప్పాచు ఒక అలోపతివైద్యుడు 15 రోజులనుండి వైద్యము చేయుచున్నారనియును, కించిత్తుకూడ గుణంలేదనియు ఆమెకు యీరోగం అంకురించినతరువాత 32క్ష పౌనులు తగ్గినదనియును, క్రమంగా శరీరం క్షీణిస్తోందనియు.నానా టికి ఓపిక, బలం తగ్గిపోతోందనియుచెప్పి గద్గదస్వరంతో "అంతా చీమా, చితుకు" పిల్లలండీ అని చాలదీనంగా చెప్పారు. ఆమె ప్రస్తుతం ఎలోపతివైద్యసేవలోవుంది, యిప్పుడు నేను చేయకలిగిందేమియు లేదు; అదేదోచూచుకొని మీారొక స్థిరనిర్ణయానికివస్తే నాశక్తివంచన లేకుండా తంటాలుపడుతాను. ఆమె క్షయవ్యాధితో బాధపడుతున్న ట్లుంది మీారుచెప్పేలక్షణాలుచూస్తే; అయినప్పటికి భయపడనక్కర లేదు" అని చెప్పివంపేశాను.

తరువాత ఒకవారంఅయ్యాక నిరుత్సాహంతో ఆయన మరల వచ్చి "అయ్యా! మీమాట నిజమేట; ఉపేక్ష చెయ్యక వెంటనే హాస్పిటల్ కి తీసుకు వెళ్ళండి" అని డాక్టరుగారు సలహాయిచ్చారు. రోగిది లేవలేనిస్థితి. నేను శెలవుపెట్టి కాస్తు పెట్టాలి. సహాయంకోసం బంధువులను పిలిపించాలి. ఏలాచూచినా పదిరోజులలోపుగా కదలగల ఆశ కనుపించదు. కాబట్టి యీలోపుగా ఉపశాంతికోసం ఏదైనా మందివ్వండి" అని ప్రాధేయపడ్డాడు. రోగిచరిత్ర ఆయన ముఖస్తా వ్రాసుకున్నాను. రోగిని స్వయంగాచూచాను. ఆమె అప్పగారు 2 యేండ్లక్రితం సరిగా యీలాగే క్షయతో బాధపడి విశాఖపట్నం ఆస్పత్రిలో మరణించింది. ఆప్రాంతంలో యీవైద్య ప్రభావము పూర్తిగా గుర్తింపనిరోజులవి. అన్నివైద్యాలుచూచి వ్యాధినుండి యిక లాభంలేదని వైద్యులు నిరాశతో వదిలిపెట్టాకా వచ్చేనాకు హోమియోపతివైద్యంనిమిత్తం.

వ్యాధి ముదిరింది; అయినా భయంలేదు; ఒక వారంలో కాస్త నెమ్మదిగా వుంటుంది అని ధైర్యం చెప్పి రెండు మోతాదులు 'ట్యూబర్ కులినం' 1 M పొటెన్సీలోయిచ్చి ఆరాత్రి ఒక మోతాదు, మరునాటి వుదయం పరగడుపున ఒక మోతాదు వేసి తిరిగి మరునాటి సాయంకాలం రోగి స్థితిని తెలుపమని చెప్పి పంపాను. మరునాటి రాత్రి 8 గంటలకు కొంత కుదుటపడిన మనస్సుతో ఆశాపూరితంగా గతరాత్రి ఒళ్ళు తెలియని నిద్రపోయిందనియు, దగ్గు అంతగా లేదనియు, రోజూ సాయంకాలం వచ్చే జ్వరం నామమాత్రంగా వచ్చినదనియు రోగి రోజూకంటె ఉత్సాహంగా వుందనియు చెప్పి నిన్న యిచ్చిన మందే మరో నాలుగు మోతాదులు యిమ్మనికోరాడు. ఒక అరడజను పొట్లాలు పాలపంచదార కట్టి రోజూ మూడు పూటలా విడువకుండా వెయ్యమని పంపాను.

ఒక వారం రోజులయ్యాక అయనవచ్చి తాను మదనపల్లి ప్రయాణం విరమించుకున్నట్లు, రోగి రోజురోజు కోలుకొంటున్నట్లు చెప్పి ఆమె యీ పదిరోజులలోను లోగడ కోల్పోయిన బరువును తిరిగి పొందింది. కాబట్టి పూర్తి నివారణకుకూడ నన్నే మందు ఇవ్వమన్నాడు.

బాగా పాలిచ్చే ఆవునొకదానిని కొని, రోజూ ఒకశేరు పాలను ఆమెకు యిమ్మనియు, పండ్లు, తాజాకూరలు, వెన్న, పెరుగు యివ్వాలనియు చెప్పాను. ఒక నెల తరువాత ఆమెను తూచగా 23 3/4 పౌనుల బరువు హెచ్చింది. తరువాత ఆమెకు నలుగురు పిల్లలు కలిగారు. ఆమెభర్త తహసిల్‌దారుగా ప్రస్తుతం పనిచేస్తున్నారు. "తోబుట్టువు క్షయతో మరణిస్తే వచ్చే వ్యాధికి 'ట్యుబర్ కులినం' పనిచేస్తుంది" అను బర్నెట్టుగారి నిర్వచనం యదార్థమని యీ చికిత్సయే తార్కాణము.

6. "ట్యుబర్ కులినం" వాడదగు ప్రేగుల సంబంధమగు వ్యాధులేవి?

మలబద్ధము; విరోచం గట్టిగా పెద్దదిగా అవుతుంది. తరువాత నీళ్ళ విరోచనాలు. ఆసనం దురద. ఉదయం భోజనానంతరం విరోచనం ఉబ్బుకొస్తుంది. వికారం. కాలిక అతిసార విరోచనాలతో విస్తారం చమటలు పడుతాయి. (యీ లక్షణం బర్నెట్టు వెల్లడి చేసారు).

సల్ఫరువలె యిదికూడ ఒకప్పుడు రోగిని విరోచనం నిమిత్తం లేవగొడుతుంది ఉదయాన్నే నిద్రనుండి. మలము బూడిద రంగుగా దుర్వాసనగా వుంటుంది, విరోచనం చాల ధాటీగా అవుతుంది. తింటూనే వుంటాడు కృశిస్తాడు. అమితనీరసం; రాత్రి విస్తారం చమటలు. ఈలాటి లక్షణాలుంటే 'ట్యుబర్ కులినం' అమోఘంగా పని చేస్తుంది.

7. క్షయవ్యాధిలో "ట్యూబర్ కులినం' వాడవలసిన లక్షణాలేమి ?

ఉష్ణంగావున్న గదిలో వుంటే రోగి ఉక్కిరిబిక్కిరవుతాడు. చల్ల గాలిలో వుంటే సులువుగా ఉచ్ఛ్వాసనిశ్వాసలు సాగుతాయి. రోగికి చల్లగాలి కావాలి; కిటికీతలుపులు గాలికోసం తెరచివుంచాలి. గదిలో కూర్చుంటే చమటలు కక్కేస్తాడు. ఆలా చమటతో తడపినప్పుడు గాలి సోకితే రొంపపడుతుంది. రొంప పట్టునుగాని రోగి చల్లగాలే కావాలంటాడు. ఎడమఊపిరితిత్తి పైభాగం వ్యాధికి కేంద్రమవుతుంది. బాధపెట్టే పొడిదగ్గు; దగ్గితే శరీరమంతా కంపిస్తుంది. చిక్కని పసుపు రంగు కఫం దగ్గుతుంటే పడుతుంది. స్త్రీలకు నెలసరి నిలచిపోయి తరచు దగ్గు వస్తుంటే "ట్యూబర్ కులినం" నివారిస్తుంది. వంశంలో క్షయవుంటే "ట్యూబర్ కులినం" వారి తత్వాలనుమార్చి భయంకరవ్యాధులు అంకు రించకుండా నివారిస్తుంది "ట్యూబర్ కులినం".

8. 'ట్యూబర్ కులినం' పుట్టించు చర్మవ్యాధుల స్వభావమేమి ?

శరీరమంతా గజ్జి: దుస్తులు తొలగిస్తే విపరీతమగు దురద. స్నానం పడదు. ఒళ్ళంతా పొలుసుల్లా తెల్లనిపొట్టు లేస్తుంది. చెవి వెనుక భాగమందున చర్మపు మడతలలోను, వెంట్రుకల కుదుళ్ళలోను వచ్చిగా, బాధగా వుంటుంది. సర్వదా రోగి నిప్పుశగ కావాలంటాడు. దానితో కొంత ఉపశాంతి చేకూరుతుంది.

తామర, క్షయవ్యాధి రావడానికి సూచన అని బర్నెట్టు అంటారు. చర్మం జిలగావుంటుంది. మిక్కిలి బాధను కలిగించు కురు పులు తట్లుతట్లుగా శరీరమంతటా పుడుతాయి.

9. 'ట్యూబర్ కులినం, బెసిలినం'లను ఎట్లు తయారు చేయుదురు ?

షింకిలు స్వాన్‌గారు క్షయవ్యాధి కళ్ళి లేక క్షయ కురుపు లోని చీము ఒకచుక్కను తీసి తయారు చేసిరి. (ట్యూబర్ కులినం)

క్షయగ్రస్తమగు ఊపిరితిత్తియొక్క ముక్కను తీసి తయారు చేసిరి. (బెసిలినం)

ఈ రెండు విధముల తయారుకాబడిన మందులుకూడ బాగు గనే పనిచేయును.

10. "ట్యూబర్ కులినం' పుట్టించు సాధారణలక్షణములేమి ?

అంతర్గతమునకు పోయి పనిచేసి తత్వమును మార్చగలమందు. ఇది ఏంటిసోరిక్, ఏంటిసైకొటిక్, ఏంటి సిఫిలిటిక్ మందు.

తరచు వ్యాధి లక్షణాలలో మార్పు: వ్యాధి ఒక కోశమునుండి వేరొక కోశమునకు మారడం దీని ప్రత్యేక లక్షణం; ఊపిరితిత్తులు, మెదడు, మూత్రపిండములు, కాలేయము- వీనిలో ఒక అవయవము నుండి వేరొక అవయవమునకు వ్యాధి మారుచుండును.

తరచు అకారణంగా రొంపపట్టుట దీని మరో ప్రముఖ లక్షణం.

యధాతధంగా తింటూ క్షీణించడం గణనీయమగు లక్షణం. (ఎబ్రొటినం, అయోడియం, నేట్రం - మూర్) విచారం, దిగులు. బెంగ. అహంకారం, కోపం; సహజంగా అణకువ, విధేయత, వినయము గల స్వభావంమారి పైనచెప్పిన స్వభావం పొడచూపు తుంది. కాని వ్యాధి ఉన్మాదానికి దారితీస్తుం దా అన్నట్లుంటాయి పరి స్థితులు. తాను మామూలుగా తిరిగే గదే అంతా క్రొత్తగా కను పిస్తుంది. అందలి వస్తువులన్నీ నూతనంగా గోచరిస్తాయి. తాను క్రొత్త స్థలంలో వున్నట్లు తలుస్తాడు.

మానసిక, వివేకలక్షణాలు, ఊపిరితిత్తుల సంబంధమగు లక్షణాలు ఒకటి విడచి ఒకటి మారుతుంటాయి. అనగా ఊపిరితిత్తుల బాధ ప్రకోపిస్తే మానసిక లక్షణాలలో వ్యత్యాసముండదు. ఊపిరి తిత్తుల బాధ తగ్గితే మానసికలక్షణాలు ఉద్రేకిస్తాయి. ఇది "ట్యూబర్కులినం" స్థితి. (కెంటు)

తలనొప్పి – కాలికంగా చాలా బాధపడుతూ వుంటాడు. కుడి కంటిపై నొప్పి ప్రారంభమై ముచికలగుంటకు పోడుస్తుంది. ఇనుప తాడుతో సిరస్సు కట్టిపెట్టినట్లుంటుంది. (ఎనకార్డియం, సల్ఫర్). విద్యార్థినులకు తలనొప్పి 'సెరిబ్రల్ మెనాంజిటిస్'కు అందలి బాధకు అందు నీరుజేరే ప్రమాదము పొడగట్టినప్పుడు ఇది దివ్యమగు మందు' నిద్రలో కేకలువేస్తూ ఉలిక్కిపడి లేస్తాడు. ఈలాటి లక్షణాలకు ఏపిస్' హీపార్, హెల్లిబోరస్ సూచింపబడికూడ పనిచేయనప్పుడు "ట్యూబర్కులినం" వాడాలి.

బాధకరమగు చిన్న చిన్న కురుపులు, మొటిమలు ముక్కుయందు మొలచి ఆకుపచ్చని రసి, చీము వాసనతో కూడి స్రవించునప్పుడు దానిని యీ మందు నివారించును. వంటిపై మంత్రించినట్లు అయే కురుపులను తగ్గిస్తుంది.

అతిసార విరోచనములు వృదయం పక్కమీదనుంచి లేవకుండా వుబ్బుకు వస్తాయి. దుర్వాసనతో కూడిన బూడిదరంగు నీళ్ళలా పిచికారీతో కొట్టినట్లు ఝాడించి అవుతాయి. నెలసరి సకాలానికి ముందుగాను, విపరీతంగాను, చాలాకాలందాకాను, భరించరాని బుతుశూలతోను అవుతుంది. సాధారణంగా యీ రోగులు క్షయ చరిత్ర కలిగివుండే యెడల యీ మందుకు సాటివచ్చు మందు మరొకటిలేదు.

చిడుము, గజ్జి, మాద – శరీరమంతటా వుంటుంది. అమితంగా దురద. తెల్లని పొలుసులవంటి పక్కులు. శరీరముపై చుండ్రులా లేస్తుంది. నిప్పుశగను ఉంటే దురద. బాధలు తగ్గుతాయి.

శరీరమందేభాగంలోనైనా సరే తామర ఉంటే 'ట్యూబర్కులినం' వాడాలని డా॥ బర్నెట్టుగారి సలహా.

ఇందు క్షయవ్యాధి అంకురం ఎడమవైపు ఊపిరితిత్తి పైభాగమందలి అగ్రస్థానంలో ప్రారంభిస్తుంది.

రోగి చల్లగాలిని కోరుతుంది; తలుపులు, కిటికీలు తెరచి వుంచాలి. చలిగాలిసోకితే సూక్ష్మంగా రొంపపడుతుంది. రొంప పట్టినా రోగి చల్లగాలినే కోరుతాడు. తలుపులు వేసేస్తే ఊపిరి ఆడక ఉక్కిరి బిక్కిరి అవుతాడు.

వంశంలో క్షయవుంటే అన్ని వ్యాధులకుకూడ వాడవచ్చును. రోగికి ఎవరైనాసరే సమబుద్ధే, చపలచిత్తం; నిలకడవుండదు. క్రొత్త క్రొత్త స్థలాలకు పోవాలని కుతూహలపడుతాడు. ప్రయాణమంటే చెవి కోసుకుంటాడు. తరచు స్థలం మారుస్తూ వుండాలి.

కోకలంటే అపరిమితమగు భయం, ఇదో ప్రముఖ లక్షణం. అమిత ఆకలి. యథాతథంగా తింటూనే క్షీణిస్తాడు. చల్లని పాలంటే హితవు. బిడ్డపుట్టిన కొద్దికాలానికే ఋతుమతి అవుతుంది. మెడచుట్టు నాగల గ్రంధులన్నియు వాస్తాయి. "టాన్సిల్సు" చల్లగాలిలోను, పొయ్యిశగను, నడవడం వల్లను బాధలు తగ్గుతాయి. సంగీతం వల్లను, తేమప్రదేశంలోను, వెచ్చని గదిలోను, రాత్రివేళ పడుండే సమయాన్ని బాధలన్నియు ప్రకోపిస్తాయి.

రోగి చాలవుద్రేకంతోను,ఆవేశంతోను వుంటుంది. అపస్మార సంబంధ మగు యీడ్పులు, దడ, వణకు; ఆగి ఆగి దీర్ఘ శ్వాసలు; సూదిపోట్ల వంటి పోట్లు. అవయవాలు బిగబడుతాయి, అదురుతాయి. ఉలిక్కి పడుతాడు రోగి; గొంతుగలో ఉండ వున్నట్లుంటుంది. ఉదరములో నుండి ఏదో ఒక ఉష్ణపదార్థము పైకి లేచుచున్నట్లు భావము. అందుచే రోగి అప్పుడప్పుడు వుక్కిరిబిక్కిరవుతాడు. ఈలా పెక్కు లక్షణాలు నరాల వుద్రేకఫలితంగా సంభవిస్తాయి.

సాధారణంగా నరాలన్నియు ఉద్రిక్తంగా వుంటాయి; ఒక్క క్షణంకూడ స్థిమితం వుండదు. పెక్కుతావులలో పే ప్పుచున్నట్లు చించుచున్నట్లు, బిగబట్టుచున్నట్లు నొప్పులు, కొంకర్లు.

గాలిలో తేలిపోతున్నట్లు భావం. (స్త్రీకాను కాళ్ళు మాత్రమే తేలిపోతున్నట్లు భావం). గొంతుగలోనుండి ఒక దారము క్రిందకు వ్రేలాడుచున్నట్లు భావం. ఇంద్రియాలన్నియు పరిశోధించి సునిసితంగా వుండడం దీని ప్రధాన నైసర్గిక లక్షణం.

2. "వెలీరియన్"నివారణచేయుగల అపస్మారం (Hyste<sub>r</sub>ia) ఎట్టిది?

ఇది కేవలం మామూలుగావచ్చే అపస్మార యీడ్పులకు స్పృహ లేకుండుటకు అంతగా వుపకరించదు. కాని నరములవుద్రిక్తతకు సాధారణ నరముల సంబంధమగు లక్షణములకు ఉపయోగపడును. మానసికంగాను, శారీరకంగాను యీ రోగి వుద్రేకంతో వుంటాడు. రోగి చాలా హుషారుగా, ఖులాసాగా, సంతోషంతో, చెప్పింది చెప్ప కుండా, వేగంగా, ఏకధాటిగా, తడుముకోకుండా, జంకుగొంకులు లేకుండా అమితంగా వాగేస్తాడు. పరిసరాలన్నియు వింతగా తోచు స్తాయి తను విషమపరిస్థితులలో నున్నట్లు భావన. చాలనొప్పి, నొ

దిమ్ము, ఆరాటం, ఆందోళన. రోగికి కొంచెంగూడ స్థిమితం వుండదు. కండరాలు ప్రకోపించి ఉండుటచే తరచు కదుల్తూవుండాలి. ఈ మందు ను బుజువుచేసే (Proving) సందర్భములో మెలిపెట్టుచున్నట్లు, లాగు తున్నట్లు, కట్టుచున్నట్లు, పొడుచుచున్నట్లు, చించుతున్నట్లు – పోట్లు, నొప్పులు కలిసి, ఆ బాధలన్నియు రోగి కూర్చున్నప్పుడు వుద్రేకించి నడుచుచున్నప్పుడు ఉపశమించడం గమనించబడింది. కూర్చుంటే శరీరంనుంచి సెగలు, పొగలు లేస్తాయి. సాయంకాలసమయంలో, రాత్రి తెల్లవార్లు కంటిమీద కునుకుపడక ఆరాటపడుతుంది. కాని తూర్పు తెల్లవారుతుందనగా కలలతో కూడిన కునుకు వస్తుంది.

'వెలేరియన్' అపస్మారతత్వంగల స్త్రీలకు పనిచేస్తుంది. ఏమాత్రం పనిచేసినా తలనొప్పి. గొంతుగలో దారం వ్రేలాడుచున్నదని కొందరు ఫిర్యాదీచేస్తారు సాయంకాలం పొద్దు క్రుంకుతుంటే వంటి వెంట వేడివస్తుంది. ఏమాత్రం నొప్పికయినా శోషవస్తుంది. పొట్టలో నుంచి వెచ్చగా గొంతుగలోనికేదో వస్తోందని, గొంతుగలో ఉండ వుందని తరచు ఫిర్యాదీచేస్తారు. కీళ్ళ వాతంలోవలె అవయవాలలో బాధగావుంటే 'వెలేరియన్'ను వాడవలసి వుంటుంది, రోగి నిలకడగా కూర్చుంటే దీని బాధలన్నియు వుద్రేకిస్తాయి; నడుస్తుంటే క్రమంగా తగ్గినట్లుంటాయి.

3. "వెలేరియన్" యొక్క మానసిక లక్షణములు ఏమి ?

రాత్రులందు ఏవో విగ్రహాలు, మృగాలు, పరాయిపురుషులు గోచరిస్తాయి. మానసికంగా వుత్సాహంగా వుంటుంది. వుద్రేకం, ఆవేశం. మాటలాడుతూ ఒక విషయంనుంచి మరోవిషయానికి దారి తీస్తుంది. తప్పు ఆలోచనలు చాల పుడుతాయి. భ్రమలు యెక్కువ. తాను వేరే మనిషిననియు అసలువానికి తావియ్యాలనియు భావించి

చివరకు మంచంపట్టెల దగ్గరకు జరుగుతుంది. తన దగ్గర మృగములు వచున్నట్లు, అవి తనను బాధపెడుతాయనియు భావించి భయపడు తుంది. అమిత విచారం, ముక్కోపం, మాంద్యంగా పడివుండడం సహజం. స్థిమితంగా, విరామంగావుంటే వుప్పున్న మంధబుద్ధులు పుట్టు కొస్తాయి. తాను చాలా తేలికై గాలిలో తేలిపోతున్నట్లు భావిస్తాడు.

4. "వెలీరియన్" కుదర్చగల తలనొప్పి యెట్టిది ?

సాయంకాలం స్తిమితముగా కూర్చుంటే తలనొప్పి వస్తుంది. కదిలినా, మెదిలినా, నడచినా సిరోవ్యధ తగ్గుతుంది. తలలో మత్తు తెచ్చే పోట్లు, సూర్యతాపానికి, వెలుగుకు తలనొప్పి వస్తుంది. కండ్ల నుండి నుదురుభాగాన్ని నొప్పి. పుర్రె బిగబట్టినట్లు, లాగిపట్టినట్లు వుంటుంది. నడినెత్తిని మంచుగడ్డ పెట్టినట్లు చల్లగావుంటుంది. (వ్యతిరేకం - సల్ఫర్).

5. "వెలీరియన్"కుగల ఉదరలక్షణములేమి ?

వెర్రిఆకలి, దానితో వికారం. కడుపు కాళీగాఉంటే వ్యాధి ప్రకోపిస్తుంది. అసహ్యమగు ద్రవం తేనుపొస్తుంది. తల్లికోపంలో పాలుకుడిపితే శిశువు వమనంచేసుకుంటుంది. పాలుత్రాగిన మరు క్షణంలో కడుపుఉబ్బుతుంది. రాత్రిభోజనానంతరం పొట్టలో కోస్తు న్నట్లుబాధ.

మలంలో క్రిములుంటాయి. పెరుగుబిళ్ళలవలె పాలువిరిగి పల్చని నీటివిరోచినాలు. మూత్రవిసర్జననిమిత్తం బిగబడితే ఆసన కండరం దిగజారుతుంది.

6. అవయవాలపై "వెలీరియన్" ప్రభావమేమి ?

అన్నికీళ్ళలోను నొప్పులు. ఈనొప్పులు నిలకడగా కూర్చుంటే ఉద్రేకించి నడుస్తుంటే ఉపశమిస్తాయి. అవయవాలు లాగుతాయి,

వడుకుతాయి, కూర్చుంటే కండరాలు కొంకర్లుపోతాయి. అవయవాలులాగుతాయి, బరువెక్కుతాయి. అవయవాలను కదపాలని ఉండదమేకాని కదపలేదు. భుజాలలోను, చేతులలోను సూదులతో పొడుస్తున్నట్లు పోట్లు. కాళ్ళలోను, పిక్కలలోను నొప్పి, పీకుడు. అపస్మార సంబంధమగు ఈడ్పులు, కొంకర్లు. ముఖ్యంగా యీ కొంకర్లు పిక్కలలోను, పాదాలలోను ఉంటాయి.

7. "వెలేరియన్"కుగల సయాటికా (Sciatica) లక్షణాలేమి ?

సయాటికావ్యాధిలో నిలబడినను, పాదమును నేలకానించినను విపరీతమగు బాధ (బెల్లు). కాలు సాచినను, విశ్రాంతిగానున్నను, నడుస్తున్నను, అలసి పనిచేసిన తర్వాతను బాధలు ఉపశమిస్తాయి.

8. "వెలేరియన్"కుగల సాధారణలక్షణములను పది పంక్తులలో వ్రాయుము.

అమితమగు నాడీమండల ఉద్రిక్తత. అపస్మారసంబంధమగు నరముల దౌర్బల్యం. స్వతసిద్ధముగా తెలివిగలదైనను నిలకడలేని మనస్తత్వం.

ఎఱ్ఱగా ఉండవలసినభాగాలు తెల్లగాపాలిపోయి రక్తవిహీనంగా వుంటాయి.

గాలిలో తేలిపోయేటంత తేలికగాఉన్నట్లు భావం.

ఇంద్రియాలన్నియు అతిసున్నితంగాఉంటాయి.

సిరస్సులో అతిసీతలంగా ఉన్నట్లుభావం (నడినెత్తిని-సెపియా, వెరాట్రం).

గొంతుగనుండి తడప లేక దారము వ్రేలాడుచున్నట్లుభావము (నాలుకపై-నేట్రం, సైలీషియా).

శిశువు విరిగినపాలు పెరుగుబిళ్ళల్లా కక్కుతాడు. మలంకూడా యీతీరుగానే అవుతుంది.

నిలబడితే హెచ్చి, నడుస్తుంటే తగ్గే స్వభావంగల సయాటికా. రాత్రిళ్ళు భయం; ఉలిక్కిపడిలేస్తారు. కలుషజీవితంచే సంభవించే దుష్ఫలితాలకు దివ్యమగుమందు.

ఒంటరిగావున్నా, చీకట్లోవున్నా విపరీతమగు భయం. దృష్టి, వినికిడి, వాసన, రుచి-వీనికి సంబంధించిన విపరీతభావాలు పుడుతాయి.

గొంతుగలోనికి వెచ్చనిదేదో పైకి వుబుకుచున్నట్లు అనుపించి శ్వాస బంధిస్తుంది.

## 143. వేరియోలినం (Variolinum)

1. 'వేరియోలినం' అననేమి ?

ఇది మసూచికం కుండరసినుండి తయారుకాబడినమందు. ఇది పూర్తిగా ఋజువుచేయబడలేదు.

2. 'వేరియోలినం' ప్రధానంగా ఎందు పనిచేయును ?

మసూచికమను భయంకరవ్యాధి అంకురించకుండా నిరోధించుటలో అసమానమైనది; టీకాలువేయుటకుబదులు దీనిని లోనికిపుచ్చుకొనవచ్చును. ఫలవంతమైన టీకాలువేయుటచేఁగలుగు దుష్ఫలితాలు మాత్రం కలుగవు. మసూచికము అంకురించకుండుటకు, వచ్చిన మసూచి కొద్దిపాటితో పోవుటకును, మసూచికవ్యాధి వ్యాపించకుండ నయమగుటకున్నూ వాడదగు అద్వితీయమగుమందు (బోయిరిక్). మసూచిక నివారణకు, చికిత్సలో గొప్పదగు ఔషధరాజము (బ్లాక్‌వుడ్). సత్వా

న్వేషణులు, సుప్రసిద్ధవైద్యులు మసూచికవ్యాధిలోయిదిచేయుమేలున గూర్చి అనుభవైక్యముగానొసగిన ప్రశంసలు అగణితములు. ఎం భయానకమగు మసూచికమునైనను యిది నివారించగలను. మసూ చికనిరోధము నివారణలలో దీనిశక్తి టీకాలకంటె అధికము. టీకాల వేయుటచేకలుగు తత్వదోషములకు యీమందులో తావులేదు. దీని వుపయోగించిన- "హెచ్. సి. ఏలన్." ముగ్గురు సుప్రసిద్ధవైద్యు అభిప్రాయములను, దీని అమూల్యతను పాఠకుల మనస్సుకు పట్టుటక గాను విశదీకరించితిని.

3. "వేరియోలినం"యొక్క ప్రధానలక్షణములేవి ?

మసూచికము అంకురించకుండుటకు, యీభయంకరవ్యాధిబారి నుండి రక్షించుటకు వాడనగు నిరుపమానమగు ఔషధరాజము వేరియోలినం.

ఎంతటిభయానకము, ప్రళయము, భీభత్సము అగు మసూచిక మందైనను దీనిని వాడినచో వుద్భృతముతగ్గి త్వరితముగాను, సక్రమ ముగాను మసూచికము దిగజారి, రోగియందలి వికారచేష్టలనుతగ్గించి కుటుంబములోని ఆందోళనమును తగ్గించును.

వక్కులతోకూడిన మొలకలకు (క్రోటన్, మెర్క్యురీ, రూస్ టాక్స్) మొటిమలకు పనిచేయును.

విపరీతమగు జ్వరము (ఆర్స్, బెల్. స్ట్రామోనియం సల్ఫర్) అపరమితమగు దుర్వాసనతోకూడిన చెమటలు; విపరీతంగా చలి, కునుకు. శరీరము చల్లగానుండి చలి; వెన్ను వెంట చల్లని మంచునీరు చిలకరించినట్లుంటుంది (డా. జి. రోయల్). మసూచికమున్న నిరంత రం మనస్సులోభీతి (డా. ఎ. సి. కౌవరవెట్). మంచజేతిలోనొప్పులు

కాలికమగు పక్షశము, ఆయాసము. రక్తపూరితమగు ముక్కునుండు కళ్ళితో కూడినదగ్గు. ముచికలగుంటలో నొప్పి. చెముడు (డా. ఎ. సి. కొపరనెట్). చిడుము. గుంటలుపడు కురుపులు. పొంగి వుబ్బిన కను రెప్పలు (డా. జి. రోయల్). వికారము; అవయవములయందలి ఎముకల ఆటు, పోటు; శల్యాగతబాధలు; గొంతు పూడిపోయినట్లు భావము; గొంతుగ యొక్క కుడిభాగంలో వుండవున్నట్లుంబుంది.

భరించలేని నడుమునొప్పి, ఆ నొప్పి రాత్రిసమయమందునను, కదలికవలనను హెచ్చి కదలక - మెదలక విశ్రాంతిగా నున్నచో శాంతించును.

4. వేరియోలినం కల్పించగల జ్వరము ఎట్టిది ?

విపరీతమగుజ్వరం; శరీరం శగలుకక్కుతూవుంటుంది. అపర మితవాసనతో కూడిన చమటలు విరామంలేకుండా పోస్తాయి. నడుం మెలేస్తోన్నట్లు భరించరాని పోటు. మణికట్టులో నొప్పి; పిక్కలపోటు. కాళ్ళులాగడం, శల్యాగతపోట్లు, ఒళ్ళునలిగి స్థిమితంలేక రోగి ఆరాట పడుతాడు. వెన్నులోనినొప్పి వుదరంలోకి మారుతుంది. ఆయాసం. గొంతుగపూడినట్లుంటుంది. జిగటగా చిక్కగానుండు రక్తపూరితమగు కళ్ళిదగ్గు. వికారం. కనుపొట్టలవాపు. తల బద్దలైనట్లు భరించరాని తలనొప్పి. ముచికలగుంటలో బరువు. నొప్పి; అమితంగాచలి-చల్లదనం.

5. మసూచికమును నిరోధించుటలో వేరియోలినంతో సరివచ్చు యితరమందులేవి ?

1. వేక్సీనినం. 2. మెలాండ్రినమ్.

వేక్సీనినం—అన్నివిధములా వేరియోలినంను పోలియుండును. (కోరింతదగ్గు-క్లార్కు) టీకాలనుండి తయారుచేయబడిన నోసోడ్.

మెలాంక్రిన్—కట్లపురుగుల్లోని మైనము వంటి పదార్థమునుండి తయారుకాబడినది. మసూచికము రాకుండ నివారించుటకు ఉపయోగ పడును. టీకాలు వేయుటచేవచ్చు దుర్గుణములకు ముఖ్యంగా చిడు ముకు వాడవలసిన దివ్యౌషధం.

## 144. వెరాట్రం ఆల్బం (Veratrum-Album)

1. వెరాట్రం ఆల్బం సేవించుటచే సాధారణంగా కల్గుమార్పేమి ?

ప్రధానంగా యిది ఉదరాశయంపై పనిచేయును. సాధార ణంగా ఉదరమండలి "స్ప్లాన్ కేనిక్" (Splancanic nerves) నాడులపై దీనిప్రభావము పొందును. ప్రథమంలో యీనాడులు స్తంభింపబడును. అందుచే రక్తనాళములలో విస్తారము రక్తముచేరి అందలినీరం ఉద రంలో స్రవించును. ఆకారణముచే నీరస నిస్త్రాణలు కలిగి శరీరము చలువబారి పొట్టలో ఆరాటముపుట్టును. ఈలక్షణములు "విరాట్రం ఆల్బం"యొక్క ప్రధానమైన సర్గికములు. ఈలక్షణములన్నిటికీ నరములు శక్తిహీనమగుటే కారణము.

2. వెరాట్రం ఆల్బంయొక్క ప్రధానమైన సర్గిక గుర్తింపులక్షణాలేమి ?

నుదురుపై చల్లనిచమటలు; వళ్ళుచలువలుకమ్మటం-యీామం దునకు ప్రధాన గుర్తింపులక్షణం. జీవశక్తులన్నియు త్వరితంగా కృంగి పోతాయి. నిస్త్రాణ. కాళ్ళు, చేతులు, ముఖము చమటలుకారుతూ చల్లబడి క్రమంగా చలువెక్కి కండరాలు[illegible] చైతన్యశక్తి లేక ర[illegible]యిబారుతాడు.

అమితంగా విరోచనాలు, వాంతులు; కడుపులో పోట్లు; విదా హం. చల్లనినీళ్ళత్రాగాలి. రోగికిఆరాటం. చల్లనిచమటలు, మంటలు.

3. వెరాట్రంఆల్బంకుగల సంధిలక్షణములేమి ?

సంధి విపరీతంగాను, వికృతంగాను వుంటుంది. విపరీతంగా ఆరాటం. కట్టుగుడ్డలు చించేయ్యాలని, కోసెయ్యాలని వాంఛిస్తాడు. అతివాగుడు. గట్టిగా అరుస్తాడు. దగ్గరగాఉన్న వాళ్ళని కొట్టేస్తాడు. ఏదో ఊహించి నిర్నిమిత్తంగా భయపడుతాడు. ఒకప్పుడు శృంగార గాథలు ఏకరువుపెడుతాడు. మదోన్మత్తతను సూచించు ప్రేలాపన. ఒకప్పుడు ఉన్నట్లేఉండి అకస్మాత్తుగా పక్కమీదనుండి లేచి ఉపశాంతి నిమిత్తం ఓపికఉన్నసమయంలో గది నాలుగుమూలలా తచ్చాడు తాడు. ఉదృతంలో "బెల్లు" స్ట్రమోనియంలనుపోలి వుంటాయి లక్ష ణాలు. కాని విరాట్రంలో ఒళ్ళుచలువలుకమ్మి నుదుటపై చమట బిందువులు ముత్యాల్లా వుంటాయి. కొన్నివేళలలో ముఖం ఎర్రగా కంది, పెదవులు వూదాగావుండి ఒళ్ళంతా జిలగా వుంటుంది. (ఫేరింగ్టన్).

4. వెరాట్రం ఆల్బంయొక్క మదపిచ్చ స్వభావమేమి ?

**మితిమీరిన శృంగారగోష్టి; ఆతృతతో గడిచుట్టునా కలియ దిరుగుతుంది. ఎవరుకనుపిస్తే వారిని ముద్దుపెట్టుకోటానికి ప్రయత్ని స్తుంది. సాధారణంగా బుతుసమయానికిముందు యీవ్యాధిలక్షణాలు ప్రకోపిస్తాయి. ప్రాణాంతకమగు అబద్ధాలు అల్లేస్తుంది. ఈమదపిచ్చ సాధారణంగా తృప్తినిచ్చు సంభోగం లేనందున లేక మానసికఉద్రే కమువలన కలుగుతుంది. (ఫోస్ఫరస్; ప్లాటినం; స్ట్రమోనియం) తాను గర్భవతిననిన్నీ కొద్దికాలంలో తాను బిడ్డతల్లిని అవుతానని వాగుతుంది అందరితో.**

5. వెరాట్రం ఆల్బంకుగల భయలక్షణాలేమి ? ఈ లక్షణములున్న యితరమందులేవి ?

ఝుడుసుకొనుటచే శరీరంచల్లబడి చమటలుపట్టి విరోచనము లగుచున్నచో "వెరాట్రం-ఆల్బం" అద్భుతంగా పనిచేస్తుంది.

జెల్సిమియం, ఆర్జంటం నైట్రికం, ఎకొనైట్, ఓపియంలు ఝుడుసుకొనుటచేవచ్చు విరోచనములవ్యాధికి మందులు. కాని విరాట్రంలో ఒళ్లు చలుకలుకమ్మడం. నిస్త్రాణ, సోమిల్లడం అమితంగా వుండడం గమనార్హం.

6. ఝుడుసుకొన్నప్పుడు వాడదగు అరడజను మందులేవి ?

1. ఎకనైట్. 2. ఓపియం. 3. వెరాట్రం-ఆల్బ. 4. ఇగ్నీషియా. 5. జల్సిమియం. 6. అర్జంటం నైట్రికం.

7. వెరాట్రం ఆల్బంతో నివారింపగల పిచ్చ ఎట్టిది ?

దీని పిచ్చచేష్టలు విపరీతంగాను ఘోరంగాను వుంటాయి. రోగి స్వరూపం భయావహంగా భీతికొల్పుతూవుంటుంది. కంటపడినదాన్ని ధ్వంసంచేస్తాడు. దేన్నిచూచినా చించేస్తాడు. తన కట్టుబట్టలు చించేస్తాడు. ఎప్పుడూ ఏదోచేస్తూ స్థిమితంలేకుండా వుంటాడు. నిత్యకృత్యాల నిర్వహణలో సతమతమైపోతూ వుంటాడు. వడ్రంగిఅయితే కుర్చీమీద కుర్చీ పేరుస్తూవుంటాడు; ఏమిచేస్తున్నావని అడిగితే శవాలను పేరుస్తున్నానంటాడు. ఈలాటిపనులేవియు దొరకకపోతే కట్టుగుడ్డలు చింపుకోడమో, చేతులెత్తి కంఠంచించుకొని భగవంతుణ్ణి సంబోధిస్తూ అరవడమో చేస్తుంటాడు. అంతులేని భగవధ్యాన్నం. తాను మహావిష్ణువుయొక్క అవరావతారమునని భావం. ముఖంకంది

ఒళ్లు చమట్లుపట్టేటట్లు భగవంతునిగూర్చి అరుస్తాడు, పశ్చాత్తాపాన్ని సూచిస్తాడు.

మరుఘడియలో శృంగారగీతాలు, మదనకామరాజు కథలు లేకపోతే అన్నీ ధ్వంసంచేసే ప్రళయనృత్యాలు. సూతికాసంబంధమగు పిచ్చి. శిరస్సుకు విస్తారం రక్తపోటు, కొంకర్లు, యీడ్పులు; ముఖం కంది నల్లబడుతుంది. మిడిగుడ్లు; పిచ్చిఅరుపులు, కేకలు, కరవడం. కొట్టడం, గుడ్డలు చించివేయడం; మాట చొరనీయకుండా అంతులేని వాగుడు.

ఏదో అవాంతరం సంభవించినట్లు ఏడ్పు, ఎంతఓదార్చినాఊరుకోదు. గదిలో పచార్లుచేస్తూ గోలచేస్తుంది లేదా మోకాళ్ళపై తల పెట్టుకొని రోదనంచేస్తుంది. ఏదోఆపత్తువచ్చినట్లు వెక్కి వెక్కి ఏడుస్తుంది.

పిచ్చఎక్కేటకుముందు కొన్నినాళ్ళు నిస్పృహ నిరుత్సాహంతో బాధపడుతుంది. తనరోగం కుదరదని నిరుత్సాహం. నిరాశ; ఆసందర్భంలో ఆత్మహత్యకు ప్రయత్నిస్తుంది. పిచ్చిఎక్కినవాళ్ళు నిరాశ చెందరుకాని పిచ్చిఎక్కేముందుమాత్రం నిరాశ, ఆరాటంతో బాధపడుతుంది.

వున్మాదంలో తాముతప్ప లోకంలో అంతా పిచ్చివాళ్లుఅనే తలుస్తారు. ఋతుసమయంలో విరాట్రం ఆల్బలో స్త్రీలు చలువలు బారి మృతదేవుల్లా వుంటారు. పెదవులు నల్లబడుతాయి; కాళ్ళు చేతులు చలువలుకమ్మి నలుపెక్కుతాయి. భరించరాని బాధలు. కృంగిపోతున్నట్లుంటుంది. అందరిని ముద్దుపెట్టుకోవాలనే మదపిచ్చి. చలువలుకమ్మడంతో కూడిన అపస్మారము. ఋతుసమయంలో వాంతులు, విరోచనాలు.

8. ప్రేగులసంబంధమగు ఎట్టి ఉగ్రతలకు విరాట్రిం ఆల్బంవాడాలి?

అన్ని విధములగు కలరావ్యాధులకు దివ్యమగుమందు. అమితంగా విరోచినాలు, వాంతులు. విరోచినాలు నీళ్ళలా పెద్దవిగా అవుతాయి. కడుగులాగో, ఆకుపచ్చగానో తెల్లగానో అవుతాయి. ముఖ్యంగా పేగులలో నొప్పి, అవయవాలలో కొంకర్లువుంటాయి. కొన్ని వేళలలో విరోచనాలు అవడంవద్దు. రోగి క్రమంగా నిస్త్రాణ చెంది చలువలుకమ్మి నుదుపై చల్లని చమటలు పోస్తాయి

9. కలరా వ్యాధికో వెరాట్రిం ఆల్బంను సూచించు లక్షణాలేమి ?

ఆసియాఖండమందలి కలరా వ్యాధికి దివ్యమగు మందని శ్రీ హానిమన్ మహాశయులు తెలవిచ్చారు.

ఏకకాలమందు విరోచనము, వాంతి, (ఆస్సు), ఆరాటము, మరణభీతి లేక పర్లక్ష్యం. కళ్ళుతిరుగుతాయి; తలదిమ్ము; కళ్లు గుంటలు పడుతాయి. ముక్కు చల్లగావుంటుంది. కంటిపాపలకు చలనం వుండదు. విదాహం; ఎంతతాగినా తృప్తివుండదు; దాహం కట్టదు. రోగి చల్లనినీరు త్రాగాలంటాడు. తరచు త్రాగుతాడు.

పొట్టలో కోస్తున్నట్టు పోట్లు నాకీ ముందగిస్తుంది; నెమ్మదిగా విడచి విడచి కొడుతుంది. విరోచనాలు పిచికారీతో కొట్టినట్లు ధాటిగా అవుతాయి విరోచనం కడుగునీళ్ళలా అవుతుంది. భరించరాని వాసన. నుదుపై చల్లని చమట్లు. మాట గొణుగుపోతుంది. సర్వం క్షీణించడమే. మాట నూతిలోనుంచిలా వస్తుంది నాలుక పొడిఆరి, చవలేక పచ్చని ఆమంతో వుంటుంది. మూత్రం తగ్గుతుంది; క్రమముగా బిగబట్టేస్తుంది. ఉదరంలోను, కాళ్ళు - చేతులలోను కొంకర్లు. ఇట్లు ధాతువులన్నియు క్షీణించి నిస్త్రాణజెందుతాడు గాని మానసికంగా

అవగాహనకు లోటుండదు. క్రమంగా కండరాలు బిగిసి కొయ్యబారి ముఖం, చేతులు చలువలుకమ్మి నలుపెక్కుతాయి. ఇట్లు మృత్యు ముఖాన్నున్న రోగికైనా 'విరాట్రం ఆల్బం' సకాలంలోయిస్తే సంజీవిలా పనిచేసి రోగి ప్రాణాన్ని నిలబెడుతుంది.

ఒక్క విషయం : పొట్టలో నొప్పులులేకుండా ఉన్న కలరాలో మాత్రం 'విరాట్రం ఆల్బం' పనిచేయదు. యిచ్చినను ఉపయోగము లేదు. (ఫేరింగ్టన్).

10. కలరాలో ఉపయోగించు ముఖ్యమగు మందులను ఆరింటిని వ్రాసి లక్షణములనుకూడ తెల్పుము

1. విరాట్రం ఆల్బ 2. కేంఫర్ 3. కుప్రంమెట్ 4. రెసినస్ 5. జట్రోఫా 6. ఆర్సినికం ఆల్బ.

1. విరాట్రం ఆల్బ – విపరీతం వాంతులు, విరోచనాలు. అపరిమితమగు చల్లనిచమటలు. ముఖ్యంగా చమటలు నుదురుపై పడుతాయి, విదాహం; ఉదరంలో భరించరానిపోట్లు. కండరాలలో కొంకర్లు.

2. కేంఫర్ : ఒళ్ళు చలువలు కమ్ముతాయి. రోగి కొయ్య బారుతాడు. దీనికి ఎక్కువగా విరోచనాలుగాని, వాంతులుగాని లేకుండానే రోగి స్పృహతప్పుతాడు. ఆమీాదట ఒకప్పుడు పెదవి పైకి లాక్కుపోయి పళ్లు బైటపడుతాయి. శరీరమంతా చల్లబడిపోతుంది.

కుప్రం : కేంఫర్‌వల్ల గుణము కనుపించనిచో వెంటనే కుప్రంను వాడాలి (హానిమన్).

కొంకర్లు ఉంటే కుప్రంకు మించిన మందులేదు. వాంతులకు కూడ యిది నిరుపమానమగు మందు. ప్రధమంగా ...వా మందు...

కొంకర్లు కాళ్ళ వేళ్ళలో ప్రారంభిస్తాయి. మితిమీరిన నిస్త్రాణ. కాళ్ళు చేతులూ చలువలు కమ్ముతాయి. నాభిదగ్గర అమితముగా నొక్కుతు న్నట్లుంటుంది. రోగి వెచ్చటినీరు త్రాగాలంటాడు. మూత్రం అయితే కొద్దిగా అవుతుంది లేదా స్తంభిస్తుంది. నీరు త్రాగితే వాంతిబేధి కొస్త తగ్గుతుంది. విరోచనాలూ వాయువుతో కూడి పెద్దవిగా అవుతాయి.

4. రెసినస్ : ఏమాత్రంకూడ బాధ వుండదు. కడుగులాటి విరోచనాలయి, ఒళ్ళు చల్లబడి చల్లని చమటలు వడుతాయి. అమిత దాహం; గుండెలలో మంట. మూట. నాడి నీరసిస్తాయి. మూత్రం స్తంభిస్తుంది.

5. జట్రోఫా : వాంతి విస్తారంగా వుండడం ప్రధానం. కోడి గ్రుడ్డు సొనలా తెల్లగావుంటుంది వాంతి. విరోచనాలు గొట్టముతో కొట్టినట్లు అవుతాయి. కడుపులో గుళ్ళు - గళ్ళు మంటూ ధ్వనులు. ఒళ్ళు చలువలుకమ్మి నాడి ఒకప్పుడు దొరక నేదొరకదు. చల్లని చమ టలు. పిక్కలలో ఈడ్పులు. మలం గట్టిగా ముద్దలా ఉంటుంది; నీళ్ళలా పల్చగామాత్రం ఉండదు.

6. ఆర్సెనిక్ ఆల్బం : నిస్త్రాణ, విరోచనం, వాంతి ఒకే కాల ములో అవుతాయి. ఆరాటం, గాబరా, అర్ధరాత్రి ప్రకోపం. కొద్ది కొద్దిగా తరచు నీళ్ళు త్రాగడం లేక తరచు ఆరుకుపోయే నోటిని చల్లని నీటితో తడుపుకోవడం, అమితంగా మరణభీతి దీని ప్రధాన లక్షణాలు. ఇతరులు మాట్లాడితే రోగి ఏమాత్రం సహించలేడు. ముక్కు కుదురల్లా వాస్తుంది. దప్పితీరని దాహం, త్రాగినవెంటనే నీటి వాంతి అవుతుంది. శ్వాస మందంగా ఆరాటంతో కూడి వుంటుంది. పొట్టలో నాభివద్ద పోట్లు, మంట.

11. ఎట్టి జ్వరలక్షణములలో "వెరాట్రం ఆల్బం" వాడాలి?

విషప్రారితమగు మన్యం జ్వరంలోను, వాపులతోకూడి రక్త ధాటితోనున్న జ్వరములలోను వాడాలి. ఒళ్ళు అమితముగా చల్లబడి విదాహంగా ఉండి, నుదుటపై విస్తారం చమటలు పడుతూ నిస్త్రాణగా వుండి రోగి కృంగిపోతున్నప్పుడు వాడాలి.

12. "వెరాట్రం ఆల్బం" యొక్క సాధారణ లక్షణాలను పదునైదు పంక్తులు మించకుండా వ్రాయుము.

నీరసం, నిస్సత్తువ, క్రిమంగా సొమ్మసిల్లి రక్త ప్రసారం క్రిమంగా తగ్గుతూ శరీరమంతటా చమటలు పడుతాయి. ప్రధానంగా నుదుటపై ముత్యాల్లా చల్లని చమట బిందువులు పట్టడం దీని ప్రధాన గుర్తింపు లక్షణం.

పిచ్చి : మత సంబంధంగాను, మద సంబంధంగానూ ఉంటుంది. పిచ్చిలో గుడ్డలు చించెయ్యాలని, కోసెయ్యాలని ఉంటుంది. శృంగార సంబంధమగు వాగుడు; ఒకప్పుడు దేవునిగూర్చి పిచ్చికేకలు. ఒకప్పుడు మౌనంగానే ఉంటుంది. అనవసరంగా కదిపామా పిచ్చితో తారాజువ్వలా లేస్తుంది. తిడుతుంది. ఏవేవో పేర్లు పెడుతుంది; పరనింద.

కడుగు నీటిలాటి విరోచనాలు అపారంగా వెళ్ళి ఒళ్ళు చల్లబడి కమ్మి పిక్కల్లో యీడ్పులు ప్రారంభిస్తాయి. కడుపులో తేమలో ఉండుటచే కీళ్ళనొప్పులు; రోగిని పడుకోనివ్వవు. దీనికి నొప్పివల్ల పిచ్చిగా ఉండి సంధి పేలాపనలా పేల్తాడు స్రావాలన్నీ అపారంగా అవుతాయి; వాంతులు, బేధులు, మూత్రం, లాలాజలం, చమటలూ.

పుల్లటి పదార్థాలు కావాలంటాడు రోగి.

వికారం, వాంతులు అవుతున్నా పొట్టలో నములుతున్నట్లు ఆకలి అవుతుంది (సెపియా). భోజనమయ్యాక పొట్టలో వెలితిగా ఉంటుంది. రోగి పళ్ళు పడకపోయినా తినాలని వాంఛిస్తాడు. త్రాగిన నీళ్ళు గొంతుకలోంచా పోక పయటకు పోతున్నట్లు రోగి భావిస్తాడు. (యుపి-[illegible] గమనించాలి). ధాతువులన్నీ క్షీణించి అకస్మాత్తుగా రోగి సొమ్మసిల్లి పోతాడు. వడిశెల్తే మంచుగడ్డ ఉన్నట్లు భావం.

సంఘంలో తనకు ప్రపంచ స్థానం లేదని నిస్పృహ, నిరుత్సాహం; కామవృత్తి లేక మదనిష్ఠ.

నల్లమందు తినడంచేత, పొగాకు నమలడంచేత కలిగే దుష్ఫలితాలకు మంచిమందు. వాంతిలో కూడిన దగ్గు.

కోరింత దగ్గులో తిన్న అన్నం వగ్గి వాంతి చేసుకొనునప్పుడు యీమందు పయోగించగా పనిచేసింది నా అనుభవంలో; వుబ్బసవ్యాధిలో ఊపిరందక రోగి ఉక్కిరిబిక్కిరవుతాడు గుండె లాగుచున్నట్లు వున్నప్పుడు యీ మందును వాడాలి. ఝుమ్మనుకొని కలరా వచ్చినప్పుడు నిరుపమానమైన మందు; అమితమైన శోష. చల్లని నీరు త్రాగాలనే అమితదాహం. మంచుగడ్డ తినాలనే వాంఛ.

విరోచనానికి ముందు కడుపులో నొప్పి; కడుగు విరోచనాలు కలరాలో మూత్రం స్తంభిస్తుంది. మలబద్ధం; విరోచనానుమానమే ఉండదు, నల్లని పెంటికలలా పెద్దగా విరోచనాలవుతాయి.

ఋతు సమయంలోను, ఝుమ్మనుకున్నా, ఏమాత్రం కదలినా, తాకినా వ్యాధిలక్షణాలు ప్రకోపిస్తాయి.

# 145. జింకం మెటాలికం (Zincum Metallicum)

1. జింకం పట్టు ప్రధాన కృషియేమి ?

జింకం ఆమూలాగ్రముగా ఋజువు కాబడిన ఏంటి - సోరిక్. దుర్బలదేహులకు నరముల నిస్సత్తువకు వాడేమందు. దీని స్థానము నాడీ మండలము. "రక్తమునకు లోహమెట్టిదో నరములకు జింకం అట్టిది" అని బన్టుగారు అంటారు.

2. "జింకం" చాలా మోతాదులు వాడుటచే కలిగే విషపరిణామము లేమి ?

జింకు లవణములు విస్తారం సేవించుటచే శరీరముపై జలదరా రంభమై చీమలు పాకుచున్నట్టుండును. మర్దనావలనను, అదిమిపట్టుట వలనను జల ఉపశమించును. ఒకప్పుడు ధనూరింపు శరీరమంతటా ప్రతి ధ్వనించుచున్నట్లుండును, రోగి దీనితో బాధపడుటేగాక చూచువార లకు కూడ కనుపిస్తుంది. అది క్రమముగా ఘనీభవించి రోగి శోషిం చును; దారుణమగు వికారము; ఒళ్ళు తిమ్మెరలు సంభవించును. త్రాగిన నీరు ఉదరములోనికి చేరినది తడవుగా వాంతి అవుతుంది. ఈ వాంతులు ఆమ్లము లేక పులుపు ఏమాత్రము తీసికొనినను ప్రకో పిస్తాయి. ఈ రోగులకు వికారముగా నున్న తగదాయని నిమ్మరసము గాని, వెనిగారుగాని యిచ్చిన ఉపశమింపక హెచ్చుటేకాక ప్రకోపిస్తుంది. దీనికి తోడు తల తిరిప్పు; కళ్ళు దగ్గరకు బిగలాగుకు పోవుచున్నట్లుం డడం. ముక్కు మొదట గట్టిగా నొక్కుచున్నట్లు భారముగా ఉంటుంది ఈ లక్షణము క్రమముగా వృద్ధిచెంది సరియగు విరుగుడు పడనిచో ఈడ్పులు మగత వచ్చి క్రమముగా రోగి మృత్యు నోట బడును. (ఫేరింగ్టన్)

3. "జింకం" యొక్క విషముకు లోనైన రోగివిషయంలో తీసి కొనవలసిన జాగ్రత్తలేమి ?

జింకు విషగ్రస్తుడగు రోగికి మత్తుపదార్థములుగాని, ఉద్రేక హేతువగు ఔషధముగాని ఆమ్ల పదార్థములుగాని యివ్వరాదు. ఇచ్చినచో జింకంరోగి యొక్క లక్షణములు అన్నియు హెచ్చి పోవును.

4. "జింకం" లోహపరిశ్రమలో సంవత్సరముల తరబడి పనిచేయు కార్మికులు పొందే బాధలేమి ?

నడుము నొప్పి, పట్టు తప్పిపోవును. పాదాలు అతి సున్నితం. కాళ్లు జిల, తిమ్మెరలు— తాకితే చల్లగా ఉంటాయి. పొట్టచుట్టునా తాడు బిగించినట్లుంటుంది. కండరాలు యీడ్పులతో కూడి అదురుతాయి. అవయవాలు అదురుతాయి. యీ రోగి చీకట్లో నడువలేడు కండరాలు దుర్బలమై తమ కర్తవ్యాన్ని సక్రమంగా నిర్వర్తించే సున్నితాన్ని కోల్పోతాయి. అందుచే చీకట్లో నడిస్తే తొట్రుపడి నడకసాగక తూల్తాడు. కండరాలు అదురు క్రమంగా కంపవాతంలోకి దిగుతుంది. కాళ్లను సర్వదా ఆడిస్తుంటాడు. ఒకప్పుడు నరాలు బలహీనమై పట్టుతప్పి కాళ్లు బిగుసుకుపోతాయి. క్రమముగా రక్తహీనమై పాండిరించి క్రమంగా క్షీణిస్తాడు. ఇది ప్రధానంగా నరాలపై పనిచేయుటచే నాడీమండలం యావత్తూ బలహీనమై రోగి కృంగిపోతాడు. నరాల దౌర్బల్యం వలన అన్నివ్యాధులు అందుముఖ్యంగా చర్మవ్యాధులు లోలోపలే అణగారిపోతాయి. దీని ఫలితంగా అంతర్గతమగు ప్రధాన కోశములు భయంకర వ్యాధులకు లోనై ఆకార్మికుడు కృంగి కృశిస్తాడు.

5. నరాల దౌర్బల్యంవలన కలిగే పెక్కు వ్యాధులను "జింకం" ఏవిధంగా నివారిస్తుందో నిరూపించుము.

నరాల దౌర్బల్యంచే రోగిలోని వ్యాధి సక్రమముగా వృద్ధిచెందిక్రమంగా నివారింప బడక నరములలో తగినంత బలము లేక అణచిపెట్టబడి అనేక భయంకర వ్యాధులకు దారితీస్తుంది. అట్టి వారికి జింకం అమూల్యమగు మందు. ఆతరిలో 'జింకం' నాడులకు బలమును చేర్చి అంతర్గతంగా అణగారియున్న వ్యాధిని బహిర్గతమొనర్చి సంపూర్ణముగా నివారించి రోగికి స్వస్థత చేకూరుస్తుంది.

ఈ నరాల దౌర్బల్యంచే మసూచికము, ఆటలమ్మ మొదలగు చర్మగత అంటువ్యాధులందు పొక్కులు సక్రమంగా పైకి తేలక వ్యాధి అంతర్ముఖమై మేధస్సుచెడి రోగి మృత్యువాత పడేస్థితిలో "జింకం" చేయు పని నిరుపమానము. నాడీ మండలానికి బలాన్ని చేర్చి వ్యాధిని చర్మగతముచేసి, వ్యాధిగ్రస్థమగు ఆంతరంగిక అమూల్యకోశాలను చెడకుండ కాపాడి రక్షిస్తుంది రోగిని.

ఋతు కాలంలో నరాల బలక్షీణంచే సక్రమంగా మైల స్రవించని కారణంచే గర్భపిండాలలో పోటు, బాధ సంభవిస్తే "జింకం" వాడకం వలన నరాలకు బలం చేకూరి మైల స్రవించి గర్భపిండాల బాధ నివారణ మవుతుంది.

ఉబ్బసం వ్యాధిలో రోగికి తగు బలముంటే కళ్ళె తెగిపడి రోగికిస్వస్థత చేకూరుతుంది. తగు బలం లేకపోతే కళ్ళె తెగిపడక రోగి చాల బాధపడుతాడు. ఆస్థితిలో జింకం వాడితే రోగికి బలం చేకూరి కళ్ళె తెగిపడి బాధావిముక్తుడౌతాడు.

పిల్లలకు పళ్లొచ్చే సమయంలో పళ్ళు మొలిచేశక్తి లేక పిల్లలు అనేక భయంకర వ్యాధులకు లోనౌతారు. జింకం బలం చేకూర్చి సక్రమంగా పండ్లు మొలచి బాధలేకుండా చేస్తుంది.

యుక్తవయస్సుగల స్త్రీలకు తగు నాడీబలం లేక సకాలంలో పుష్పవతులు కారు. తత్ఫలితముగా చాలవ్యాధులకు లోనగు సమయములో జింకం ఆయువతుల నాడీమండలమును బలకరంచేసి రజస్వలను కల్పించి ఆరోగ్యాన్ని సమకూరుస్తుంది. ఒక్క మాటలో చెప్పాలంటే నరాల దుర్బలత్వంవల్ల కలిగే వ్యాధులన్నిటికీ "జింకం" పరమౌషధం.

6. బిడ్డలకు సకాలంలో పళ్లు పొటకరింపకపోవుటచే వచ్చువ్యాధులలో "జింకం" నివారించగల వ్యాధులేవి ?

శిశువు మగతగా ఉంటుంది. రోగి శిరస్సును తలగడ క్రింద నొక్కిపెడుతుంది. అరమోడ్పు కంటితో మెల్లచూపు చూస్తున్నట్లుంటుంది. ముఖం తెల్లనై చల్లబడుతుంది. నాడి మందంగా నీరసించి పెద్ద అల్లా నాళాలగుండా రక్తం ప్రవహిస్తుంది. మధ్యమధ్య కేక వేస్తూ శిశువు కంపిస్తుంది. ముక్కులో దురదచే వ్రేళ్ళు ముక్కులోనికి పోనిచ్చి కెలుక్కుంటుంది. ఎండిన పెదవులు గోళ్ళతో గిల్లుకుంటుంది. కొన్ని అవయవాలు నిర్నిమిత్తంగా ఆడుతాయి; ముఖ్యంగా చేతులు భుజాలు, కాళ్లను విరామం లేకుండా ఆడిస్తాడు. ఇది "జింకం" కు ప్రముఖ లక్షణం. రోగి స్పృహలోవుంటే ఆతృతతో అంతులేని నీరు తాగుతుంది. తల విరామం లేకుండా తలగడపై ఇటు అటు దొర్లిస్తుంది లేక ఆడిస్తుంది. ఒకక్షణం "కెవ్వు"న కేకవేసి కొంకర్లతో పైకి లేవబోతుంది. పళ్ళు లేక చిగుళ్ళు కొరుకుతుంది. కళ్లు తిప్పేస్తుంది. ఈలా ఫిట్సు వచ్చేముందు రోగి "చిర్రి బుర్రి"లాడుతుంది; కోపం. మంకుతనం. ఈస్థితిలో 'జింకం' నరాలకు బలంచేకూర్చి రోగిలో చైత

న్యం కలిగించి రోగం నివారిస్తుంది. ఈ లక్షణాలు విద్యార్థి హృదయ ఫలకముపై గాఢంగా హత్తుకొనుటకు నా అనుభవంలో నివారణకాబడిన ఒక రోగి లక్షణములను ఉదాహరిస్తున్నాను.

నరసాపురం కలెక్టరుకచేరిలో సిరస్తాదారుగా పనిచేయుచున్నారు రోగి తండ్రి. ఈయనకు పిల్లలు లేక లేక 45వ యేట కలిగిన ముద్దుబిడ్డ యీ రోగి. 1932 సం॥లో నేను మధుర కారాగారాన్నుంచి విడుదలై క్రొత్తగా వృత్తిలో ప్రవేశించిన రోజులవి. ప్రథమభార్యకు పిల్లలు కలుగలేదని రెండవపెళ్ళి చేసుకుంటే రెండవ భార్యకు వివాహమైన 10 సం॥లకు జన్మించిన గృహదీపం యీ రోగి. అల్లారుముద్దుగా ఆనందంగా ఆకుటుంబం ఈ శిశువుతో కాలక్షేపం చేస్తున్నారు. సంవత్సరంలోపు బిడ్డ.

పళ్ళు సరిగారాక పురువాసనాలతో బాధపడుతుంటే స్థానిక ప్రభుత్వ ఆసుపత్రిలో మందిప్పించారు. బహుకష్టంపై పదిరోజులకు విరోచనాలు కట్టాయి. తరువాత ఒకరోజు సాయంకాలం పెళ్ళుమంటూ కన్నూ - మిన్నూ కానకుండా జ్వరం, చలి, కుదుపు వచ్చాయి. ఆ డాక్టరుగారే జ్వరానికి మందీయగా రెండవనాడు ఉష్ణం 96°కు దిగిపోయింది. తరువాత మగత; తల ఆడించడం; ఉండి ఉండి కెవ్వుమని కేకవెయ్యడం; జ్వరం తిరిగి 104°వరకు వచ్చి కొన్నిగంటలలో 98°కు పడిపోయింది. ఒకచెయ్యి ఒకకాలు మధ్యమధ్య ఆడిస్తూవుండేది. తల్లిదండ్రుల ఆదుర్దాను, పిల్లస్థితినిచూచి డాక్టరుగారు ఎన్ని యింజక్షన్లిచ్చారో లెక్కలేదు. అందుచే యీ బాధకుతోడు బిడ్డ చెయ్యి ఒకచోట వాచిపోయింది. ప్రత్యేకం దానికికట్లు, కాపడాలు పురమాయించారు. ఇలావుండగా ఒకరాత్రి 8 గంటలకు శిశువుకు కొంకర్లు ప్రారంభమయ్యాయి. ఆదుర్దాతో తండ్రి డాక్టరుగారిదగ్గరకు వెళ్ళగా

ఆయన పెదవివిరచి ఎన్నితంటాలుపడ్డా మాట వచ్చేటట్లులేదు. ప్రస్తుతం ఏమిచేసినా ప్రయోజనం వుండదు. ఉదయాన్నే వచ్చి చూస్తాను. హాస్పిటలుకు వెళ్ళి ముందు ఎవరికైనా కబురుపంపండి అన్నారు. (బహుశః అప్పటికి కథ అంతా ముగింపు అవుతుందని తలంచివుండాలి.)

పాపం! ఆ తండ్రి కొయ్యబారిపోయి తుదకు ఒక స్నేహితుని వెంటబెట్టుకొని రాత్రి 10 గంటలకు నాదగ్గరకొచ్చారు. కూడావచ్చిన వారు కాంగ్రెసువాది, నాకు పరమఆప్తులు రోగి తండ్రి కంటతడి పెడుతూ బిడ్డయొక్క పూర్వ ప్రస్తుత పరిస్థితులను చెప్పి ఒకమారు బిడ్డను చూడమని కోరారు. వెళ్ళిచూసేసరికి బిడ్డ విపరీతమగు కొంకర్లతో బాధపడుతోంది. చూపుకూడా మారిపోయింది. యిద్దరు తల్లులు చెరోప్రక్కనా ఏడుస్తూ కూర్చున్నారు. మందుకు ఎవరినైనా పంపమని నేను తిరిగి యింటికి వచ్చేశాను.

ఒక గ్లాసులో ఒక ఔన్సు నీళ్లు పోసి మూడుచుక్కలు జింకం వేసి అరగంట అరగంటకు కొంకర్లు తగ్గేవరకు ఒక మిల్లెగరిటెడు చొప్పున యివ్వమని చెప్పి అగత్యమైతే సంకోచింపక నన్ను లేపమని చెప్పాను.

తెల్లవారగట్ల 2 గంటలు దాటాక పాపం శిశువు తండ్రివచ్చి నన్ను లేపి నా రెండుచేతులు పట్టుకొని శిశువుతో నాయింటిదీపం ఆరిపోతుంది. నేను జీవించిమాత్రం ఏమి ప్రయోజనం; బిడ్డకు కొంకర్లు తగ్గాయి. చూపుమాత్రం లేదు. కదలిక, మెదలిక లేదు. ఒక్కసారి వచ్చి చూడండి ప్రాణంతో వుందో లేదో అని బేరుమన్నాడు.

ఆదుర్దాగానే వెళ్ళి చూసేసరికి కొట్టేసిన పాములా పడిఉంది, మంచంమీద నాడిచూస్తే వెనుకటికంటె ఫరక్కుంది. "జింకం" చేసిన

